# ఆంధ్రపత్రిక

## దుందుభినామ
## సంవత్సరాది సంచిక

[డెబ్బది రెండవ సంచిక]

[1982-'83]

వ్యవస్థాపకులు : శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు

★

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

[1938-'72]

★

సంపాదకుడు : శివలెంక రాధాకృష్ణ

వెల రూ. 5-00

ఆంధ్రపత్రికా కార్యాలయమున ముద్రితము

**Supplement to Andhra Patrika Issue Dated 26-3-'82**

**Regd No. Y/VJ No. 49.**

దుందుభినామ సంవత్సరాది సంచిక

# విషయానుక్రమణిక

సంచిక 72 సంవత్సరము 1982-'83



ముఖచిత్రం: శ్రీ కొండపల్లి శేషగిరిరావు

# స్వవిషయం

కొత్త సంవత్సరంతో పాటు కొత్త ఆశలు కలుగటం సహజం. 1980 లో కొత్త కేంద్ర ప్రభుత్వం ఏర్పడినప్పటి నుంచీ అభివృద్ధి విధానాలలో కొన్ని మార్పులు రావటం ఎందరో గమనించారు. పిడివాదాలు మాని ప్రయోజనాలకి పనికివచ్చే విధానాలు అనుసరించటం మొదలయినదని వ్యాఖ్యాతలు అంటున్నారు అమెరికా సంయుక్త రాష్ట్రాలు, బ్రిటన్‌లో ఎక్కువగా ప్రచారంలో ఉన్న సిద్ధాంతాలు కొన్నిటికి భారతదేశంలో ప్రతిధ్వనులు వినపడుతున్నాయంటే అతిశయోక్తి కాదు. అయితే, అమెరికాలో కూడా అక్కడ అమలు చెయ్యబడుతున్న విధానాలపట్ల అసంతృప్తి తీవ్రంగానే చెలరేగుతోంది. ఇక భారతదేశంలో కొత్త విధానాల విమర్శకి కొదువ ఉండదని ఊహించటంలో తప్పులేదని పిస్తుంది. కొన్ని దశాబ్దాలుగా ఇక్కడ మంచి ప్రాచుర్యం తెచ్చుకొనగలిగిన వివాదాలని కాదని కొత్త విధానాలని అనుసరించటం తేలికకాదు. ప్రభుత్వంవారు తమ విధానాలని వ్యతిరేకించే విమర్శని ఏ విధంగా ఎదురుకుంటారో చూడాలి. భారతదేశంలో ఏమి మార్పులు వచ్చినా ప్రభుత్వ పరిపాలనా యంత్రాంగం యొక్క భారం తగ్గే సూచనలు కనపడటంలేదు. ఈ భారం వలన ఉత్పత్తి పెరిగే అవకాశాలు ఏవీ ఏర్పడకపోగా ఉత్పత్తికి అవరోధాలుగా నిలిచేవే క్రమంగా అధికం అవుతున్నాయని సందేహంలేకుండా అనవచ్చు ఉగాది సందర్భంలో తెలుగువారి రాష్ట్రంలో వచ్చేమార్పులని తలుచుకొనక తప్పదు. ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్య మంత్రి పదవికి ఉన్న విలువ ఎంత పడిపోయిందో ఇటీవలే జరిగినదంతా స్పష్టంగా తెలుపుతోంది. ఇది విషాదం కలిగించతగిన పరిణామం అయినప్పటికీ కొత్త సంవత్సరంలో ఆశాజనకంగా ఉండే మార్పులు ఎన్నో రాగలవని ఎదురు చూడాలి.

# అ ర్ణ వ ము

**శ్రీ వజ్ఝల కాళిదాసు**

కడలి తరగలు విరిగి పడుచో
 వెడలు శీకరములు కనంబడె
చాలులై విరజిమ్మ బడు ము
త్యాల సరములుగా !

వరుణదేవుని వారు వమ్ములు
ధరణి మీదికి దాడివెడలెడు
కరణి నురగలు గ్రక్కుకొనుచున్
బరుగులిడు తరగల్ !

పుడమి నంతయు నొక్కపెట్టున
ముంచివేయగ జాలు వడితో
వీచులెన్నో లేచివచ్చియు
వెనుకకే మరలున్ !

అంతరిక్షమునుండి చూచిన
వింత వింతల యానపాత్రము
వోలె విశ్వము కనంబడు క
ల్లోల వేష్టితమై !

శాంతియున్ విశ్రాంతి యెరుగక
సంతతము క్షోభించు వార్నిధి
యంతరంగమునందు రేగును
బడబ వహ్ని శిఖల్ !

శరావాకాశమ్ముక్రిందన్
ధరా వనౌషధులన్ వండెడి
తరిన్ పొంగులు వారుచున్నవి
తరంగ శ్రేణుల్ !

ప్రశాంతంబగు నిశీథమ్మున
విశాలాంబర వీధి గ్రుమ్మరు
తమోరాశులు ధరంబడెనా
తరంగమ్ములుగా !

ధరా ధరముల శిఖరములపై
శిరోవేష్టములైన మొగిళుల
తురాయిలుగా మెరయు మెరుపుల
సరణి నున్నవి నురగల్ !

అగాధము నీరంధ్ర నిబిడం
బమావాస్యోపమం బంబుధి
సినీవాలీ సిరుల దాల్చెను
ఫేన రేఖలతో !

సూర్య చంద్రుల శుభ్రదీప్తులు
తారకాగ్రహ ధవళ కాంతులు
నిచట కుప్పలు వేసినారా
యిసుక తిన్నియల !!!

రోదసీ కుహరమ్ములే మా
ర్మ్రోగ గర్జా ముఖర భీకర
మహోత్కలికా మహత్యుద్గత
కుహరితమ్ములకు !

విలయ ఝంఝా మరుద్వేగో
ద్వేల నిర్ఘాతాంతరంగము
పగిలిపోయినదేమొ ఘూర్ణిలు
వారివిధి లోనన్ !

వృధాయాస వ్యధా క్షోభలు
క్షుధా బాధా కుధా కూష్మము
వధానార్తి ప్రధాన వేదన
వారినిధి ఫేనాషల్

# అ ర్ణ వ ము

అనంతావధి కన్నుగీటులు
పార రహిత ప్రవాహమ్ములు
కడ లెరుంగని గాఢవాంఛలు
కడలి కదలికలు !

కాంతి చంద్రిక, రంభ, మేనక,
మదన, మోహిని, ఘృతాచి, చిత్ర
రేఖ అచ్చర మచ్చె కంటుల
గన్న పాథోధి,

చలువ వెన్నెల లొలుకు జాబిలి
పసిమి వన్నెల పైడి పడతుక
అమర జీవద మమృతభాండము
గన్న పాథోధి,

విశాలోర స్స్థలము విస్తుల
భావ కల్లోలితం బైనన్

వినీలాగాధంబు గర్భము
ఘృణా విరహితము !

విధుర జీవన విరహబాధా
విషం చీగళ వినిర్ముక్త
ప్రవాహాశు క్షార రుచి ని
క్షేప మీ జలధి !

శీర్ణ భిక్షుక జీర్ణ కోశము
ఘూర్ణితాశా తూర్ణపాశము
దూర్ణరాత్రీ చూర్ణకేశము
లర్ణ వోత్కలికల్ !

విశ్వమంతయు జుట్టివైచిన
విజయ గర్వము విజృంభించగ
కోటి చేతుల గొట్టలేచును
మింటి కర్ణవము !



## శ్రీ చల్లా రాధాకృష్ణ శర్మ

# తమిళ మినీ కవితలు

ఒకనాడు మహా కావ్యాలు, ఆ తర్వాత ఖండకావ్యాలు సాహిత్య ప్రపంచంలో వెలుగులోకి వచ్చి ప్రచుర ప్రచారం గడించినట్లుగా ఈనాడు మినీ కవితలు పత్రికా ముఖంగా నైతేనేమీ పుస్తక రూపంగా నైతేనేమి వరళ్శతంగా వెలువడుతున్నాయి, పాఠకుల్ని అలరిస్తున్నాయి. ఒక సాహిత్య ప్రక్రియగా మినీ కవిత స్థిరపడింది.

తెలుగులోవలె, తమిళంలోనూ మినీ కవిత బాగా ప్రచారంలోకివచ్చింది. ముఖ్యంగా పత్రికలలు,అందులోనూ చిన్న పత్రికలు, ఈ ప్రక్రియకు ప్రాముఖ్య మిస్తున్నాయి. ఇటీవల మినీ కవితల సంపుటాలు కొన్ని పుస్తక రూపంలో వెలువడడం గమనించదగిన అంశం.

ఏక విషయాశ్రయమూ వ్యంగ్య ప్రధానమూ అయిన లఘు రచనను మినీ కవిత అనవచ్చు కనుక ఇందులో అప్రస్తుత విషయాల ప్రసక్తి వుండదు, డొంక తిరుగుడు ఉండదు. తాను చెప్పదలచిన విషయాన్ని కవి సూటిగా సంగ్రహంగా స్పష్టంగా వివరిస్తాడు సంక్షిప్తత మినీ కవితకు జీవం. కాగా అది పాఠకుణ్ణి అనాయాసంగా ఆకట్టుకుంటుంది వ్యంగ్య ప్రధానం కావడం వల్ల, ఆలోచింపజేస్తుందికూడా మలయాళంలో ఈమధ్యకార్టూనుకవితలంటూ వస్తున్నాయి. ఇవికూడా మినీ కవితలే ఈ కోవకు చెందిన కవితలలో వ్యంగ్యానికి పై చెయ్యి అనే అంశాన్ని కార్టూను కవిత అన్న పేరు చెప్పక చెపుతున్నది. ఇక కొన్ని తమిళ మినీ కవితల్ని పరిశీలిద్దాము.

"రాత్రి వేళ వచ్చింద
ఇంకా తెల్లారనే లేదు."

మన స్వాతంత్ర్యం గురించి ఒక రచయిత చెప్పిన రెండే రెండు పాదాల కవిత యిది. మనం ఆశించినట్లుగా, స్వాతంత్ర్యానంతరం కూడా మనల్ని కమ్ముకున్న కష్టాల చీకట్లు తొలగ లేదనీ, సౌఖ్యమనే వెలుగు యింకా రాలేదనీ యీ రెండు పంక్తుల్లో కవి వ్యక్తం చేసిన తీరు. ప్రశంసార్హం.

బాలకుమారన్ అనే రచయిత దర్శించిన నగరాన్ని పరికించండి.

"పక్షులు నివసించే
పెద్ద చెట్లు పడిపోగా
మనుషులు నివసించే
రాతి చెట్లు పెరిగిన అడవి."

ఆ మధ్య ఏ రోజు పత్రికలో చూసినా దొంగ రవాణా దార్లకు సంబంధించిన విషయాలు ప్రముఖంగా కనిపిస్తూ వుండేవి. ఆ విషయాన్ని ఒక రచయిత హితోపదేశం అనే యీ కింది కవితలో హృద్యంగా తెలియజేశాడు.

"అలం కడలినైనా దాటి
అర్థం ఆర్జించమని
పెద్దలు సెలవిచ్చిన
హితోక్తి ననుసరించి
ఆర్జించాడు అర్థం.
ఆర్జించిన అనంతరం
నాకు లభించాయి
దొంగ రవాణాదారు
అనే ఒక బిరుదూ
కారా గృహ శిక్షా."

అలం కడలినైనా దాటి అర్థం ఆర్జించమని తమిళంలో రుచికరమైన సామెత ఒకటి నేటికీ వాడుకలో వుంది ఈ సామెతను వ్యంగ్యంతో రంగరించి, సమాజంలో రూపుదాల్చిన ఒక చెడుని రచయిత తెలియజేసిన వైనం ఎంతైనా కొనియాడ దగింది.

గృహ యజమాని కోపతాపాలు ఎన్ని అవతారాలు ఎత్తుతుందో, ఆ విషయాన్ని తిరుమావళవన్ అనే రచయిత చేసిన తుఫాను హెచ్చరిక నుంచి అనాయాసంగా గ్రహించవచ్చు.

'హృదయార్ణవంలో
కేంద్రీకరించిన తుఫాను
భార్యాపుత్రుల వైపుగానో
ఆఫీసు అటెండరు, ప్యూనుల
వైపు గానో

వీయవచ్చు
తత్ఫలితంగా
పై శ్శ ప్రాంతాలలో
ఉరుములతో కూడిన వానో
లేకపోతే
గాలితో కూడిన వానో
కురవ వచ్చు."

నేడు వెలువడుతున్న కొన్ని తమిళ మినీ కవితలలో ఇంగ్లీషు మాటలు కొంచెం ఎక్కువగా కనిపిస్తున్నాయి. అయితే, అవి దైనందిన జీవితంలో తరుచు వినిపించేవి కాబట్టి, ఆ మాటలు ఒక విధంగా ఆ కవితలకు జీవం పోసే విగా వున్నాయి. ము.ని. రామస్వామి వ్రాసిన నెపోటిజం యిందుకు చక్కని ఉదాహరణ.

"మన కమీషనరుగారు
ఐడియల్ వ్యక్తి.
ఆఫీసు కలంతో
సొంత వుత్తరం రాయరు.
సొంత కలంలో
ఆఫీసు సిరా పొయ్యరు.
సొంత వుత్తరం
రాయడం మాత్రం
ఆఫీసు టైములో."

కొబ్బరికాయ చాలా విచిత్రమైనదంటూ ఒక కవి యిలా పేర్కొన్నాడు:

"పూజా సమయంలో
కొట్టినప్పుడు
వంకరగానూ
పచ్చడికి మధ్యగానూ
పగిలే
విచిత్రమైన కాయ."

ఎన్నికల సమయంలో నాయకులు వాగ్దానాలు చెయ్యడం, ప్రజోపయోగార్థం కొన్ని మంచిపనులు చెయ్యడం మొదలైన వాటిని ఒక రచయిత ఎన్నికలు రావాలి అనే కవితలో తేట తెల్లం చేశాడు.

"ఎన్నికల సీజన్లో
వేదిక 'సంత' నుంచి
ఒకాయన యిలా అన్నాడు-
ఈ నియోజక వర్గంలో
మంచినీళ్ళు కావాలంటే
వీధి దీపాలు వెలగాలంటే
రోడ్డు వసతి కలగాలంటే
మధ్యలో ఒకడు
నిలబడి అన్నాడు గదా :
మాటి మాటికి ఎన్నికలు రావాలి."

వ్యంగ్య ప్రధానములైనా, తమిళ మినీ కవితలు చాలావరకు పరుషంగా వినిపించకపోవడం గమనించదగిన మరొక అంశం. నిజానికి కటూక్తులు కాదు, కమ్మని మాటలు వ్యంగ్యానికి జిగి బిగి చేకూరుస్తాయి. పరుషోక్తులు ఆవేశం కలిగిస్తే, లలితోక్తులు ఆలోచింపజేస్తాయి. కమలా మహాళ్య అనే రచయిత వ్రాసిన ఇద్దరు పిల్లలు" కవితను పరిశీలించండి.

"భారత మాత
ఇద్దర్ని కన్నది
ఒకరు స్వాతంత్ర్యం
మరొకరు స్వార్థం.

పెద్దది స్వాతంత్ర్యం
ఇద్దర్ని కన్నది
ఒకరు ప్రజాస్వామ్యం
మరొకరు సోషలిజం.

ప్రజాస్వామ్యమూ
ఇద్దర్ని కన్నది
ఒకరు వోటు
మరొకరు దొంగ వోటు.

పెద్దది సుందరి
చిన్నది కురూపి"

ఇంకా మరికొన్ని మినీ కవితలు చదువుకుని ఆనందిద్దాము :

## పల్లకాటి చిచ్చు

"కాలం సగం
కామం సగం

దహించి వేశాక
శేషించిన యీ శరీరాన్ని
వల్ల కాటి చిచ్చు
ఇంకేం దహిస్తుంది !"

—రాహుల దాసన్.

## అభివృద్ధి

"పత్రికలో పడిన వార్త
దేశంలో వస్త్రోత్పత్తి
ఈ యేడు రెండింతలు
ఎక్కువయింది.
ప్రజలకోసం కాదు
పార్టీ జెండాల కోసం."

—కే. బాలు సామి

## వేచివున్నారు

"బస్సు క్యూ మొదలుకొని
లిఫ్టు క్యూ దాకా
వేచి వుండి
ఉద్యోగంలో ఉన్నతికీ
వేతనంలో ఉన్నతికీ
రేషను సామాన్లకీ
వేచి వుండి
వేచి వుండి
విసిగి వేసారి పోయి
ఇంటికి రాగానే
నా కోసమూ వేచివున్నారు
నా కుమారుడూ కూతురూ
వేచివున్నారు
ఉద్యోగం కోసమూ
ఉద్వాహ వేళకీ.

—అ. ఆశీర్వాదం.

## గుడిసె గొంతు

"అధికారపు బొంగులు
మా జీవితంతో ఒరుసుకుంటాయి
అయితే
మండేవి బొంగులు కాదు
మా కడుపులు !"

—చా. మణి.

## ఎందుకో

మండు టెండలో
వరసలో నుంచుని
ఒళ్ళు వేడెక్కి కాళ్ళు బొబ్బలు పుట్టి
తీసుకువెళ్ళినా
ఆ బియ్యం మాత్రం
ఎందుకో ఉడకలేదు !"

— భక్తవత్సలం.

## కడలీ ఒడలూ

"ఒడలూ ఒక విధంగా కడలే
ఎందుకంటే
ముత్యాలు యిస్తున్నది-చెమట
ముత్యాలు యిస్తున్నది.
కడలీ ఒక విధంగా ఒడలే
ఎందుకంటే
ఉప్పు యిస్తున్నది-చెమట
ఉప్పు యిస్తున్నది.

—నా. వేందన్.

## ఇండియా

"చీకట్లో
అగ్గిపెట్టె వెతికి
కింద పడి
దీపం బద్దలు కొట్టి
గాయ పడడం కన్నా
ఇలాగే వుంటాను
తెల్లారదా యేమిటి ?

— రాయన్

## వరదక్షిణ (కట్నం)

"అద్దె కొంపలకోసం
అటూ యిటూ పరుగెత్తే
ఈ మనుషులు
శాశ్వత గృహాలలో
నివసించేందుకు
గృహ యజమానినే
'అద్దె'అడుగుతున్నారు.

—శివకుమార్

## యాచకుడు

"దేవుడు
ఏమన్నా
రాయా రప్పా
కల్పనా కృతా-
కరుణా సింధువు:
కనుకనే
పొట్ట యిచ్చిన దేవుడు
అతనికి
కాళ్లూ చేతులూ
కనికరించ లేదు."

—హజీర్.

## కత్తులు లేని నెత్తురు లేని

"రౌడీ రంగడు కావించే
పవిత్ర యుద్ధంలో
కత్తులూ లేవు
నెత్తురూ లేదు.
అతను గ్రహించేది
సైకిలు గొలుసు మాత్రమే!
దెబ్బ తగిలిన చోట
ఎముకలే నుగ్గవుతాయి
నెత్తురు రాదు.

—శక్తిక్కసల్

# బాల్యమొక మంత్రనగరి

## శ్రీ సోమసుందర్

జీవిత వృక్షచ్ఛాయల
ప్రేమకొరకు వెదకులాట
ముగియలేదు, ముగియలేదు!
మంచి చెడుల పోరాటం
సమయలేదు, సమయలేదు!

నడికి రేయి చీకటిలో
అడవి పొదల దారులలో
వెలుగు రేక కొరకు పొగిలి
గాలించుట మానలేదు...
తొలగలేదు జీవనార్తి!

లోకపు బీభత్సంతో
ఒణుకు పుట్టు సమయంలో
స్మృతుల మంత్రపేటి తెరచి
బాల్యము నే నర్తింతున -
దయాకిరణ వేశముకై

వర్తమాన జీవితమున
అనవరతం ఆతుర్దా-
కంగాళీ గంద్రగోళ
మశనిపాత భయానకం
సడగ విప్పి తరుముచుండు!

అందుకె ఎప్పుడు మధుర బాల్య
జీవనోత్సవాబ్ధి మునిగి
స్మృతుల రత్నపేటికకై
ఇంద్రజాల శక్తి ప్రకృతి
కంజ లింతు ధ్యాననిరత

# అభివృద్ధిపథంలో

# సహకార రంగం

రాష్ట్ర సహకార సంస్థలు ఆవిర్భవించిన నాటి నుంచి, సహకార రంగములో ఆంధ్ర ప్రదేశ్ గణనీయమైన కృషి సాధించగలిగింది. ఇవి ముఖ్యంగా రైతుల పరపతి అవసరాలకు గాను ఉద్దేశించ బడినవి. దరిమిలా సాంఘిక ఆర్థికంగా యితర పరపతేతర రంగాలలోకూడా సహకార రంగం ప్రవేశించడం జరిగినది.

వ్యవసాయ పరపతి రంగంలో, రాష్ట్ర సహకార బ్యాంకు 1980-81 సంవత్సరానికి స్వల్ప, మధ్యకాలికరుణాలలో రు.90.90 కోట్లు మేరకు రుణాలు యివ్వడం జరిగినది. ఇందులో 58/-శాతంచిన్న మరియు బడుగు రైతులకు యివ్వడం జరిగినది. ఇదికాకుండా రాష్ట్ర వ్యవసాయాభివృద్ధి కేంద్రబ్యాంకు 1980-81సం.లో తనలక్ష్యం రూ. 65 కోట్లుకుమించి రూ.68.18 కోట్లువరకు దీర్ఘకాలికరుణాలనుమంజూరు చేయడంజరిగినది. ఈవిషయంలో ఈబ్యాంకు దేశంలోనే గత మూడుయేండ్లలోనూ అగ్రగామిగ వుంటొంది.

రిక్షా కార్మికులు, రజకులు, నాయీ బ్రాహ్మలు వంటి అనేక బలహీన వర్గాల వారికికూడ పలు సహకార సంస్థలు పనిచేస్తున్నవి

తక్కువ ఆదాయ వర్గాలవారికి, మధ్యతరహ ఆదాయ వర్గాలవారికి మరియు ఆర్థికంగా బలహీన వర్గాలవారికి ఇండ్లు నిర్మించుకొనేందుకు రాష్ట్ర సహకార గృహ నిర్మాణ సంస్థలు ఆర్థిక సహకారము నందించుచున్నవి.

నిత్యావసర వస్తువుల పంపిణీకి మహిళా సూపర్ బజార్లతో సహా, అనేక వినిమయదార్ల సహకార సంస్థలు రంగంలో వున్నవి.

రాష్ట్ర కోఆపరేటివ్ మార్కెటింగ్ ఫెడరేషన్ (మార్క్‌ఫెడ్), ఎరువులు సరఫరాలోనూ, ధాన్య సేకరణలోనూ, వరి తవుడు నూనె తీసే ఫ్యాక్టరీలవంటి ప్రాసెసింగ్ యూనిట్లు నెలకొల్పడంలోనూ నిమగ్నమైయున్నది.

సహకార రంగంలో పేర్కొన దగిన యితర సంస్థలలో, స్త్రీల సహకార పరపతి సంఘములు, వికలాంగల, పాడి పరిశ్రమ, గ్రామీణ విద్యుచ్ఛక్తి వంటి సహకార సంస్థలు కూడవున్నవి.

గ్రామీణ సహకార సంస్థల నిల్వల స్థోమతను పెంచే వుద్దేశంతో, ప్రపంచ బ్యాంకు సహకారంతో, రూ 225 కోట్ల రూపాయల వ్యయంలో 100 మె. టన్నుల కెపాసిటిగల 5000 గ్రామీణ గిడ్డంగులు, 250 మె.టన్నుల కెపాసిటిగల మార్కెటింగ్ గిడ్డంగులు ప్రారంభించబడినవి.

**రాష్ట్రంలో అన్ని వర్గాల ప్రజలకు సేవ చేసేందుకై ఆంధ్రప్రదేశ్‌లో సహకార సంస్థలు కొత్త పుంతలు త్రొక్కుతోంది**

సమాచార పౌరసంబంధాల డైరెక్టరుచే ప్రకటితము, హైదరాబాద్.

D I P.R. No 265/Advt /C3 17.

పరిమళ కిసలయ మెత్తె
నిరతామృత కాంతిలహరి
చేతస్కృత తస్కరించె!
ఏ అదృశ్య హస్తవితతి?
ఏ శాత్రవ ప్రబలశక్తి?

సంశయాల చలిగాడ్పులు
గుండెలదర వీచినపుడు
దాపరికపు యాతనతో
ముందు దారి మంచినపుడు
సుఖాశ్రయమ్మెచటదొరుకు?

కాలగమన వేగలహరి
జ్ఞానకాంతి మెరయకున్న
ఇరుల మూగ గుసగుసతో
చేరవలయు చోటెరుగక
కానని కానల నడకలు .

ముసలి తనపు బరువులతో
ఎగరలేక మిణుకు తున్న
కొక్కిరాయి కాలువిరుగ
దిక్కులేని బ్రతుకున కుప
వాసము ఫలదాయకమే ?

పస్తులు నిస్తుల తేజము
కలిగించునె దరిద్రులకు?
హృదయశాంతి మృగ్యమైన
ఏకాంత తపస్సమాధి
కైవల్యము లందించునె?

చిరు చీమల పరిశ్రమల
నెవరు ప్రోత్సహించువారు?
సంఘ జీవనానుబంధ
మెవరు నేర్పిరీ తేటికి?
బ్రతుకు కదా పాఠశాల!

కడలిలోని నత్తల కెవ
రేర్పరచిరి గుల్లల నగి
షీలు వేయి రీతులలో!
గిజిగాడికి గూడల్లుట
నేర్పిరెవరు? బ్రతుకుతప్ప!

పసితనాల కనులు తెరచి
వేకువ తొలి కిరణరేఖ
గ్రోలి మనసు పులకించగ
దివ్యచేతనోత్సవాల
సంభ్రమించు హృదయమేది?

బాల్యమునకు బాహ్యలోక
మొకే ఒక్క గృహాంతరము
వయసు పెరిగి చదువులెదిగి
పద్దరికము కొంతచేర
ఎన్నిగదులు? మడతలెన్ని?

కనులు చూచు దృశ్యములే
పసితనాల తొలివేళల
మనసు కింద్రజాల మగును .
ప్రకృతి జీవరీతులె_కను
మలచును అక్కజము లగుచు!

బాహిరాంతరాలు రెండు
ప్రపంచాలు ప్రౌఢతకే,
సమశ్రుతులు వేవునడుమ
కొలతలు పడికట్లు విలువ
లెన్ని స్వపర విభేదములు ?

ఎటుపోయెను బాల్యహృదయ
ముబ్బురపడు అమాయకత?
చటులలోక కుటిల వర్త
నాలె నేడు శరణాయెను !
మంత్రనగరి కేది దారి?

బాల్యము సౌజన్యపూర్ణ
మంత్రనగరి! అమరజ్యోతి !
సాంద్రానంద మరీచిక .
మరల తిరిగిరాని మధువు .
నన్ను విడచి ఎటుపోయెను?

మడత మడత మొగలిరేకు
సర్దుకొన్న చిరుతకలల
నీలినీలి చీనాంబర
పటలముపై మెరుపు రేక
లే విధి నేడంటగలవు?

ఎటుపోయెను బాల్యహృదయ?
మెటుపోయెను స్మృతుల సుధా
కలశ? మనిశ దీపోత్సవ—
మరుణారుణ ప్రదోష సం
కాశగగన తేజస్విని?

# ఈ పచ్చదనం నన్ను కాటు వేస్తోంది

## శ్రీ కొడవంటి లీలామోహనరావు

ఈ పచ్చదనం నన్ను కాటు వేస్తోంది
నిద్రించే గుండెను కలవర పెడుతోంది
నాలో మొలకెత్తే వెలితిని ఆదిలోనే తుంచేయనీ
ఈ బీడీతో పళ్ళ మధ్య నమిలి నమిలి ఉమ్మేయనీ.

ఒంటరిగా స్వరతి చేసే సూర్యుడు
లోహపు ద్రవాన్ని కుమ్మరిస్తుంటే

శాస్త్ర విప్లవాన్ని నలుదిశలా
చక్రాలు హోరెత్తి ప్రకటిస్తుంటే

మిల్లు కక్కిన కారుమేఘం
ఛెంగిజ్ ఖాను సైన్యంలా కమ్ముతుంటే

అక్కడక్కడ వెక్కిరింతగా మిగిలిన
ఈ పచ్చదనం నన్ను కాటు వేస్తోంది
నిద్రించే గుండెను కలవర పెడుతోంది
రోడ్డురోలరుతో కసితీరా తొక్కించేయ్
సిమ్మెంటు స్తంభాలను నిలబెట్టి
కరంటు తీగెలను ముడిపెట్టు
ఇవి ఏవీ నన్ను స్పృశించవు
అనవసరంగా సంచలనాన్ని కలిగించవు

డాక్టర్ లేళ్ళపల్లి వెంకట లక్ష్మీనారాయణ శర్మ

# వెనకబడిన కథ

"ఏంవిటి కార్యక్రమం యీ రోజున" అన్నాను గడ్డి మెద కూర్చుంటూ అయిదయిందనిపించేసి ఫైళ్ళు కట్టేసి పార్కులో కొచ్చి పడ్డాం మేం ముగ్గురం.

"సూరి చెప్పాలి" అన్నాడు రామ్మూర్తి.

"ఏం చెప్పమంటారు?" అన్నాడు సూరి.

నా గురించి, రామ్మూర్తి గురించి పెద్దగా చెప్పాల్సిందేమీ లేదుగానీ సూరిగురించి మాత్రం చెప్పాలి సూరికి నామాంతరాలనేకం వున్నయ్. అవన్నీ సమానాంతర రేఖల్లా వుంటయ్ కారణం వాడికున్న మిత్ర బృందాల్లో వక్కొక్క బృందం వాణ్ణి వక్కొక్క పేర్తోనే పిలుస్తయ్, అందువల్ల యే రెండు పేర్లూ క్లాష్‌కావు వాడికి యెప్పుడూ దగ్గర వుండే వాళ్ళు మాత్రం వాడిని దూరం నుంచి సూరి అనీ, దగ్గర్నుంచి మరింకోటి అతికించి పిలుస్తారు. వాడికి దూరంగా వుండేవాళ్ళు దగ్గర్నుంచికూడా "సూర్యంగారూ" అనే పిలుస్తారు మా ఆఫీసరు మాత్రం "సి. సూర్యారావ్" అని పిలుస్తాడు. "పేరు నిలుపు కోవాలి" అన్నది ఆయన "మోటో". ఎప్పుడూ మాతో ఆ మాటే అంటాడు తలుపు మీద తన పేరు నిలుపుకుని పిలుపుల్లో మా అందరి పేర్లూ పూర్తిగా పలుకుతాడు. దాని వెనకాలో కథుంది.

కథ వెనకాలుండే కథలు అసలు కథకి కళ్ళాలు వేస్తయ్. దాని కాళ్ళు కట్టేస్తయ్. దాన్ని ముందుకు పోనివ్వవ్. అసలందు కోసమే ముందు కొచ్చే వెనక కథలూ వున్నయ్ "ఈ కథ కథేంవిటో చివరకుగానీ తెలియదు - మీకేకాదు, నాక్కూడా. రచనా ప్రక్రియ లెన్నిలేవూ? అందులో యిది ఒక క్రియ అనుకోండి, వక్ర ప్రక్రియ అయితేనేం గాక" అంటాడు మా సూరి. ఈ మాటలు వాడెందుకు చెబుతాడో, యెప్పుడు చెప్తాడో యీ కథ ముందుకి కదిత్తే (?) తెలుస్తుంది "కథ ముందుకు కదలినాపరిణామదశలలో అది నవలై కూర్చుంటే విషయాలెప్పుడు తెలుస్తయో యెవరికీ తెలియవ్"— యిదీ సూరి వువాచే. క్షమించాలి. మా సూరిని పూర్తిగా పరిచయం చెయ్యకుండానే రంగం మీదకి లాక్కొచ్చేస్తున్నాను వాడితో వచ్చిన చిక్కే యిది. చుట్టుపక్కలుంటే పిలవాపెట్టకుండానే రంగం మీద కొచ్చేస్తూ వుంటాడు. వాణ్ణి టూకీగా పరిచయం చెయ్యాలందే- వాడు మాకు కదల్చెప్పే దిక్కు బాధగా వింటూంటాం మేం!

ఇంతకూ మా ఆఫీసరుగారు సూరిని గానీ మరెవర్ని గానీ పూర్తిపేరుతో పిలవటానికి వెనుకనున్న కథేంవిటంటే-

బ్రతకలేక బడిపంతులుగా చేరాడు ఆఫీసరు ఆయన పూర్వాశ్రమంలో. బడిపంతులుగా బ్రతకలేక ఆ జీతం జీవితాన్ని నిలబెట్టలేదని తెల్సుకుంటూండగానే అందరూ అతన్ని "వెర్రిపీనుగ" అన్నారు. ప్రాణాల్తోనే పీనుగై పోయాడు. బడిపంతులుద్యోగంలో పలుకుబడి లేక అక్కడే పాతుకుపోయాడు. ఇంతలో అతగాడి ప్రాణాల అదృష్టంవల్ల బడివదిలే అవకాశంవచ్చింది. "బ్రతుకుజీవుడా" అని బడిని విడిచిపెట్టి, విడిచిపెట్టి వెళ్ళబోయే ప్రాణాల్ని చిక్కబట్టుకుని రాబడి తక్కువగావున్నా రాలుబడి యెక్కువగా వుండే చిన్న వుద్యోగాన్ని పట్టుకున్నాడు. లంచగొండితనంలో తిండిపుష్టిదండిగా పెంచుకొనినలుగుర్నీ మెుంచుతూ పైన యిద్దరకు మాత్రం పంచుతూ ప్రమోషన్లు సంపాదించాడు. కానీ బడి జీవితంలో పట్టుబడిన "అటెండెన్సు" పిలిచే పద్ధతి మాత్రం విడిచిపెట్టలేదు. అందుకే ఆఫీసరు సూరిని "సి సూర్యారావ్" అంటాడు. వీడు 'ఎస్సార్' అంటాడు, వాడే యేంవిటి? మేంవూ అంటాం మాపేర్లుపిలిచినప్పుడు. కానీ ఆఫీసరు రుసరుసలాడ్తూ బుసలు కొడ్తాడు మేంవలా అన్నప్పుడు. 'ఎస్సార్"అంటు టే బడి, బడిపిల్లలు, ఆ జీవితం గుర్తుకొచ్చి కస్సుమంటున్నాడనుకునేవాళ్ళం కొన్నాళ్ళు కానీ సంగతది కాదు. మా ఆఫీసరు పేరు "ఎస్. రాంబ్రహ్మం" ."ఎస్ ఆర్" అని పొడిఅక్షరాలు యింగ్లీషులో రాస్తూంటాడు ఆఫీసు కాగితాల మీద. ఆ విడి అక్షరాల్ని కలిపేసి "ఎస్సార్" అని తన పేరుతో ఆయన్ని పిలుస్తున్నాంవని ఆయనకోపం. ఆయన్నా పేరుతోఎందుకు పిలుస్తాం ఆయన పిచ్చిగానీ! ఇంక పేర్లేవీ లేకనా!? ఆయన పేర్లేంవిటో ఆయనకేం తెల్సు? మమ్మల్నడగ మనండి

అయినా ఆయనడిగినా మేం చెబుతామా?! ఆయన తల్లి తండ్రులు పెట్టిన పేరింకా వుందనే అనుకుంటున్నాడాయన. ఆఫీసులోచేరాక ఆయనకెళ్ళి నామకరణోత్సవాల్జరిగినయ్యో ఆయనకేం తెల్సు?! ఆయనకనేంవిటి? ఏ ఆఫీసరుకూ తెలియదు. తన క్రింద పనిచేసే బలగం పెరిగేకొద్దీ "బారసాల" అంటే అందరికీ అర్థమయ్యే 'బాలసారె'లు యెన్నో జరిగిపోతయ్ ఆఫీసర్లకి అందుకే అనామకుడైన ఆఫీసరు యెక్కడా వుండడు. "మీరేం అనామకులా సార్" అం అంటూనే వుంటారందరూ కానీ అర్థం చేసుకోరు అమాయకపు ఆఫీసర్లు, అర్థం చేసుకోనట్లు నటిస్తారు గడుసాఫీసర్లు- అంతే తేడా. నిగ్గుదేలి, సిగ్గువిడిచేసిన ఆఫీసర్లు "మేం అనామకులం అనుకోకండి"అనితెగబడి,తెగబుముటపడి చెప్పేస్తారు.

కొందరు యెదటి వారికి తెలిసినవే చెప్పటానికి సిగ్గుపడరు. నాయకులున్నారు, గాయకులున్నారు, మాష్టర్లున్నారు, రచయితలున్నారు (రచయితులని వేరే చెప్పనక్కర్లేదు - ప్రత్యేకంగా చెప్పాలి కాబట్టి గాని) - వీళ్ళల్లో యెందరో అలాంటి వాళ్ళున్నారు. అలాంటి వాళ్ళు ప్రపంచంలో కోకొల్లలు. విద్యాలయాల్లోనే వున్నప్పుడు మిగతా చోట్ల వుండటంలో ఆశ్చర్యం యేంవుంది. అదీగాక మనిషి మాట్లాట్టం నేర్చి, భాషను సృష్టించినదగ్గర్నుంచి యెందరు యెందరికి క్రొత్త విషయాలే చెప్పినట్టు? ఎంతమంది తెలీని విషయాలే రాస్తున్నట్టు (తమకు తెలీని విషయాల గురించి రాసే వాళ్ళ సంగతికాదు నే చెప్పేది. వాళ్ళూ, ఎవరకీ అర్థంకాని విషయాలు రాసే వాళ్ళూ చాలా మందే వున్నారు)!! మేగజైన్లు తిరగేస్తే తెలియటంలా? అందుకే కాబోలు మా సూరి అంటున్నాడీ మధ్య- "భారతరామాయణాల్లో చెప్పని యితివృత్తంతో వచ్చిన కథ చూపించమ"ని. మేంచూపించలేమన్న ధైర్యంతో అంటున్నాడో, నిజంగా నిజం అదెనో మాకేం తెల్సు అందువల్ల "మేం అనామకులం అని అనుకోకండి" అని మా ఆఫీసర్లు మాకు తెలిసిన విషయాలే చెబుతూంటేవినగల్గుతున్నప్పుడు సూరికథలు వింటే యేం పోయింది గనక? పైగా డబ్బు ఖర్చులేదు. మేగజైన్లు కొనుక్కునే ఖర్చు తప్పించుకుని సిసలైన తెలుగువాడిగా కాలం వెళ్లబుచ్చేయొచ్చు. అంటే నా వుదేశ్యం సూరిమేగజైన్లలోని కథలు తీసి మాకు చెబుతాడనికాదు, మాసూరి కథలు వాటికేమాత్రం తీసిపోవని మాత్రమే చెప్తోంది. కాకపోతే వాడితో చిక్కల్లా వక్కటే—కథని క్లుప్తంగా యెప్పుడూ చెప్పడు. వాడిచేత ఆ పని చేయిద్దామని మా ప్రయత్నం.

అందుకే మా ఆఫీసరు వాణ్ణి "సి సూర్యారావ్" అని పిలిస్తే, మేము మాత్రం "చిన్నయసూరి' అని కేకవేస్తాం కేలు వేసే ఓనువు మా కుంది కొట్టి అట్లా పిలుస్తే చిన్న కథల్చెప్పుతాడని మా ఆశ.

ఇంతకూ చెప్పొచ్చేదేంవిటంటే మా సూరి మాకు కథలని మొదలెట్టి నవలల్చెప్పుతాడు "బోరుకొట్టోంది వో కథ చెప్పు" అని వేధించేదీ మేమే, వింటూ "బోరుకొట్టావ్ యిక కట్టిపెట్టు" అని నోరు మూయించేదీమేమే. అయినా అడిగినా అడక్కపోయినా కథల్చెప్పేస్తాడు వాడు. వాడు కథల్చెప్పే తీరు చూస్తే పెద్ద రచయిత అయిపోగండని యెవరైనా అనుకుంటారు. కానీ యీ జన్మకివాడికా యోగం లేదని మేం రాసిస్తాం. ఎందుకనడక్కండి .. అది వాడి ఖర్మ అంతే

వారం రోజుల్నుంచీ ఆఫీసు యిన్‌స్పెక్షన్లో వుంది, యీ వారం రోజులూ గుమాస్తాలు కుర్చీల్లోంచి లేవలేదు ; ఆఫీసర్లు కుర్చీల్లో కూర్చోలేదు. ఇవ్వాళే అట విడుపు. మామూలు జీవితం మొదలయ్యింది. ఎవరెంతపని చేశారో, యెంత కళ్ళు జూశారో యింకా అడగ లేదు.

"సూరీ ! మొదలెట్టు" అన్నాడు రామ్మూర్తి.

"చిన్నయసూరీ! మొదలెట్టు" అన్నాను రామ్మూర్తి మాటను సవరిస్తూ నేను.

"మీకు యింటరెస్టుందా ? లేకపోతే యింత రెస్టు తీసుకుపోదామనే వుద్దేశ్యంలో వున్నారా ?" అన్నాడు సూరి.

"ఆఫీసులో రెండో దయ్యింది....యిప్పుడు మొదటిది బాగా వుంది" అన్నాడు రామ్మూర్తి వుత్సాహంగా.

రామ్మూర్తి కివాళ మహావుత్సాహంగావుంది. సంగతేంవిటో మరి ఇన్‌స్పెక్షన్ అయిపోయి మామూలు జీవితం మొదలయిందనేనేమో.... సంగతేమయితే నాకేంగానీ అంత వుత్సాహంగా సూరితో చెబితే యింకేమన్నావుంది ? నవలెచ్చిప్పిమమ్మల్ని నవిలెయ్యడూ ? అందుకే రామ్మూర్తిగాడి కాలు పట్టుకున్నాను. వాడు నాకు దూరంగా కూర్చున్నాడు. వాడు మన లోకంలో లేడు.

"క్రిందటి వారానికి ముందు మొదలెట్టిన సీరియల్ నవల అద్భుతంగా నడుస్తోంది. ఇప్పటికే మమ్మల్ని ఆకట్టుకుంది. ఏం జరగ బోతోందా అని వేచి చూస్తున్నాం , అర్ధరాత్రిళ్ళు లేచి కూర్చుంటున్నాం. నీ సీరియల్ రాలేదు , ఆశాభంగం చెందాం, ఈ లోగా ఆఫీసుకు యిన్‌స్పెక్షన్ పార్టీ వచ్చింది. అందువల్ల సీరియల్ తరువాయి యిప్పుడు చెప్పు మరి" అని అంటున్నాడు రామ్మూర్తి

రామ్మూర్తి కడ్డుపడి వాడి గడ్డం పట్టుకున్నాను, వాడు మన లోకంలో లేడు.

"రాధ పరిస్థితికి గుండె నీరయిపోతోంది. కళ్ళు యేసలై పోతున్నయ్, ఎరుపులై పోతున్నయ్. నువ్వేం వేస్తావో రాధనుచివరకు! ఆమెకు అన్యాయంగా అన్యాయం చెయ్యవని ఆశిస్తున్నాం" అంటూ బాధపడిపోతున్నాడు రామ్మూర్తి. కర్చీఫ్ కోసంజేబులో చెయ్యి పెట్టాడు.

రామ్మూర్తి చేతిని లాగేసి వాడి జేబు పట్టుకున్నాను. ఉలిక్కిపడి మన లోకంలోకొచ్చాడు.

"ఏంవిటేంవిట"న్నాడు కంగారుగా.

"ఏంవిటేంవిటి నీ బొంద . . మన ప్రాణాంతీయ బోతున్నాడు సూరిగాడు. సీరియల్ మొదలెట్టమన్నావ్. సినిమా తీయబోయే ఆయనెవ్వర్నన్నా పట్టుకో, ఆయన కప్పకిద్దాం వీణ్ణి. లేకపోతే యినస్పెక్షన్ జరిగిన వారాని కన్నా అధ్వాన్నంగా తయారవుతుందీ వారం మనకు" అన్నాను.

"ఎందుకిలా జరిగింది" అన్నాడు రామ్మూర్తి బాధగా. "ఎందుకేంవిటి ? . అది నీ జాబ్ మహత్యం ! నీ సీటు రహస్యం ! నీ చేయి చేసిన అఘాయిత్యం !' నీ జేబులోని సత్యం !" అన్నాను రామాంజనేయయుద్ధం నాటకంలో ఆంజనేయుడు"కోతి లక్షణంబు చింతించి వగచిన యేమి ఫలము" అన్న పద్యం చెప్పే స్టయిల్లో .

సూరి బుర్రలో నవలాపాకం జరిగిపోతోంది ; మమ్మల్ని జిడ్డులాపట్టుకునే క్షణం యెంతో దూరంలో లేదు.

"భయపడకండి. నాకూ బోల్డు యింటరెస్టుగా వుంది. అందుకే చిన్నకథ చెబుతాను. మొదలెట్టిన సీరియల్సు నాకు యింటరెస్టు లేనప్పుడే పూర్తి చేస్తాను. అంతేకాదు, యింటరెస్టులేనప్పుడే సీరియల్ మొదలెడ్తాను నేనెప్పుడూ అంతే" అన్నాడు సూరి. "అయినా లెక్కకోసం అడుగుతున్నాను , యెన్ని సీరియల్సు తీరిగ్గా సాగిస్తున్నాను" అన్నాడు మళ్ళీ.

"అయిదు సవ్యసాచిలా సారిస్తూ సాగిస్తున్నావ్" అన్నాడు రామ్మూర్తి. బోరు భరిస్తున్న మాకెప్పుడూ గుర్తే ఆ సంగతి , ఆ సంఖ్యాను.

"ఒకటి పార్కులో మొదలెట్టావ్ , మరోటి బీచిలో మొదలెట్టావ్. మరోటి స్టేషన్లో-యిట్లా ఐదుచోట్ల మొదలెట్టావ్ అన్నింటినీ సవ్యంగానే నడిపిస్తున్నావ్"అన్నాడు.

"నవలెక్కడ చెప్పటం మొదలెట్టావో అక్కడే పూర్తి చెయ్యాలి. అది మన అగ్రిమెంట్. మనం యీ చోటికివ్వాళే వచ్చాం. ఇక్కడింతకుముందు నువ్వేం మొదలెట్టలేదు , అందుకవకాశం లేదు" అన్నాను.

సూరికి కథల్చెప్పే యో(రో)గం రెండేళ్ళ క్రితం పచ్చింది. మొదటి రెణ్ణెల్లూ విన్నాక మాకూ వాడికీ మధ్య కుదిరిన వప్పందం అది. ఈ నగరంలో వోడజను ప్రదేశాల కందుకే వెళ్ళం సూరితో. ఇవ్వాళ క్రొత్తచోటు చూసుకుని కూర్చుంటే మళ్ళీ మొదలయ్యింది.

"అవునవును" అన్నాడు అలక్ష్యంగా రామ్మూర్తి నన్ను సమర్ధిస్తూ. వీడు మన లోకానికీ, మరో లోకానికి

ట్రిప్పులు కొడుతున్నాడు. "మీరన్నది నిజమే. నేనిక్కడేం నవల మొదలెట్టలేదు" అన్నాడు సూరి ఊపిరిపీల్చుకున్నాన్నేను.

" అందువల్ల యిక్కడ మరో నవల నేలమొదలెట్ట రాదు? నాకు పది సీరియల్స్ ఒకేసారి నడపగల సామర్థ్యం కలదు కదా" అని పూర్తి చేశాడు సూరి ముసిముసి నవ్వులు నవ్వుతూ.

మేం భయపళ్ళేదు , అలవాటు పడిపోయాం . .

అయినా సూరి వెంటనే నవ్వేస్తూ—

"భయపడకండి స్థలాభావం వల్ల అంటే కాస్త నడుంవాల్చి చెప్పే వీలు లేదు కనుక చిన్న కథ చెపుతాను. అది "మేనా అనే మీనా కథ" వినండి .. " అన్నాడు చాలా బరువుగానూ, బాధగానూ.

"కావాలంటే దానిని సింపుల్‌గా "మీనా కథ" అని కూడా అనొచ్చు అన్నాడు మళ్ళీ.

నీకు భవిష్యత్తు వుండదు .అంటే రచనా లోకంలో నీ భవిష్యత్తు వుజ్వలంగా వుండేట్లు లేదు" అన్నాడు రామ్మూర్తి.

"వాణ్ణెందుకట్లా నిరుత్సాహ పరుస్తావ్? వాడికా ఫీల్డులో భవిష్యత్తెందుకు లేదంటున్నావ్" అన్నాన్నేను కథల్లో మాదిరి మరో పిట్ట కథని రాబట్టేందుకు.

అవతలి వాణ్ణి మనం తిట్టేకన్నా మరోడి చేత తిట్టిస్తూ వింటూ కూర్చోటం బాగుంటుంది. అందుకే మనకు నచ్చిన విషయాలమీద, అవతలి వాణ్ణి చచ్చిపోయేట్టు చేసే విషయాలమీద "కొయిరీ"లు వేస్తూ వుండాలి. పైగా "క్వోరీ" అలవాటుండనే వుంది. అది వేస్తే అవతలివాడే భాష్యం చెప్పేస్తాడు.

"ఎందుకన్నానంటే ...." అంటూ మొదలెట్టాడు రామ్మూర్తి.

"మూడు కారణాలున్నాయ్.... వకటి కథలు రాసే వాళ్ళు కథకు ముందు పేరు పెడతారుగానీ కథ రాస్తానికి ముందుగానే పేరు సెలక్టు చెయ్యరు ప్రత్యేక కారణాలుంటే తప్ప. కథలకి పేర్లూ, వంకలు పెట్టేవాళ్ళు కూడా కథ చదివిం తర్వాతనే పెడ్తారు అట్లాగే కథ రాసేవాడుగానీ, కథ చెప్పే వాడుగానీ రాసిన తర్వాత, చెప్పిన తర్వాత పేరు పెట్టాలి. వీడాపని చెయ్యలేదు. ఇక రెండో కారణం— కథలు రాసే వాళ్లెప్పుడూ సినిమా ప్రపంచంమీద కన్నుంచాలి , రచనా వ్యాసంగాని కవి పరాకాష్ట. వీక్లీలో పుట్టి, మంత్లీలో పెరిగి, బుక్ పబ్లిషర్స్ దగ్గిర యెదిగి సినిమాల్లో కెగిరి పోవాలి-అదీవరుసక్రమం. అందువల్ల కథల పేర్లుసినిమాలకి తగ్గేట్టుండాలి; తగ్గేట్టుండకూడదు. అప్పుడు గిరాకీ పెరుగు తుంది. వీడికా సినీ దృష్టి లోపించింది. కాబట్టి వీడిది చాలా వీక్ కేసు , వీడి కథ వీక్లీ దాకా వెడుతుందనుకోను" అన్నాడు రామ్మూర్తి.

సూరీ, నేనూ రామ్మూర్తినే చూస్తున్నాం. నేను సూరి వంకచూశాను. వాడి మొహంవాచిపోతోంది,తింటోంది తిట్లుమరి. అందుకే దృష్టివాచీవేపుకుతిప్పుతున్నాడు.సెకండ్లు గడచినయ్, నిమిషాలు సెకండ్లలా గడచినయ్, నిమిషాలు నిమిషాల్లాగానే గడుస్తున్నయ్. నేను"ఊఁ" అంటూ మూలి గాను సంభాషణనిపొడిగించాలని. సూరికూడా వోదగ్గుదగ్గాడు సంభాషణని ఆపేద్దామని కాబోలు. కానీ రామ్మూర్తి మాత్రం మరికొంతసేపు బెల్లం కొట్టిన రాయిలా కూర్చుని—

"ఊఁ ఎందుకలా మాట్లాడకుండా కూర్చున్నారు. చెప్పండి నేనన్న దాంట్లో తప్పుందా" అన్నాడు.

నేనూ, సూరీ ఆశ్చర్యపోయాం , వకళ్ళ వంకొకళ్ళు చూసుకున్నాం.

"మమ్మల్ని మాట్లాడమంటావేమిటి? నువ్వే మాట్లాట్టం పూర్తి చెయ్యలేదు,' సూరికి రచనా రంగంలో భవిష్యత్తు లేదని చెప్పటానికి మూడు కారణాలున్నయ్యన్నావ్, రెండే చెప్పావ్ మూడోది చెప్పలేదు . దానికోసమే కాచు కూర్చున్నాం" అన్నాను.

రెండు చేతులమీదవెనక్కానుక్కూర్చున్న రామ్మూర్తి సరిగా కూర్చుని—

"రెండే కారణాలెప్పానా ? అయితే మూడోది చెప్ప లేదా' అని చుట్టూ చూశాడు గాలి స్తంభించిపోయింది. ఆకులు కదట్లేదు. ఉక్కపోస్తోంది. కుడి చేతిని పైకి లేపాడు గారడీవాళ్ళాగా. ఎందుకట్లా చేస్తున్నాడో నాకు తెలుసు. కుడి చేతిని 'ఏరియల్' లాగా వుపయోగిస్తాడు గాలిలోని కబుర్లు సేకరిస్తానికి , లాభంలేకపోయింది. గాలి "కబుర్లు" చెప్పటంలేదు. 'గాలికబుర్లు' దొరక్క చచ్చి పోతున్నాడు.

"అవును. నువ్వు మూడు పాయింట్లున్నయ్యని" రెండే చెప్పావ్ . వెనక పేజీ చూపిద్దును నువ్వు చెప్పే దంతా రాసుంటే, అప్పుడే పేచీ వుండేదికాదు" అన్నాను.

ఆహాఁ .వొన్లే మూడు కారణాలున్నయ్యన్నానా? అన్నాడు ఆలోచిస్తూనే రామ్మూర్తి.

రామ్మూర్తితో వచ్చిన గొడవ యిదే ఆలోచించకుండా ముందుగానే పాయింట్ల సంఖ్యకి కమిటయిపోయి తర్వాత పాయింట్లు దొరక్క గుడ్లు మిటకరించి, ప్రేక్షకులు దోవలు తొక్కి వినేవాళ్ళని కన్‌ఫ్యూజ్ చేస్తాడు. ఆ పని చెయొద్దని లక్షసార్లు చెప్పాము. అల్లాచెప్తే యెన్ని కష్టాలో స్తయ్యో చెప్పకుండా, యెన్నో నష్టాలొస్తయ్యన్నాను. ఆ మ్యాకం వీలుంచుకుంటే వాడొకవేళ అడిగితే మనకు తోచినన్ని చెప్పొచ్చు. దిక్కుతోచక తన్ను కోనక్కరలేదు. రామ్మూర్తి మాదిరి నే చెయ్యనుమరి,నాలాగే రామ్మూర్తిని చెయ్యమంటాను. మనం చెప్పింది వినడు, పోనీ మనకి చెబుతానన్న పాయింట్లన్నీ చెబుతాడా అంటే అదీలేదు. ఇదే వీడితో వచ్చిన చిక్కు.

మా అంగీకారంతో వాడొదిలేసిన పాయింటు నొదిలేసి రామ్మూర్తే మళ్ళీ అన్నాడు.

"పైగా నువ్వు పెట్టిన" "మేనా అనే మీ నా కథ" పేరులో 'మీనా' అన్న దెక్కడో విన్నాను, చదివానేమో కూడాను. పేరు కాపీ కొట్టటం కథ కాపీ కొట్టిన దానికంటే కూడానేరం" అని.

సూరి కోపం వచ్చింది.

'నువ్వువిన్లేదు, ఎందుకంటే నేను నీకింతకు ముందు చెప్పలేదు. నువ్వు చదవాలేదు, యెందుకంటే నేను ప్రచురించలేదు కాబట్టి' అన్నాడు.

రామ్మూర్తి చదవలేదన్న సంగతి నాకూతెల్సు, యెందుకంటే మేం కథలు, నవలలు చదవం. పత్రికల్లో సినిమా విశేషాలు మాత్రం చదువుతాం, కథల ఛాయలకు పోం; కథల్రాసే వాళ్ళ జోలికి పోం (కథల్రాసే వాళ్ళకి జోలి వస్తుందనెవరో చెప్పారు మాకు). కథల పుస్తకాలు, నవలలు అసలు కొనం, యెవరదగ్గర్నుంచీ తీసికొనం కూడాను. అందుకే అన్నానురామ్మూర్తితో—

'వాడు....సూరి చెప్పేది కరెక్టేరా' అని సూరివంక తిరిగి—

"రామ్మూర్తి చెప్పేదికూడా కరెక్టేరా.... 'మీనా' అన్నది నేనూ యెక్కడో విన్నాను' అన్నాను.

"మీకసలు కథలపేర్లు చెప్పటం నాదీ పొరపాటు "మేనా అనే మీనా కథ" అంటే "మీ" లాంటి "నా" లాంటి వాళ్ళ కథన్నమాట. "మీ"కి "నా"కి మధ్య కామాపెట్టి "మేనా అనే మీ, నా కథ" అని రాస్తాం" అని రాసి చూపెట్టాడు.

"ఆ కథలో యింతకూ యేఁవుంటుందంటే...." అని మొదలెట్టాడు సూరి.

"కథ యిప్పుడా!! ఇప్పుడు మొదలెడితే అయినట్టే!" అన్నాం మేం.

"కథ యిప్పుడేకాదు, యింకెప్పుడూచెప్పను. వీక్లీలో వచ్చినప్పుడు చదువుకోండి. అదిమిస్సయితేపుస్తకరూపంలో వచ్చినపుడు కొనుక్కోండి.... అప్పుడూ మిస్సయితే వెండి తెరవలొస్తుంది' అప్పుడు కొనుక్కోండి . అదీ మిస్సయితే మీఖర్మ. నేను కథ చెప్పనుగాక చెప్పను. మీకే కాదు యెవ్వరికీకూడా యీ కథేకాదు, మరేకథ కూడా చెప్పను. రేపట్నుంచీ కథల్రాస్తాను... " అన్నాడు లేచి నిలబడుతూ.

"అదేఁవిటి సూరీ' రెండేళ్ళనుంచీ చెప్పిన నీకు యిప్పుడేమయ్యింది?:

మధ్యలోవున్న ఆ సీరియల్స్ గతేఁవిటి? అన్నాడు రామ్మూర్తి.

"ఈ రెండేళ్ళ నుంచీ మీకు కథలెందుకు చెప్పానో తెల్సా: .కథల్రాసె వాళ్ళు సామాన్యంగా కథ చెప్పినట్టు కథల్రాస్తారు కథ చెప్పాలనే తహతహతో కథల్రాస్తే చదివే వాళ్ళకి బోరుకొడ్తుంది. కానీ కథల్రాసే ప్రతివ్యక్తికీ కథ చెప్పాలనే తహతహ మహా వుంటుంది. అదుంటే కథల్రాయటం కుదర్దు. ఆ తహతహ చంపేసుకునేందుగ్గాను మిమ్మల్ని రెండేళ్ళనుంచీ కథల్చెప్పి చంపుకుతిన్నాను. ఇక కథల్రాసేటప్పుడుకూడా కథ చెప్పను. ఒక విషయం. చెప్పనా . కథ రాయటం వేరూ, కథ చెప్పటంవేరూ.... ఆదీ సంగతి అర్థమయ్యిందా" అంటూ బయటకు దారి తీశాడు.

వాడేమన్నాడో మా కర్థం కాలేదు. అయినా యీ సోదంతా మాకెందుకు? దీని బదులు వాడు "మేనా అనే మీ, నా కథ" చెప్పినా యెంత బాగుండేది?!!

డా॥ ఘంటా జవహర్ లాల్

# ఆంధ్రదేశము-శ్వేతాంబర జైనమతము

"అహింసా పరమోధర్మః" యని చాటి చెప్పిన మొట్ట మొదటి మతం జైనమతము. ఇది బౌద్ధ మతము కన్న యతి ప్రాచీనమైనది. ఇది మన రాష్ట్రంలో బౌద్ధ మతముకన్నా మిన్నగా వ్యాపించినది. కాని జైనమెప్పటి నుండి తెనుగు దేశంలో వ్యాపించినదో చెప్పుట కష్టం. మహావీరునికి ముందే జైనం మన దేశంలో వ్యాపించినట్లు జైనగాథలు మాత్రం తెల్పుచున్నవి.

మహావీరుడు, జైన కథనం ప్రకారం, ఆఖరి తీర్థంకరుడైతే. భద్రబాహు ఆఖరి "శ్రుతకేవలి". శ్రుతకేవలి అనగా సంపూర్ణ జైన జ్ఞానము పొందిన వాడు. ఈ భద్రబాహు మహావీరుని నిర్యాణం తదుపరి సుమారు 170 సంవత్సరములకు సిద్ధి పొందెను. ఇతడు మౌర్య చంద్రగుప్తుని సమకాలికుడు (క్రీ.పూ.322-298). ఆ రాజుకు జైన గురువు. ఈతని కాలంలో మగధ రాజ్యంలో ద్వాదశ వర్ష క్షామం సంభవించునని భద్రబాహు తన తపః ప్రభావముచే ముందుగా దెలిసికొని కొంత మంది జినాచార్యులతోను, మౌర్య చంద్రగుప్తుని తోను దక్షిణా పథమున గల శ్రావణ బెళ్‌గొళ్ (కర్నాటక రాష్ట్రం)కు వచ్చెనని జైన కథనం చెప్పుచున్నది(1). అనగా జినులు దక్షిణాపథమునకువచ్చుటదియే మొదటిమారు. భద్రబాహు శ్రావణ బెళ్‌గొళ్‌లోనే సిద్ధి పొందెను. రానురాను భద్రబాహు శిష్యులచే బోధింపబడిన మతము దిగంబర జైనంగాను, మగధలో మిగిలిపోయిన జినాచార్యులచే ప్రబోధింపబడిన మతం శ్వేతాంబర జైనంగాను వ్యాప్తి చెందినట్లు పై కథనం మూలంగా దెలియుచున్నది. ఇది క్రీ.శ. మొదటి శతాబ్దంలో జరిగిన సంఘటన యని చారిత్రికుల నమ్మిక. నాటినుండి దిగంబర,శ్వేతాంబర జైన గ్రంథాలు, కథనాలు వేరు వేరుగా వ్రాయబడి, వేరు వేరుగా వ్యాప్తి చెందినవి. శ్వేతాంబరులను 'సచలకు' లని, దిగంబరులను "అచలకు"లని గూడా అందురు. శ్వేతాంబరులు వస్త్రధారులైతే దిగంబరులకది నిషిద్ధం. లభ్యమగుచున్న జైన గ్రంథాలు అసలు జైన గ్రంథాలు గావని దిగంబరులు నమ్మితే, శ్వేతాంబరులు వాటినే ప్రామాణికాలుగా భావిస్తున్నారు. దిగంబరత్వమే ముక్తికి సోపానం అని దిగంబరులు నమ్మితే శ్వేతాంబరులు ముక్తికి దిగంబరత్వం ముఖ్యంగాదని నమ్ముదురు. అందుచే దిగంబరులు స్త్రీలు ముక్తికి అనర్హులుగా భావించి జైన మతంలో వారిని జేర్చుకోలేదు. శ్వేతాంబరులు స్త్రీలు ముక్తికి అర్హులే యని నమ్మి వారిని వారి మతంలో జేర్చుకొన్నారు. దిగంబరులు మహావీరుని బ్రహ్మచారిగా నమ్మితే శ్వేతాంబరులు మహావీరుని వివాహితుడుగా, ఒక కుమార్తెకు తండ్రిగా నమ్ముదురు. దిగంబరులు జైనవిగ్రహాలకే అలంకరణజేయకనే పూజింతురు శ్వేతాంబరులుజైన విగ్రహాలను సర్వాంగి సుందరంగా అలంకరించి పూజింతురు(2). శ్వేతాంబరులు పూలు, మిఠాయిలతో పూజిస్తే, దిగంబరులు బియ్యం, సుగంధద్రవ్యాలతో పూజిస్తారు. శ్వేతాంబరులు జిన విగ్రహాలను కొలది నీటితో స్నానం చేయిస్తే, దిగంబరులు ఎక్కువ నీరు వాడుతారు. కావున దిగంబర జినాలయాలు నీరు బయటకు పోవు మార్గాలు విధిగా కల్గి వుంటాయి. దిగంబరులు రాత్రి పూటి జినవిగ్రహాలను స్నానం చేయించి పూజిస్తే, శ్వేతాంబరులు పగలు మాత్రమే చేస్తారు. శ్వేతాంబర జినాలయాల్లో దీపం నిషిద్ధం(3).

ఈ విధంగా వేరువేరు ఆచార వ్యవహారాలతో జైనం రెండుగా చీలి విడివిడిగా వ్యాప్తి జెందింది. పై కథనం ప్రకారం దక్షిణాపథమునకు వచ్చి వ్యాప్తి జెందినది దిగంబర జైనమని, ఉత్తరభారతమున వృద్ధిచెందినది శ్వేతాంబరుల జైనమని దెలియుచున్నది. కాని లభ్యమైన చారిత్రిక సత్యాలను బట్టి జూస్తే జైన మత విభజన నాటి పరిస్థితుల దృష్ట్యా జరిగినట్లు దెలియుచున్నది. సరిగ్గా క్రీ.శ. ఒకటవ శతాబ్దంలో బౌద్ధమతం హీనయానం, మహాయానంగా చీలినది. అట్లే వైదిక మతం శైవమతంగాను, వైష్ణవమతంగానూ చీలినది. ఈ పరిస్థితులలో చీలిక జైనంలో గూడా "అనివార్యం" అయినది. మూలజైన సంఘములోమార్పుల కిష్టపడనివారు దిగంబరులుగాను, పరిస్థితుల దృష్ట్యా మార్పుల కిష్టపడినవారు శ్వేతాంబరులుగాను విడియుండ వచ్చునని నా వూహ.

ఆంధ్రమున దిగంబర జైన ప్రతిమలే ప్రతి పల్లె

యందు మన కగపడుచుండును. శ్వేతాంబర జిన ప్రతిమలు మన రాష్ట్రంలో ఇంతవరకు లభ్యం గాలేదు. అయిన మన రాష్ట్రంలో శ్వేతాంబర జైనమతం వ్యాప్తి చెందలేదని చెప్ప జాలం. లభ్యమైన జిన శిల్పాలు దిగంబరులు కాగా కొన్ని జైన శాసనాల మూలంగా మన రాష్ట్రంలో శ్వేతాంబర జైనంగూడ వ్యాపించి యున్నదని దెలియుచున్నది. గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా ముసగోడు గ్రామంలో లభ్యమైన జైన స్తంభంపైగల శాసనం మూలంగా మనకు క్రీ॥శ॥ 11-వ శతాబ్దంలో రాజరాజనరేంద్రుని కుమారుడు మొదటి కుల్లోత్తుంగ చోళదేవుని కాలంలోనచ్చట శ్వేతాంబర జినాలయమున్నట్లు, దాని పేరు పృథివీ తిలకమని దెలియు చున్నది. మొదటి కులోత్తుంగ చోడ భూపతియొక్క 37-వ రాజ్యసంవత్సరములో యాతని సామంతుడై చందవోలు (రేపల్లె తాలూకా, గుంటూరు జిల్లా) రాజధానిగా పాలించుచుండిన దుర్జయకులజుడగు గొంక భూపతి భూదానము పృథివీ తిలకమునకు చేసినట్లును, యాతని భటుడుగూడా పై "సిత జినాలయ" మునకు మరమ్మత్తులు, చేయించెనని యు పై శాసనము వల్ల దెల్పియుచున్నది. కావున 11వ శతాబ్దంలో గుంటూరు జిల్లాలో శ్వేతాంబరజైనం వ్యాప్తిజెందినట్లు స్పష్ట మగు చున్నది.

12 వ శతాబ్దమునకు జెందిన జిన శిలా శాసనం మహబూబ్‌నగర్ జిల్లా, జెడచెర్లలో లభ్యమైనది. దానిలో భూలోక మల్లుని కుమారుడగు తైలపుడు కందూరు నాడుని పాలించు చున్న తరుణంలో బొమ్మిశెట్టి యను వర్తకుడు గంగాపురం యొద్ద పార్శ్వ నాథ జినాలయం కట్టించి దాని నిర్వహణకు కట్న కానుకలు ఇచ్చినట్లు లిఖింపబడినది(4). శాసన పరంగా ఇది శ్వేతాంబర జినాలయమూ దిగంబర "వసది" యూ తెలియకున్నది. కాని రాష్ట్ర పురావస్తు శాఖవారు నచ్చట త్రవ్వకాలు జరిపిరి. లభ్యమైన జినాలయ పునాదులను పరీక్షించగా దేనికి నీరు బయటికిపోయే మార్గాలుకానరాకున్నవి పైన శ్వేతాంబరులు జైన విగ్రహాల స్నానమునకు చాలా కొద్దినీరు వాడతారని తెలియ పర్చియుంటిని. అనగా శ్వేతాంబర జినాలయములకు నీరు బయటికి పోయే మార్గాలు అవసరం లేదు. కావున గంగా పూరులో బయల్పడిన జినాలయములు శ్వేతాంబర వసదులుగా (5) స్వీకరింప వచ్చును.

అట్లే జైనమతం చరమ దశకు చెందిన జైనశాసనం శ్రీశైలంలో దొరికినది. అది క్రీ.శ. 1512కు చెందినది. ఒక వీరశైవ శాంతయ్యని కుమారుడగు లింగడు శ్వేతాంబర జనుల తలలను నరికినట్లు అహంకార పూరితముగా పై శాసనములో చెప్పుకొన్నాడు(6) దీనిని బట్టి శ్వేతాంబరజినులు 16వశతాబ్దంలో శ్రీశైల ప్రాంతములో నున్నట్లుదెలియుచున్నది. ఈ సాక్షాలే ఆంధ్రమున శ్వేతాంబర జైనం వునికిని తెల్పునవి.

పైని పేర్కొన్న ప్రామాణిక సాక్ష్యాల మినహా మన రాష్ట్రంలో శ్వేతాంబర జైనమతం వునికిని చాటే యాధారాలు కాన రావున్నవి. అయినా శ్వేతాంబర జైనం మన రాష్ట్రంలో దిగంబర జైనంలా వ్యాప్తిచెందలేదని నిష్కర్షగా చెప్పజాలము. మన రాష్ట్రంలో శాసన పరంగా జాస్తి పార్శ్వనాథ జినాలయాలు ఎక్కువున్నట్లు దెలియుచున్నది. పార్శ్వనాథ జినాలయాలన్నియూ శ్వేతాంబర జినాలయాలుగా స్వీకరించవచ్చుననే వాదన గూడా ప్రచారంలో వున్నది. నిష్పష్టమైనాధారాలు లేకపోయినను పై వాదన సత్యదూరంగాదని నమ్మేవారిలో నేనొకడను.

## పరిశీలించిన పుస్తకములు


1. ఆర్. నరసింహాచార్, శ్రావణ బెళగళ శాసనాలు, 193.

2 మోహన్‌లాల్ మెహతా, జైన్‌కల్చర్, పుటలు 19-20.

3. డి. రుస్ షుక్లా, వాస్తుశాస్త్రం, సంపుటం 2, అధ్యాయం 8. పుట 3.

4. నా వ్యాసం, ఎపిగ్రాఫియా ఆంధ్రికా, 4. పుటలు 49-53.

5 జినులు వారి యాలయములను జినాలయములుగా వసదులుగా, చైత్యాలయములుగా వ్యవహరింతురు.

6. ఎపిగ్రాఫియా ఇండికా, 5. పుట 142.


మీ డబ్బుకి
ఇంతకంటె
మంచి రక్షణ
అవసరం!

# మీ తనువుల్లోని అణువణువులోనూ..

శ్రీ కే. కిశోరుబాబు

శ్రీ కే. అశోకుబాబు

ఎవరు నువ్వు ?

దుఃఖపు మడుగుల్లాంటి
మా కళ్ళల్లో
చెందొవల్లా నవ్వి
చిన్నిచిన్ని కాంతి రవ్వలను పురికొలుపు తుంటావు!
చిల్లులుపడ్డ పిల్లన గ్రోవి లాంటి
**మా మనసుల్లో**
కల్యాణిలా పలికి — మాటిమాటికి
పులకలొత్తిస్తుంటావు!
ఉన్నదంతా ఊడ్చుకపోయి
చిందువందయిన
చారుదత్తునిలాంటి మా బ్రతుకుల్లో
వసంతసేనలా అడుగిడి — తడవ తడవకు
రాగసుధలను చెలరేగిస్తుంటావు!

ఎవరు నువ్వు ?

రావిచిగుళ్ళలా — మోదుగ పువ్వుల్లా
మట్టి పళ్ళలా
ఎఱ్ఱఎఱ్ఱగా ఒప్పెసలారుతుంటావు
వట్టివేళ్ళలా – మంచి గంధపు చెక్కల్లా
కర్పూరపు బిళ్ళల్లా — కస్తూరి పూతల్లా
చల్లచల్లగా అలరు తుంటావు
ప్రియురాలి వక్షోరుహల్లా
పొగలేని ముర్మురాల్లా
వెచ్చవెచ్చగా వఱలు తుంటావు
ఎవరు నువ్వు
లేతకొబ్బరి నీళ్ళలా — పూతరేకుల్లా
పరమాన్నంలా — పాయసంలా
పానకంలా
తియ్యతియ్యటి రుచుల్ని
గుప్పిస్తుంటావు

కరివేపాకు రెమ్మల్లా
కొత్తిమీర కాడల్లా
పుదీనా ఆకుల్లా
"గుమగుమ" సొగసుల్ని పుక్కిలిస్తుంటావు

ఎవరు నువ్వు

నిండునదిలా కన్నుల పండువవుతూ
గరా గరికలను పురుడింపజేస్తూ
తాండవ మాడుతూ
దూకి దూకి పడుతూ
త్రోసుకొని వస్తుంటావు!
కంకి విడిచిన వంట చేనులా
మురువులొలికిస్తూ
అరులు మరులుగొవిస్తుంటావు!

ఎవరు నువ్వు........

పావురాయిపిట్ట పొట్టలాంటి
సుకుమార శోభలతో
చెంగు చెంగు మంటూ
పొంగి పొంగి పడుతూ
పరుగు పరుగునా
వస్తుంటావు!
కొమ్మమీద తేనె పట్టులాంటి
కమ్మటి స్వాంతంతో
ఘంగు ఘంగుమంటూ
టింగురంగడిలాగా ప్రవేశిస్తుంటావు

ఎవరు నువ్వు

చిలుకరెక్కల్లా ముడుచుకొన్న మా ఆశల్ని
నమ్మి పిట్ట పింఛంలా విప్పారిస్తుంటావు
పడగలతో కొడుతూ

## మీ తనువుల్లోని అణువణువులోనూ....

తోకలతో మెలికలు వేస్తూ
కాటువేస్తూ పీడిస్తూ
విఱ్ఱుఱ్ఱు లాడుతూన్న
కోట్ల కొలది
"సమస్యల విషసర్పాల్ని"
సాధువుల్లాగా మార్చి
వశపరుస్తుంటావు

ఎవరు నువ్వు
కసాయి చీకట్ల చేతుల్లో
దిక్కూ మొక్కూ లేక
కొడిగట్టిన దివ్వెల్లా
కునుకుతూన్న మమ్మల్ని
అధిక స్నేహ దశలతో
ఎగద్రోస్తూ
అభివర్ధింప జేస్తుంటావు

ఎవరు నువ్వు
ముద్దగట్టిన పుణ్యాలరాశివా !
వేగంటి కచ్చేరి నుండి
ఊడిపడ్డ దేవతా మూర్తివా !
మహాత్మునివా!
మహాయోగి (ని)వా!
ఎవరు నువ్వు! ఎవరు నువ్వు!
నేనా!.. ..నేనా !....
నేను. ..నేను....
ఏ ప్రొద్దునూ
మిమ్మల్ని వదలి పోకుండా
ఏటిలోని కెరటాల్లా
మీ తనువుల్లోని
అణువణువులోనూ
పాడే "తూరుపును"
"రేపును"

శ్రీ రేకళిగ మఠం వీరయ్య

# 'అర్ధోదయ'ము బసవన జనన ముహూర్తమా?

మిత్రులు డా బాడాల రామయ్యగారు బసవేశ్వరుని వచనములను ఆంధ్రీకరించి, ఉభయభాషా జనులకు మహోపకార మొనర్చియున్నారు. వారు తమ అనువాద పుస్తకమునకు సుమారు ఐదువందల పుటలు గల సుదీర్ఘమగు సమగ్ర సమీక్షను చేర్చియున్నారు. అందు వారు తమ పరిశోధన విమర్శలందు కనుగొనిన అనేక అంశములను వ్రాసియున్నారు. వారు తెలిపిన అంశములలో కొన్నింటి గురించి నాకు సంశయములు కలిగినవి. అందులో బసవని జన్మదిన నిర్ధారణ కూడ నొకటి. బసవేశ్వరుని జన్మదినమును నిర్ణయించుటకు, వారు మహాశివకవి పాల్కురికి సోమనాథుడు తన బసవ పురాణమునందు, బసవని జనన సందర్భమున వాడిన "అర్ధోదయ"మను పదమును, ఆధారముగా గొని, ఆ దిశయందు పరిశోధించి; సిద్ధార్థి పుష్య, అమావాస్య, ఆదివారము శ్రవణా నక్షత్రము (21-1-1144) నందు బసవన జన్మించెనని తెలిపియున్నారు. కర్ణాటక ప్రాంతమునందు (వారిని అనుసరించి తెలుగు దేశమునందును) సుమారు అర్ధ శతాబ్దికి పైగా, వైశాఖ శుద్ధ తదియ రోహిణి నక్షత్రము బసవని జన్మదినముగా ఆచరింపబడుచున్నది తప్పని తెలిపిరి. ఈ సందర్భమున ఇతర పరిశోధకులు తెలిపిన, బసవని జన్మదినములను విమర్శించి అదియును సరిగావని తెలిపిరి. జ్యోతిషశాస్త్ర వివరములను, కుండలిలను వ్రాసి తమ నిర్ణయమును స్పష్టీకరించియున్నారు కాని సోమనాథుడు వ్రాసిన "అర్ధోదయ"మను పదము బసవని జనన కాలమును తెలుపునదిగాదని, సూక్ష్మముగా పరిశీలించిన తెలియును. హరిహరుడును, బసవని జనన కాలమును, దినమును తెలుపలేదు.

పాల్కురికి సోమనాథుడు వీరమాహేశ్వరుడు. వీరశైవులాచరింపదగిన "అరువదినాల్గు" శీలములను నిర్ణయించి, ఆచరించిన "శీల సార్వభౌముడు". జ్యోతిషమును నమ్మకుండుట కూడ ఆ శీలములలో నొకటి. అంతేగాక బసవన్న కూడ జ్యోతిషమును నిరసించినట్లు అతని క్రింది వచనముల వలననే తెలియుచున్నది.

"మావారడిగిన శుభలగ్నమనుడయ్యా !
రాసి కూటము ఋణ సంబంధము గలదనుడయ్యా !
చంద్ర తారాబలములు గలవనుడయ్యా !
రేపటికన్న నేడే, లే సనుడయ్యా !
కూడల సంగమ దేవుని పూజించిన ఫలముమీదను
డయ్యా !" 86.

"ఆనాడు ఈనాడు మఱెక నాడనబోకు
దినమిదియే "శివశరణ"ను వారికి,
దినమిదియే "హర శరణ"ను వారికి,
దినమిదియే మా కూడల సంగమ దేవుని
మానక తలచువానికి" 171.

"అష్టమి, నవమి, యను కల్పితమెందుకోయి శరణునకు,
తప్పెను గణ పథము ! లింగజంగమము అతిదూరము.
ఒకనికి దూతయై మరొకని సంతసింపజేయు,
నిర్బుద్ధి మానవుల నేమందు, కూడల సంగమ
దేవా ! 60

"లగ్నమెక్కడిదోయి, విఘ్నమెక్కడిదోయి
సంగయ్యా !
దోషమెక్కడిదోయి, దురితమెక్కడిదోయి
సంగయ్యా !
నిన్ను మానక తలచు వానికి ఛత్కర్మ
మెక్కడిదోయి, కూడల సంగమదేవా ! 875

బసవని పరమ భక్తుండగు, సోమన తనకు నమ్మకము లేని జ్యోతిషము ననుసరించి, "అర్ధోదయ"మును జ్యోతిష పరముగా వాడియుండునా అను అనుమానము గలుగుట అసమంజసముగాదని నా భావము సోమనాథుడు బసవని జనన సందర్భమును క్రింది ద్విపదలలో తెలిపినాడు.

"ప్రీతిఁ బుత్రుఁడు మోదుప్రఁజేతుల తోడ
నా తల్లి గర్భంబు నందుదయించె,
నర్ధోదయము సందుయతనిలో నున్న
యర్ధేందు మౌళి గుప్తాకృతిఁ దాల్చి!
యంగంబు పైఁగడు సాంగంబుగాఁగ
అంగ సాహిత్యంబు తల నొనర్చె"

బ. పు. 354-757-762)

శ్రీరామయ్యగారును పై చరణములలోని (2-3-4) మూడు చరణములనే తమ వాదనకు ప్రాతిపదికగ తమ సమీక్షయందు ఉటంకించియున్నారు. నా యభిప్రాయము నందు "అర్ధోదయ"మను పదము, పై రెండు పంక్తులకన్న క్రింది మూడు పంక్తులకే ఎక్కువ సంబంధించినట్లు తెలియుచున్నది. సోమనాథుడు, వీరమాహేశ్వరాచార సంపన్నుడు. బసవన్న భవిగా పుట్టినటులు గాకుండా, పుట్టిపుట్టక తొలుతనే, అతని యందలి పరమేశ్వరుడు అతనికి లింగధారణము యొనర్చెనను భావమును తెలుపుటకే 'అర్ధోదయ"మును వాడినట్లు తెలియుచున్నది. కాని బసవన అర్ధోదయము"మును ముహూర్తమునందు పుట్టినట్లు తెలుపు నుద్దేశముతో అ పదమును అతడు వాడినట్లు గానరాదు. వాక్యరచన గూడ అదే సందర్భమును తెలియజేయుచున్నది.

ఒకవేళ సోమనాథుడు బసవని జనన తిథివారనక్షత్రము లనే తెలుపదలంచిన, అతి ముఖ్యమగు తన కావ్యనాయకుని జనన ఘడియను అట్లు గూఢముగా, అందరికి సులభగ్రాహ్యము గానటులు వ్రాయునంతటి ఆపత్తి అతనికి ఎందుకు గలిగియుంటది ? అతడు ఒక్కొక్క విషయమును అతి విపులముగా, అనేక పంక్తులలో తెలిపిన మహాకవి. భాషకు ఛందస్సుకు అధీనముకాకుండ వానినే, తన ఇష్టప్రకారము మలచిన మహాకవి అతడు. ఆవిషయమును అంతక్లుప్తముగా వ్రాయునంతటి అగత్యము అతనికి ఉండదు.

బసవని జీవితమునందు ముహూర్తములను తెలుపునట్టి మరిరెండు సంఘటనలందుకూడ, అతడు జ్యోతిష శాస్త్ర ప్రకారము నిర్ణయింపబడిన ముహూర్తములను తెలుపలేదు. బసవని ఉపనయనమును, అతని తల్లిదండ్రులు గర్భాష్టకమున శుభముహూర్తమున జేయ నెంచినట్లు తెలిపెనేగాని, జ్యోతిష ప్రకారము నిర్ణయింపబడిన ముహూర్తమును తెలుపలేదు ! ఇదేగాక బసవని వివాహ సమయమునందును, జ్యోతిష ప్రకారము నిర్ణయింపబడిన లగ్న ముహూర్తమును తెలుపలేదు. ఆ సందర్భమును అతడు క్రింది ద్విపదలలో తెలిపినాడు

"తన కూతుఁ గామినీ తిలకంబు
ననుపమశృంగారపనిధి గంగాంబ !"
'దో డెచ్చి యట్లు భక్తునకు మ్రొక్కించి,
యే డెర శుభ చేష్ట లెదురఁ గొనర్ప
శివభక్త వనితలు సేసలు చల్ల
శివబలం బగ్గలించిన ముహూర్తమున
వేదోక్త శివధర్మ విధి బసవనికి
గాదిలి సుత బెండ్లి గావించెనంత"

(పు 51-52 1097-1104)

అని సాధారణ రీతియందు, శివభక్తవనితలు సేసలు చల్లిన సమయమే సుముహూర్తమనియు, అదియే శివబలం బగ్గలించిన లగ్నఘడియ యనియు, తెలిపినాడు. అంతే గాక

"హరుని భక్తుల బలం బధిలేమిఁ గలిమి
హరి విరించులు దుంగుదురు మండు రనినఁ
దక్కిన గ్రహ చంద్ర తారాబలముల
యొక్కువ దక్కువ లెన్న నేమిటికి ?
గరుణ జూచుటయు లగ్నంబు సేయుటయు
వర ముహూర్తంబు దీవనయు బలంబు
గాన భక్తుల కృప గలదు బసని
కేనాట విందుమే యిట్టి పెండ్లిండ్లు ?"

(పు. 52- 1107-1114).

అనుచు జ్యోతిష శాస్త్రమందు తనకు నమ్మకముగాని శ్రద్ధగాని లేదనియే సోమనాథుడు తెలిపినాడు. శివభక్తుల ఆశీర్వాదబలము ముందట, గ్రహబలము చంద్ర తారా బలముల లెక్క యెంత ? అని ఖండితముగా తెలిపినాడు. భక్తుల దీవనయే వరముహూర్తమనియు, బసవనిపై భక్తుల కృపగలదనియు, అదియే లగ్నబలమనియు నొక్కి చెప్పినాడు జ్యోతిష శాస్త్ర ప్రకారము నిర్ణయింపబడిన ముహూర్తమునగాక ; శివభక్తవనితలు సేసలు చల్లిన సమయమే శుభ ముహూర్తమనియు, శివభక్తుల ఆశీర్వాద బలమే లగ్న బలమనియు తలంచి, చేయబడుచున్న లగ్నమును, ఇంతకు మొదలెన్నడును చూడలేదని, జనులు ఆశ్చర్యపడినట్లు గూడ సోమనాథుడు తెలిపినాడు. అట్టిచో రామయ్యగారు అభిప్రాయ పడినట్లు, "అర్ధోదయ"మను పదమును సోమనాథుడు జ్యోతిషశాస్త్ర ప్రకారము బసవని జన్మ ఘడియనుతెలుపుటకని వాడలేదని యే తెలియుచున్నది. శ్రీ రామయ్యగారే స్వయముగా వీరశైవ కవులకు జ్యోతిషముపై ఆసక్తి లేదని" తెలిపియున్నారు. రామయ్యగారి వాదనయందు ఔచిత్యమును ప్రాజ్ఞుల నిర్ణయమునకు వదిలెదను.

# వ స ం తు డు

## శ్రీ నడకందురు రాధాకృష్ణ

నిలచి వసంత ! చూడర వినీత పునీత చరిత్రుతా దరి
ద్రుల, యుగముల్ గతించిన విదూర విధూత విభూతు
లౌచు, తా
మిల నిలువంగలే మనుచు నెంతొ కృశించి కృశించి వేదనన్
మలమల మాడచూడక సుమాలరథాల జనంగ, న్యాయమా.

ఘర్మ జలాంబు బిందుతతి కాయముమండి స్రవింపగా మహ
ద్ధర్మమిదేయటంచు మది దాలిమి దాల్చుడటంచు బల్కగా
మర్మపు బల్కుగాక మధుమాసపుబల్కిటులుండునయ్య! మా
ఖర్మముగాలుదెప్డు కటుగాధలు భేదిలుదెప్డు చైత్రుడా!

నవనవలా విలాసము మనమ్ముల బొదుకొనంగజేసి, మా
నవ చరితార్థముల్ కడగి నాకము నుండి యధోముఖం బొన
ర్చి, వనవిహార భోగివవ! ఛీ యనుచుండె ప్రజాళి, యైన నీ
నవ మధుబిందుజల్లుల జనమ్ము ముదమ్ముహరింప ధర్మమా?

క్రొత్తలు దెచ్చి మానవుల రోతలు మాన్పెడి మార్గముల్
కడున్
గ్రొత్తగ జేయుమంచు నిను గోముగలాలన చేయుచుండినన్
విత్తము గల్గువారి దెస ప్రేమము పంచు విధానమేమిటో?
నెత్తములాడు నీకె తగు నీతులు మాత్రము లే(మి) వారికా?
(ని)

సరిగంచుల్గల వస్త్రముల్ తనువునన్ సౌందర్యముల్నిలే
వగా
విరిదండల్ గళమందు నాట్యములుగావింపన్ మహానంద సా
గరవీచీకలగానముల్ వినుచు పొంగారంగి నేలా? వసం
త! రసాస్వాదము గూర్చు కావ్యముల మోదంబందం
వేమిరా?

చిగురాకు జొంపాల చిలు శోభ సంపదల్
మందు గుండెల వాని బండజేయు
సుమరాజివిరజిమ్ము కమనీయ గంధమ్ము
బడుగు టాశలవాని వడగజేయు
మధుపూర్ణ సుమపాత్ర మాధురీ మహిమమ్ము
కంఠదఘ్నంబైన కాల్చివేయు
కలకంఠ కాషాయ గానామృతపుధార
వలచి తలచు వాని కలచివేయు

మధుర మధుమాస మధురిమల్ మాలగట్టి
యగ్నిగుండాన బత్రదోసి యుడగజేసి
గుండెమంటల నెగద్రోసి కూల్రదోయ
పంతమూనితివ? వసంత! యెంతవింత.

శ్రీ తిరుమల రామచంద్ర

# గాథాసప్తశతిలో సుభాషితాలు

"పెద్దల మాట - సద్ది మూట" అనేది అందరెరిగిన సామెత. పెద్దలు చెప్పిన హితోక్తి సద్దిమూటలాగ సమయానికి వినియోగపడుతుందని దీని తాత్పర్యం. ఈ పెద్దలు అనుభవం పండినవారు. కనుక వారి మాట అనుభవామృతం. అలాటి అనుభవామృతగుళికలు గాథాసప్తశతిలో కోకొల్లలు. వాటిలో కొన్నిటిని తెలుపుతాను. అవి నేటికీ నిత్య సత్యాలే. కాలదేశవర్తమానాలను బట్టి సత్యాలుకూడ మారుతుంటాయని, నిత్యసత్యాలనే వేవీ లేవనికొందరివాదం. కాని, కర్తవ్యం, ప్రేమ, స్నేహం దయ మున్నగునవి నిత్య సత్యాలని, మానవతకు మూలధర్మాలైన ఇవి మారవని భావిస్తున్నాను. ఇక సుభాషితాలను ఉదాహరిస్తాను:

1. ఆరంభాంతస్స ధుఅం లచ్ఛీ మరణం వి హోఇ పురిసస్స
   తం మరణ మణారంభే వి హోఇ లచ్ఛీ ఉణ
   ణహోఇ. 1-42

   (ఆరభమాణస్య ధ్రువం లక్ష్మీర్మరణం వా భవతి
   పురుషస్య
   తన్మరణ మనారంభేపి భవతి, లక్ష్మీః పునః నభవతి)

పనిని ప్రారంభించడంలో మీనమేషాలు లెక్కిస్తున్న వ్యక్తిని ఒక మిత్రుడు ప్రోత్సహిస్తున్నాడు. "మిత్రుడా, ఏ పనినయినా ప్రారంభించిన వాడినే విజయలక్ష్మి వరిస్తుంది అలా జరుగకపోతే మృత్యువయినా వరిస్తుంది. జయమో పరాజయమో తప్పదు. కాని, పనికి పూనుకోనివాడికి మరణం తప్పదు ; విజయలక్ష్మి అయితే దక్కదు. మరణం ఎప్పటికైనా నిశ్చయం కనుక పని ప్రారంభించిచూడు. అదృష్టముంటే విజయం లభిస్తుంది. లేకపోతే మరణం అందరికి సమానమే కదా !

2. అణ్ణ మహిలా పసంగం దే దేవ కరేసు అహ్మద
   ఇతస్స,
   పురిసా ఏక్కంతరసా ణహు దోసగుణే వి ఆణంతి.
   1-48.

   (అన్య మహిళా ప్రసంగం హే దేవ కుర్వస్మాకం
   దయితస్య,
   పురుషా ఏకాంతరసా నఖలు దోషగుణౌ విజానంతి.)

రెండవది ఉంటేనేగాని మొదటి వస్తువు గొప్పదనం మానవులకు తెలియదు. ఇది లోక సహజం. కనుక ఒక ఇల్లాలు భగవంతుని ఇలా ప్రార్థిస్తుంది. "ఓ భగవంతుడా ! నా ప్రియుడికి ఇతర స్త్రీలతో పొత్తు కలిగించు. అప్పటికిగాని నా ప్రేమ సంగతి అతనికి తెలియదు. ఒక దాన్నే నమ్ముకున్న మగవారికి చిరపరిచయంవల్ల దాని గుణదోషాలు తెలియవు."

3. పేమ్మస్స విరోహి అ సంధి అస్స పచ్చక్ఖ దిట్ఠ
   విలిఅస్స,
   ఉఅఅస్స వ తావిఅ సీతలస్స విరసో రసో
   హోఇ. 1-53

   (ప్రేమ్ణో విరోధిత సంధితస్య ప్రత్యక్ష దృష్ట
   వ్యళీకస్య,
   ఉదకస్యేవ తాపితశీతలస్య విరసో రసో భవతి.)

"మనసు విరిగెనేని మరియతుకగా రాదు" అన్నాడు వేమన్న. మనసంటే ప్రేమే. "ప్రేమఒకమారువిరిగిన పిదప అతకదు. అందులోను తప్పు ప్రత్యక్షంగా కనిపించినప్పుడు అతకనే అతకదు. అతికించడానికి ప్రయత్నిస్తే, కాచి చల్లార్చిన నీరు తాగినట్టుంటుంది చప్పగా." అంటుంది ఒక ప్రేమ తత్త్వజ్ఞురాలు.

4. హిఅఅణ్ణఏహిం సమఅం అసమత్తాఇం పి జఇ
   సుహావంతి,
   కజ్జాఇం మణ్ణే ణతహా ఇ అరేహిం సమావి అఇం పి.
   1-61.

   (హృదయజ్ఞైః సమ మసమాప్తాన్యపి తథా సుఖ
   యంతి
   కార్యాణి మన్యే నతథా ఇతరైః సమాపితాన్యపి.

ఇది ఒక మనస్తత్త్వజ్ఞుడు చెబుతున్న మాట : "మన మనసెరిగిన వారితో కలిసి పనిచేసినప్పుడు, ఆ పనులు పూర్తికాకపోయినా సంతోషంగా ఉంటుంది. మనసెరుగని వారితో పనులు పూర్తయినా సంతోషంకలుగదు.

5. పత్తో ఛణో ణ సోహఇ అఇప్పహాఅవ్వ పుణ్ణిమాఅందో
అంతవిరసో వ్వ కామో అసంపఅణో వ్వ పరిఓసో. 1-68

(ప్రాప్తః క్షిణః న శోభతే అతిప్రభాతఇవ పూర్ణిమాచంద్రః అంతవిరస ఇవ కామః అసంప్రదానశ్చ పరితోషః

గడచి పోయిన ఉత్సవాన్ని చివరకు విరసమైన కోరికను పోల్చి చెబుతున్నాడొక కవి. ఉత్సవం ఎంతో సంబరంతో జరుగుతుంది. గడచిన తర్వాత జనం అలసి పోతారు. ఎక్కడి వస్తువులక్కడ ఉంటాయి. జనమంతా వెళ్ళిపోతారు. అంతా చప్పగా కనబడుతుంది. బాగా తెల్లవారిన పిదప పున్నమ చంద్రుడిలా వుంటుంది. చంద్రుడు పున్నమ చంద్రుడైనా, రాత్రంతా ఎంతో ఆహ్లాదకరంగా వుంటాడు. కాని తెల్లవారితే చప్పబడి, తెల్లబారి ఏదో తెల్లటి మేఘం ముక్కలా కనబడతాడు. అలాగే చివరకు విరసమైన కామంకూడా ఇతరులను సంతోషపెట్టని పరితోషంలాగ వుంటుంది. మనకు పరితోష మయితే ఇతరులనుకూడ ఏ బహుమానంతోనో ఆనంద పెట్టాలి. అప్పుడే దాని సార్థకత. అలాటిఈవి లేనప్పుడు నిస్సార మవుతుంది.

6. "కత్తో మిట్ఠం వ బహుకం అ" 1-72
(కుతో మృష్టంచ బహుకంచ)

మంచి కావాలి, అది ఎక్కువగాను కావాలి అంటే ప్రపంచంలో లభించదు. తీపి వస్తువూ కావాలి, అది ఎక్కువగాను కావాలి అంటే ఎలా?

7. ణ వి తహ విఏసవాసో దోగ్గచ్చం మహజణేఇసంతావవమ్
ఆ సంసి అత్థవిమణో జహ పణఇజణో ణిఅత్తంతో 1-76

(నాపి తథా విదేశవాసః దౌర్గత్యం మమజనయతిసంతాపమ్, ఆశంసితార్థ విమనా యథాప్రణయి జనోనివర్తమానః)

విదేశవాస దారిద్ర్యం అష్టకష్టాలలోనివి. మనస్వి అయిన వాడికి ఇవిరెండూకూడా అంత చెడ్డవీ అని అనిపించవు. ఈ పని ఇతని వల్ల జరుగుతుంది అని వచ్చిన ఇష్టులు తమ అభీప్సితం నెరవేరక తిరిగిపోతే కలిగే కష్టం మొదట పేర్కొన్న రెండింటికన్నా ఘోరమయింది.

8. అద్దంసణేణ పెమ్మం అవేఇ అఇదంసణేణ వి అవేఇ
పిసుణ జణ జంపిఏణ వి అవేఇ ఏమేఅ వి అవేఇ 1-81

(అదర్శనేన ప్రేమాపైతి అతిదర్శనేనాప్యపైతి,
పిశున జన జల్పితేనాప్యపైతి ఏవ మేవాప్య పైతి)

ప్రేమ పెరగడం, తరగడం విచిత్రంగాఉంటాయని ఒక అనుభవజ్ఞుడు చెబుతున్నాడు. ప్రేమ తరచు చూడక పోతే పోతుంది. అంటే, ప్రేమగలవారిని తరచు చూస్తూ వుండాలి. కాని తరచు చూస్తున్నా పోతుంది. కొండెగాళ్ళు ఓర్వలేక సమిధలు వేస్తారు. దానితోనూ ప్రేమ పోతుంది. ఇంకా ఆశ్చర్యకరమైన సంగతి ఏమిటంటే, ఏ కారణమూ లేకనే పోతుంది.

ఈ విషయాన్నే మరొక గాథలో వివరించాడు కవి :

9. అద్దంసణేణ మహిలా అణస్స అఇదంసణేణ ణీ అస్స.
ముక్ఖస్స పిసుణ అణ జంపిరుణ ఏ మేఅ వి ఖిలస్స 1-82

(అదర్శనేన మహిళాజనస్య అతిదర్శనేన నీచస్య,
మూర్ఖస్య పిశున జన జల్పితేన ఏవమేవాపి ఖిలస్య)

తరచు చూడకపోతే మహిళల్రపేమ పోతుంది. తరచు చూస్తే నీచుని ప్రేమ పోతుంది తరచు చూడడంవల్ల నీచునికి ఈసడింపు ఏర్పడుతుంది. స్వయంగా వివేచన లేని మూర్ఖుని ప్రేమ ఇతరుల చాడీలు వినడంవల్ల పోతుంది. దుష్టుని ప్రేమ ఏ కారణమూ లేకుండానే పోతుంది. దుష్టుడు తన అవసరాలను బట్టి, తన తిక్కలను బట్టి, అభిమానాలు మార్చుతుంటాడు.

10. ణూమేంతి జే పహుత్తం కువిఅం దాసావ్వ జే పసాఅంతి
తే వ్విఅ మహిలాణం పిఆ సేసా సామి వ్వి అ వరాకాః 1-91

(గోపాయంతి యే ప్రభుత్వం కుపితాం దాసా ఇవ యే ప్రసాదయంతి
తఏవ మహిళానాం ప్రియాః శేషాః స్వామిన ఏవ వరాకాః)

ఒక స్త్రీ హృదయజ్ఞుడు భర్తలకు స్త్రీలయెడల ఎలా ప్రవర్తించాలో తెలుపుతున్నాడు : నేను భర్తను, భార్య

నాకు అణగి మణగి వుండాలి-అనే అధికారంచూపక, భార్యకు కోపం వచ్చినప్పుడు ఆమెను అనునయిస్తూ వుండేవారే ప్రియులు అనబడతారు. తక్కిన వారున్నారే వారు కేవలం భర్తలు పాపం!

11. అవి అహ్లపేక్ఖణ్జేణి తక్ఖణం మామి తేణ దిట్ఠేణ,
సివిణ అ పీఏణ వ పాణిఏణ తహ్ణా వ్విఅ ణ పిట్ఠా 1-93

(అవితృప్త ప్రేక్షణీయేన తత్క్షణం మాతులాని తేన దృష్టేన
స్వప్నపీతేనేవ పానీయేన తృష్ణేవ న భ్రష్టా)

ఒక వనిత తన ప్రియుణ్ని చూచింది అకస్మాత్తుగా. అప్పుడు తనకు కలిగిన భావాన్ని, స్థితిని తన మామ భార్యకు తెలుపుతున్నది. మనకు యిష్టమయినవాడు కనిపిస్తాడు. హఠాత్తుగా చూస్తాము. తనివి తీరదు. స్వప్నంలో మంచినీళ్ళు తాగితే దప్పి ఆరదు కదా! అలాగే ఉంటుంది పరిస్థితి. ఈ వనిత పరిస్థితి కూడ అలాటిదే అందుకే తమిళ ఆళ్వార్లు భగవంతుని ఆరాద అమృతం అన్నారు—ఎంత తాగినా తనివితీరని అమృతం వంటివాడు భగవంతుడు, అంటే అతృప్త్యమృత రూపుడు.

12. సుజణో జం దేసమలంకరేఇ తం విఅ కరేఇ పవసంతో
గామాసణ్ణుమ్మూలిఅ మహావడట్ఠాణ సారిచ్ఛమ్ 1-94

(సుజనో యందేశ మలంకరోతి తమేవ కరోతి ప్రవసన్.
గ్రామాసన్నోన్మూలిత మహావటస్థాన సదృశమ్)

సజ్జనుడు ఎక్కడ ఉంటాడో ఆ ప్రాంతానికి అలంకారంగా ఉంటాడు అక్కడినుంచి వెళ్ళిపోయాడా, పెద్ద వెలితి ఏర్పడుతుంది. దానిని పూరించడం కష్టం. గ్రామ సమీపంలో పెద్ద మర్రిచెట్టు ఉంటుంది. అదికూలి పోయిందనుకుందాం. దాని స్థానంలో ఎన్నిచెట్లు మొలిస్తే మొదట అందం, గాంభీర్యం వస్తాయి? వెలితి ఎలా తీరుతుంది?

13. దుఃఖం దేంతో వి సుహం జణేఇ జో జస్స వల్లహో హోఇ 1-10

(దుఃఖం దదదపి సుఖం జనయతి యో యస్యవల్లభో భవతి)

మనకు ఇష్టమైన వాళ్ళు కష్టం కలిగించినా సుఖంగానే ఉంటుంది. కష్టంగా అనిపించదు.

14. తే విరాల సప్పురిసా జాణ సిణేహో అహిణ్ణముహరాఓ
అణుది అహ వడ్ఢమాణో రిణం వ పుత్తేసు సంకమ ఇ 2.13

(తే విరలాః సత్పురుషాః యేషాం స్నేహః అభిన్నముఖరాగః

అను దివస వర్థమాన ఋణమివ పుత్రేషు సంక్రామతి)

సత్పురుషుల స్నేహం ఒకే విధంగా ఉంటుంది. రంగుమారదు. దినదినమూ పెరుగుతూ వుంటుంది, అప్పులాగ. తండ్రి తీర్చని అప్పు కొడుకులు తీర్చవలసినట్టుగా వంశపారంపర్యంగా సంక్రమిస్తుంది. అలాటి సత్పురుషులు అరుదుగా వుంటారు. కొందరి స్నేహం వారితోనే సమసిపోకుండ కొడుకులకూ సంక్రమిస్తుంది. కొడుకులూ తండ్రిలాగే స్నేహాన్ని కాపాడు కుంటూంటారు. అలాటి వంశపారంపర్య స్నేహం అరుదుకాదూ మరి!

15. గుణేసు కో మచ్ఛరం వహఇ? 2-18
(గుణేషు కో మత్సరం వహతి?)

గుణాలను అందరూ ఆదరిస్తారు. మత్సర్యం ఎందుకు ఉంటుంది?

16. వసఇ జహిం చేఅ ఖలో పోసిజ్జంతో సిణేహదాణేహిం,
తం చేఅ ఆలఅం దీఅఓ వ్వ అఇరేణ మఇలేఇ 2-35

(వసతి యత్రైవ ఖలః పోష్యమాణః స్నేహ దానైః
తమేవాలయం దీపక ఇవాచిరేణ మలినయతి)

దుష్టుల విషయంలో జాగ్రత్తగా వుండాలని ఒకడు తన మిత్రునికి హితవు చెబుతున్నాడు. దుష్టుణ్ని స్నేహంతో ఆశ్రయమిచ్చి పోషిస్తే మనకే త్వరలో మసిపూస్తాడు. మన ఇంటినంతా మసిచేస్తాడు—దీపంలాగా. దీపాన్ని నూనె పోసి కాపాడుతాము. కాని ఇంటినంతాపొగతో పాడుచేస్తుంది. దుష్టుడు మనకేకాక మన ఇంటికంతా తలవంపులు తెస్తాడు. కనుక అలాటి వాడిని చేరదీయరాదు.

17. హోంతీ విశిష్ఫలచ్చిఅ ధణరిద్ధీ హోఇ కివిణపురిసస్స ః
గిహ్మఅవసంతత్తస్స ణిఅఅచ్ఛాహి వ్వ వహిఅస్స. 2-38

(భవంత్యపి నిష్ఫలైవ ధనబుద్ధిర్భవతి కృపణపురుషస్య
గ్రీష్మాతపసంతప్తస్య నిజకచ్ఛాయైవ పథికస్య.)

పిసిని గొట్టుకు డబ్బు విరాళంగా పెరుగుతున్నా ప్రయోజనం లేదు వ్యర్థం. మండుటెండలో వెళ్లే వాడికి తన నీడ చలవనిస్తుందా ః అలాగే పిసిని గొట్టు డబ్బు అతడు ఖర్చు పెట్టడు గనుక నిరర్థకం.

18. సమసోక్ఖదుక్ఖపరివడ్ఢి అణ కాలేణ రూఢపేమ్మాణమ్
మిహుణాణం మరఇ జం తం ఖు జిఅఇ ఇఅరం ముఅం హోఇ. 2-42

(సమసౌఖ్యదుఃఖపరివర్ధితయోః కాలేన రూఢప్రేమ్ణోః,
మిధునయోః మ్రియతే యత్ తత్ఖలు జీవతి, ఇతన్మృతం భవతి.)

"పరస్పరప్రార్థ్య నిరాశ యోర్వరం శరీరనాశోపి సమానురాగయోః" సమమైన అనురాగంతో పరస్పరం కోరుకుంటూ, విపరీత విధి వల్ల కలుసుకొనేఅవకాశంలేని ప్రేయసీ ప్రియులు మరణించినా మేలే అంటాడు కాళిదాసు. ఈ గాథా కవి వర్ధరంకుడు కాళిదాసుకన్నా గొప్పగా, అంశకన్నా ముందుగా ఇలాఅన్నాడు: సుఖదుఃఖాల్లో సమంగా పెరుగుతూ కాలం గడచినకొద్దీ (అతిపరిచయంవల్ల సడలక) ప్రేమను దృఢపరచుకుంటూ వున్న దంపతుల్లో మొదట మరణించే వ్యక్తే నిజంగా జీవించినట్టు, మరణించని వ్యక్తి నిజంగా చచ్చినట్టే.

19. జేణ వినా ణ జివిజ్జఇ అణుణిజ్జఇ సో కఅవరాహో వి.
పత్తే వి ణఅరదాహే భణ కస్స ణ వల్లహో అగ్గీ ః 2-63

(యేన వినా న జీవ్యత్యే నునీయతే స కృతాపరాధో పి,
ప్రాప్తే పి నగరదాహే భణ కస్య న వల్లభోగ్ని ః)

కొందరిని మనం వదలుకోలేము. వారు లేక గడవదు. అలాంటప్పుడు వారు ఏదో పొరపాటు చేసినా సర్దుకుపోవాలి. ఊరిని కాల్చిందికదా అని నిప్పును వాడడం మానివేస్తామా ః నిప్పు అందరికీ ఇష్టమే, అత్యవసరంకూడ. ఇది రోహా అనే కవయిత్రి గాథ.

20. ఖణమేత్తం పి ణ ఫిట్టఇ అణుదిఅహవిఇణ్ణగురుఅ సంతావా,
పచ్ఛణ్ణపావ సంకే వ్వ సామలీ మజ్ఝ హిఅఆవో 2-83

(క్షణ మాత్రమపి నాపయాతి అనుదివసవితీర్ణ గురుక సంతాపా,
ప్రచ్ఛన్నపాపశంకేవ శ్యామలా మమ హృదయాత్)

మనం ఏదైనా తప్పుచేస్తాము. దానిని చెప్పుకొని పశ్చాత్తాప పడే ధైర్యం వుండదు. ఎక్కడ బయటపడుతుందో అది అని ప్రతిదినం మనసు వ్యథపడుతూనే వుంటుంది. క్షణమయిగా మనసు నుంచి శంక-భయం తొలగదు. ఎప్పుడూ మనసును విడిపోని బాధ కలిగించే ప్రియురాలిని కవి ఈ పాప శంకతో పోల్చాడు.

ఇది సంప్రదాయ, ఆలంకారిక సమయ విరుద్ధమైనా, హాలుడు.

21. సరఏ మహద్దహాణం అంతో సిసిరాఇం బాహిరుణ్హాఇం,
జాఆఇం కువిఅ సజ్జణ హిఅఅసరిచ్ఛాఇం సలిలాఇం 2-96

(శరది మహాహ్రదానా మంతః శిశిరాణి బహిరుష్ణాని,
జాతాని కుపిత సజ్జన హృదయ సదృక్షాణి సలిలాని)

సజ్జనులకు కోపంరాదు. వచ్చినా తాటాకు మంటలాగ కొంచెంసేపు వుంటుంది. అంటే, పైకి వేడిగా వుంటుంది. హృదయం చల్లగానేవుంటుంది. కోపం దీర్ఘంగా వుండదు. ఎలాగంటే, శరత్కాలంలోని మడుగునీటివలె. ఈ నీరు పైకి సూర్యుని తీక్ష్ణకోణాలకు వేడెక్కుతుంది.

22. ఉప్పణ్ణత్థే కజ్జే అఇచింతంతో గుణాగుణే తమ్మి,
చిర ఆల మందపేచ్ఛిత్తణేణ పురిసో హణఇ కజ్జమ్ 3-14

(ఉత్పన్నార్థే కార్యే తిచింతయన్ గుణాగుణౌతస్మిన్,
చిరకాల మంద ప్రేక్షిత్వేన పురుషో హంతి కార్యమ్)

పని చేకూరే సమయంలోనూ దానిలోని గుణ దోషాలు లెక్క పెడుతూ, ఏ క్షణానికి ఏమి వస్తుందో అని ఎప్పుడూ శంకించే వారుంటారు. పని పాడుకావడానికి వారే కారకులు. కనుక అలా నిరంతరం శంకించక పనులు ధైర్యంగా నెరవేర్చుకోవాలి.

23\. తంమిత్తం కొఅవ్వం జం కిర వసణమ్మి దేశఆలమ్మి,
అలిహిఅభిత్తి వా ఉల్ల అం వ ణ పరమ్ముహం రాఇ
3-17

(తన్మాత్రం కర్తవ్యం యత్కిల వ్యసనే దేశకాలేషు,
ఆ లిఖిత భిత్తి పుత్తళ కమివ న పరాఙ్ముఖం తిష్ఠతి)

"సమాన శీల వ్యసనేషు సఖ్యం" సమానమైన చరిత్ర గలవాళ్లు, కష్టాలు వున్న వారికే స్నేహం కలుస్తుందని పెద్ద లంటారు. ఈ గాథా కారుడైన పాలితుడు ఎలాటి వాడితో మైత్రి చేయాలో చెబుతున్నాడు; కష్టాలలోను, కాలదేశాలు మారినా పెడమొగం పెట్టనివాడితో స్నేహం చేయాలట. దానికి కవి ఒక అపూర్వమైన ఉదాహరణ మిచ్చాడు. గోడ మీద గీసిన బొమ్మ ఎప్పుడూ పెడమొగం పెట్టని వాడుగా ఉండాలట. గోడమీది బొమ్మలాగఎప్పుడూ మనను చూస్తుం టుందేగాని ముఖం తిప్పదు.

24\. తా మజ్ఝిమో చ్చిఅ వరం దుజ్జణసుఅణేహిఁ దోహిఁవి ణ కజ్జమ్
జహ దిట్ఠో తవఇ ఖలో తహేఅ సుఅణో అఈసంతో
3-24

(తన్మధ్యమ ఏవ వరం దుర్జనసుజనాభ్యాం ద్వాభ్యాం న కార్యం,
యథా దృష్టః తాపయతి ఖలస్తదైవ సుజనః
అదృశ్యమానః)

కాని, హాలుడు మైత్రి విషయంలో కొత్తసూత్రం చెబుతున్నాడు. దుర్జనులు, సజ్జనులకన్నా ఏవర్గానికీ చెందని మధ్యముడే మేలు. అతనితో స్నేహం చేయడం ఉచిత మంటాడు హాలుడు. దుర్జనుణ్ని చూస్తూవుంటేనే ఒళ్ళు మండు తుంది. ఇక సజ్జనుడు కనిపించకపోయాడా మండుతుంది ఒళ్ళు. కనుక మంచివాడూ మనకు వద్దు, చెడ్డవాడూ వద్దు. సాధారణునితోనే చెలిమి చేద్దాం. మనకు ఎలాటి తాపమూ కలిగించడు-అంటాడు హాలుడు.

25\. పాణ ఉడీఅ వి జలిఊణ హుతవహో జలఇ జణ్ణ వాడమ్మి,
ణ హు తే పరిహరిఅవ్వా విసమదశాసంఠిఅ పురిసా
3-27

(పానకుట్యామపిజ్వలిత్వా హుతవహోజ్వలతి యజ్ఞ వాటేపి,
నఖలుతే పరిహర్తవ్యా విషమ దశా సంస్థితాః
పురుషాః)

కొందరిని ఏ పరిస్థితిలోను వదలుకోరాదు అంటాడు హాలుడు. నిప్పు కల్లు దుకాణంలోను మండుతుంది; యజ్ఞ వాటికలోనూ. మరి దానిని అపవిత్రమని వదలి పెడతామా ? అలాగే కొందరు ఉత్తములు తమకు తగని విషమ పరిస్థితులలో ఉండవలసి వస్తుంది. అంత మాత్రాన వారిని వదులుకోవచ్చా!

26\. జాఏజ్జ వణుద్దేసే కుజ్జో వి హుఁ ణీసహో ఝడిఅపత్తో,
మా మాణుసమ్మి లోఏ తాఈ రసిఓ దరిద్దో అ 3-30

(జాయతాం వనోద్దేశే కుబ్జోపి ఖలు నిశ్శాఖః శిథిల వత్రః;
మా మానుషే లోకే త్యాగి రసికో దరిద్రశ్చ)

అడదై పుట్టడం కంటే అడవిలో మానై పుట్టడం మేలని ఆడువారు అడికలు ఆడుకుంటుంటారు. ఇతనెవరో పాపం! "త్యాగశీలుడై నరసికుడు-సహృదయుడు దరిద్రుడ గా పుట్టడంకన్నా అడవుల్లో కొమ్మలులేని, ఆకులు రాలిన మరు గుజ్జు మోడయి పుట్టడం మేలు!" అని అనుకుంటున్నాడు.

27\. అద్దంసణేణ పుత్తఅ సుట్ఠువి ణేహాణుబంధ ఘటఆఇం,
హత్థ ఉడపాణి అఇఁ వ కాలేణ గలంతి పేమ్మాఇం
3-36

(అదర్శనేన పుత్రక సుష్ఠ్వపి స్నేహానుబంధ ఘటితాని
హస్తపుటి పానీయానీవ కాలేన గలంతి ప్రేమాణి)

ఇంతకుముందు ఒక కవి "స్త్రీలను తరచు చూస్తూ పలకరిస్తూ వుండాలి. లేకపోతే ప్రేమలు వుండవు"అన్నాడు. స్త్రీల విషయంలోనే కాదు; ఎంత బలమైన ప్రేమలయినా, ఇతరుల విషయంలోను చూపులు లేకపోతే రాకపోకలు లేక

పోతే, దోసిలిలోని నీటిలాగ క్రమంగా ఆరిపోతాయని ఈ గాథా రచయిత అన్నాడు.

28. అక్ఖేవఅఇం పిఅజంపిఅఇం పరహిఅఅణివ్వుది అరాఇం,
విరళో ఖు జాణఇ జణో ఉప్పణ్ణే జంపిఅవ్వాఇం.

(వాక్ క్షేపకాణి ప్రియజల్పితాని పరహృదయ నిర్వృతికరాణి,
విరళః ఖలు జానాతి జన ఉత్పన్నే జల్పితవ్యాని.)

కొందరు చాలా చతురులు. తమ మీద ఇతరులకు సందేహం కలిగితే, వారి ఆక్షేపాలన్నిటికీ సమాధాన మిస్తారు; తియ్యంగా మాట్లాడి ఎదుటివారి హృదయాలను లోబరచుకొంటారు. పొరపాట్లు జరిగితే, ఎదుటివారు కోప పడకుండా ఎలా మాట్లాడాలో కూడ తెలుసుకొని అలా ప్రవ ర్తిస్తారు. ఇలాటి చాతుర్యం గలవారు అరుదుగా ఉంటారు.

29. ఛజ్జఇ పహుస్స ఎలిఅం సిఆఇ మాణో ఖమా సమత్థస్స,
జాణంతస్స అ భణిఅం మోణం చ అఅణమాణస్స 3-43

(శోభతే ప్రభోర్లలితం, ప్రియాయా మానః క్షమా సమర్థస్య,
జానతశ్చ భణితం మౌనం చాజానతః)

సొంపుగా ఉండేవి కొన్నే ఉంటాయి.అన్నీ అన్ని వేళలా సొంపుగా ఉండవు. ప్రభువు స్వేచ్ఛాచారం సొంపుగావుంటుంది ప్రియురాలి బింకం అందమిస్తుంది. సమర్థుడైన వాని ఓరిమి అందమిస్తుంది. జ్ఞానవంతుని మాట వినసొంపుగా ఉంటుంది. అజ్ఞానిమౌనం అందమిస్తుంది. కనుకనే భర్తృ హరి "విభూషణం మౌనమపండితానామ్" పండితులు కాని వారు మౌనం పాటించడం చాల అందమిస్తుంది.

30. లేవ్వమ్మి పరాహుత్తే పత్తిఅఘడిఅం పి విహాఇ నరాణం,
కజ్జం వాలుఆవరణం వ్వ కహం వి బంధం విఅ ఏఇ 3-45

(దైవే పరాఙ్ముఖే ప్రతిహి ఘటితమపి విఘటతే నరాణామ్,
కార్యం వాలుకావరణమివ కథమపి బంధనమేవ న దదాతి.)

దైవం అనుకూలంగా లేనప్పుడు సమకూడే పని కూడ చెడిపోతుంది. ఇసుకగోడ ఎంతగా కట్టినా నిలువనట్టు పని సానుకూలంకాదు. మానవప్రయత్నానికి దైవం అనుకూలిం చాలి. కాని మానవుడు దైవం అనుకూలంగా లేదనే సాకుతో యత్నించడం మానరాదని భర్తృహరి అన్నాడు.

31. ఉప్పాఇఅ దవ్వాణం వి ఖలాణం కో ఖాఅణం ఖలో చ్చేఅ,
పక్కాఇం వి ణింబఫలాఇం ణవరం కావిహిం ఖజ్జంతి 3-48

(ఉత్పాదితద్రవ్యాణామపి ఖలానాం కో ఖాదనం ఖల ఏవ,
పక్వాన్యపి నింబ ఫలాని కేవలం కాకైః ఖాద్యంతే)

దుర్మార్గులు సంపాదించే ధనాన్ని అనుభవించేవారు ఎవరనుకున్నారు? దుర్మార్గులే దుర్మార్గులు తమ సంపాద నను మంచి పనులకు వినియోగించరు. వేప చెట్లు విరగబడి పండుతాయి. వాటిని తినేవి కాకులే సుమా! కనుక కష్టపడి ఆర్జించిన ధనాన్ని సత్కార్యాలకు వినియోగించాలి అని కవి భావం.

32. సుజణో ణ కుప్పఇ వ్విఅ అహ కుప్పఇ విప్పిఅం ణ చింతేఇ
అహ చింతేఇ ణ జప్పఇ అహ జప్పఇ లజ్జిఓ హో ఇ. 3-50

(సుజనో న కుప్యత్యేవ, అథ కుప్యతి విప్రియం న చింతయాతి,
అథ చింతయాతిన జల్పతి. అథ జల్పతి లజ్జితో భవతి)

అర్జునుడనే కవి (జ్జు) స్వభావాన్ని ఈ గాథలో సూత్రప్రాయంగా తెలిపాడు. సజ్జనుడు సాధారణంగా కోపగించుకోడు. ఒకవేళ కోపగించుకొన్నాడా, కసితీర్చు కొందామని అనుకోనే అనుకోడు ఒకవేళ అనుకున్నాడా

అదిమనసులోనే ఉంటుందిగాని పైకిదురుసుగా మాట్లాడడు. కోపం వచ్చలేక ఒకవేళ పైకి దురుసుగా మాట్లాడాడా సిగ్గు పడిపోతాడు, ఛీః ఏమిటి ఇలా అంటున్నాను-అని.

33. సో అత్థో జో హత్థే! తం మిత్తం జం నిరంతరం వసణే,
తం రూఅం జత్థ గుణా తం విణ్ణాణం జహింధమ్మో 3-51

(స్వార్థో యో హస్తే, తన్మిత్రం యన్నిరంతరం వ్యసనే,
తద్రూపం యత్ర గుణాః, తద్విజ్ఞానం యత్రధర్మః)

పుస్తకంలోనివిద్య, పరుల చేతిలోఉన్న ధనం సమయానికి ఉపయోగించేవి కావు అని ఒకరన్నారు. విద్య అంటే అంతా కంఠస్థంగా వుండాలి. డబ్బు అంటే పరాధీనంగా ఉండక స్వతంత్రంగావినియోగించుకొనదగినదిగా ఉండాలి. ఈ సంగతినే ప్రపంచానుభవం విస్తారంగా గల హాలుడు వివరిస్తున్నాడు. చేతిలో సిద్ధంగా వుండేదే ధనం. ఆపద వచ్చినప్పుడు శారీరకంగాను, మానసికంగాను అంటి పెట్టుకొని ఉండేవాడే నెచ్చెలి. గుణాలున్నదే రూపం. అంటే గుణంకూడ వున్నప్పుడే రూపమూ రాణిస్తుంది. కేవలం బాహ్యసౌందర్యంప్రయోజనకరంకాదు, మానసికసౌందర్యం కూడ అవసరం. ధర్మచింత వున్నదే విజ్ఞానం. విజ్ఞానమంటే శాస్త్రాదులలో బహుజ్ఞత. ఇంతటి బహుజ్ఞత ధర్మదృష్టి, ధర్మచింత లేనిదే నిరుపయోగం.

.. అకులీణో దోముహఓ తావ మహురో భోఅణం ముహే జావ,
మురజోవ్వ ఖిలో జిణ్ణమ్మి భోఅణే విరస మారసఇ 3-53

(అకులీనో ద్విముఖః తావన్మధురో భోజనం ముఖే యావత్,
మురజ ఇవ ఖిలో జీర్ణే భోజనే విరస మారసతే.)

దుర్మార్గుడు మద్దెలవంటి వాడని కవి చక్కగా పోల్చాడు. మద్దెలకు రెండు ముఖాలు; దుర్మార్గునికి కూడా రెండుముఖాలు, స్వార్థంచేకూరినప్పుడు ఒకవిధంగాను చేకూరనప్పుడు మరో విధంగాను మాట్లాడుతాడు. దుర్మార్గుని

పుట్టుక కూడ మంచి వంశంలో కాదు. మంచి వంశంవాడు దుర్మార్గుడు కాడుకదా! మద్దెలకూడ అకులీనం. (ఇక్కడ శ్లేష సహాయపడవలసి వచ్చింది కవికి) మద్దెలను వాయిం చేప్పుడు గుడ్డ కుదురుగా చుట్టి దానిమీద పెట్టి వాయిస్తారు. కనుక భూమి సంబంధం లేనిది. (కు-భూమి. దానిలో లీనం కానిది, అనినిది.) మద్దెలలో మంచినాదం రావడానికి అన్నం గాని, ఉడికించిన పిండికాని మెత్తుతారు. మెత్తగానే మంచి నాద మిస్తుంది-పలుకుతుంది. దుర్మార్గుడుకూడ తిండితింటు న్నంతవరకు-స్వార్థం నెరవేరుతున్నంతవరకు తియ్యగా మనపాటే పాడుతాడు. స్వార్థం నెరవేరిన తర్వాత, పిండిముద మెత్తని మద్దెలవలె విరసంగా పలుకడం ప్రారం భిస్తాడు.

35. లహు అంతి లహుం పురిసం పవ్వ అమేత్తం పి దో వి కజ్జఇం
ణివ్వరణ మణివ్వూఢే, ణివ్వూఢే జం అ ణివ్వరణమ్ 3_65

(లఘయతో లఘు పురుషం పర్వతమాత్రమపి ద్వే అపి కార్యే
నిర్వరణ మనిర్వ్యూఢే నిర్వ్యూఢేయచ్చ నిర్వరణమ్)

రెండుపనులు చేయరాదంటాడు గోవిందసామి అనే కవి. అవి రెండు ఏమిటంటే: చేయని పనిని ఇట్లా చేస్తాను, అట్లా చేస్తాను అని తన గుణ గణ ప్రకాశనార్థం చెప్పుకోడం, చేసిన పనిని ఇట్లా చేశాను, అట్లా చేశాను అని ఆత్మ ప్రశం సగా చెప్పుకోడం- ఇవి రెండూ కొంతంత పెద్దవాడినికూడ త్వరలో కొంచికగా (చిన్నగా) చేస్తాయి. చేయని పనిని గురించి చెప్పుకోడం వ్యర్థం. చేసిన పిదప చెప్పుకోడం ఆత్మ శ్లాఘ అవుతుంది. కనుక ఉత్తముడు ఈ రెండు పనులూ చేయరాదు.

36. విణ్ణాణగుణ మహగ్ఘే పురిసే వేసత్తణం పి రమణిజ్జమ్,
జణణిందిఏ ఉణ జణే-పిఅత్తణేణావి లజ్జామో. 5-67

(విజ్ఞానగుణమహార్ఘే పురుషే ద్వేష్యత్వమపి రమణీయమ్
జననిందితే పునర్జనే ప్రియత్వేనాపి లజ్జామహే)

లోకుల మనస్తత్వాన్ని సవరసత్తి (శబరశక్తి) అనే జానపదకవి ఈ గాథలో చక్కగా తెలిపాడు. ఒకరు తన మిత్రునితో ఇలా అంటాడు: విజ్ఞానం, గుణం మున్నగు వాటితో సంఘంలో గౌరవాదరాలు పొందుతున్న వారితో ద్వేషమయినా అందంగా వుంటుంది. జననిందితుడైన వ్యక్తిపై ప్రీతి చూపడానికికూడా సిగ్గుపడుతుంది లోకం. ఇది లోకం పోకడ.

37 అణువత్తణం కుణంతో వేసేవి జణే అహిణ్ణ ముహరాఓ,
అప్పవసో వి హు సుఅణో పరవ్వసో ఆహిఆఈ ఏ 3_65

(అనువర్తనం కుర్వన్ ద్వేష్యేపిజన్యే భిన్నముఖరాగః
ఆత్మవశోపి ఖలు సుజనః పరవశః ఆభి జాత్యస్య)

సజ్జనుని ప్రవర్తన అపూర్వంగా వుంటుంది. శత్రువు ఇంటికి వచ్చినా, ద్వేషాసహ్యాలు ముఖంలో ఏ మాత్రం కనబడనీక, ఆదరిస్తాడు. నిజానికి ఆ శత్రువుకు అతడు భయ పడవలసిన పనిలేదు, అతనికి ఇతడేమీ పరతంత్రుడు కాడు. కాని కులీనతకు-వంశగౌరవానికి, ఇంటితనానికి-పర తంత్రుడు. అందువల్లనే శత్రువునుకూడ ఎలాటి మనోవికా రాలూ ముఖంలో చూపక ఆదరిస్తాడు.

38. కిరంతీ వ్విఅ ణాసఇ ఉఅఏ రేహవ్వ ఖలఅణే మేత్తీ
సా ఉణ సుఅణమ్మి కఆ అణహా పాహాణరేహ వ్వ 2_72

(క్రియమాణైవ నశ్యత్యుదకే రేఖేవ ఖలజనే మైత్రీ,
సా పునః సుజనే కృతా అనఘా పాషాణ రేఖేవ)

సుజన దుర్జనమైత్రి ఎలాటిదో సరళంగా, వర్ణించాడు సరలుడనే కవి : దుష్టులతో మైత్రి చేస్తున్నప్పుడే నీటిపై గీతలాగ నశిస్తుంది. సజ్జనులతో చేసే మైత్రి నిరపాయంగా రాతిపై గీతలాగ స్థిరంగా వుంటుంది.

39. గంధేణ అప్పణో మాలిఆణం ణోమాలి అణ ఫుట్టిహఇ
అణ్ణో కోవి హఆసాఇ మంసలో పరిమలుగ్గారో 3-81

(గంధేనాత్మనో మాలికానాం నవమాలికాన చ్యుతా భవిష్యతి
అన్యః కోపి హతాశాయా మాంసలః పరిమలోద్గారః)

సంఘంలో కొందరి విశిష్టత కొట్టవచ్చినట్టు కనిపి స్తుంది. ఎలాగంటే, పూలలో జాజిమల్లెలలాగ. దాని వాసన

ఏ పూవు వాసనకూ తీసిపోదు. దాని గుబాళింపే వేరు. తక్కిన పూవుల వాసనను తీసికొని మొత్తంగా వ్యాపించేది దాని స్వభావం. విశిష్ట వ్యక్తుల సంగతీ అలాటిదే. వారు తక్కిన వారికన్నా అన్నింటా ముందు ఉంటారు వారి గుణగణాలను వెనక్కు నెట్టివేస్తూ. పాపం! ఆదరించే వారు ఒకప్పుడు లేకపోయినా సరే.

40. ఫలసంపత్తీఅ సమోణఆఇం తుంగాఇం ఫలవివత్తీఏ,
హిఅఆఇ సుపురిసాణం మహాతరూణాం వ సిహరాఇ 3-82

(ఫలసంపత్త్యా సమవనతాని తుంగాని ఫల విపత్త్యా
హృదయాని సుపురుషాణాం మహాతరూణా మివ శిఖరాణి)

గొప్పవారిమనస్సు ఉదాత్తమైనది. వారు ఐశ్వర్య ముతో తులదూగినప్పుడు వినయంతో ప్రవర్తిస్తారు. విరగ గాచిన పండ్ల చెట్ల కొమ్మలలాగ. ఐశ్వర్యం కోలుపోయినప్పుడు దైన్యం అవంతైనా లేక పండ్లులేని ఆ చెట్లకొమ్మలలాగే తల ఎత్తుకొని వుంటారు. సుఖంలో ఒళ్ళుతెలియక విర్ర వీగడు, కష్టాలలోదీనంగా ముఖం వేలవేసుకోవడం సామా న్యుల స్వభావం.

41. తుంగోచ్చి అ హోఇ మణో మణంసిణో అంతిమాసు వి
దసాసు,
అత్థమణమ్మి వి రఇణో కిరణా ఉద్ధం చిఅ ఫురంతి 3-84

(తుంగమేవ భవతి మనః మనస్వినోంతిమాస్వపి
దశాసు,
అస్తమనేపి రవేః కిరణాః ఊర్ధ్వమేవ స్ఫురంతి)

మరొక కవి గొప్పమనసు వారిస్వభావాన్ని మరొక విధంగా వివరించాడు. గొప్పమనసువారి మనస్సు తుది దశలోకూడ తన గొప్పతనాన్ని కోల్పోదు, ఉన్నతంగానే ఉంటుంది. సూర్యుడు అస్తమిస్తున్నప్పుడుకూడ, అతని కిర ణాలు వంగిపోవు; పైకే ప్రసరిస్తుంటాయి.

42. పోట్టం భరంతి సఉణా వి మాఉఆ అప్పణో అణువ్విగ్గా,
విహలుద్ధరణ సహావా హువంతి జఇ కే వి సప్పురిసా
3-85

(ఉదరం బిభ్రతి శకునా అపి హే మాతరః ఆత్మనో
నుద్విగ్నాః,
విహ్వలోద్ధరణస్వభావాః భవంతి యది కేపి సత్పురుషాః)

కష్టాల్లో ఉన్నవారిని ఆదుకొనేవారే గొప్పవారంటు న్నాడు ఈ గాథాకవి, ఒక పల్లెటూరిపడుచు మాటల్లో. పక్షులుకూడ పొట్టపోసుకుంటాయి హాయిగా. దానిలోఏముంది గొప్ప! ఆపదల్లో చిక్కుకున్నవారిని ఆదుకొనేవారే సత్పురు షులు. అలాటి వారు అరుదుగా వుంటారు. పక్షులే తమపొట్ట తాము పోసుకుంటున్నప్పుడు మనుష్యుల సంగతి చెప్ప నక్కరలేదు. తమస్వార్థం తాముచూసుకుంటూనే వుంటారు. తమసుఖం కాదని, ఇతరులకు తోడ్పడే వారుకదా సత్పురు షులు. వారికి తమ పొట్టచింత అంతగా వుండదు. వారుతిండి కోసంపుట్టినవారుకారు; వారికి పొట్ట ప్రధానసమస్యకాదు.

43. ణ విణా సబ్భావేణ ఘ్రేప్పఇ పరమత్థ జాణుఓ లోఓ,
కో జుణ్ణ మంజరం కంజిఏణ వేఆరి ఉం తరఇ? 3-86

(న వినా సద్భావేన గృహ్యతే పరమార్థజ్ఞో లోకః
కో జీర్ణమార్జారం కాంజికయా ప్రతారయితుం శక్నోతి?)

ప్రపంచాన్ని మోసంచేయలేమంటున్నాడు భోజుడనే కవి. లోకం వెర్రిది కాదు. పరమార్థం తెలిసినట్టిది. కనుక మోసం చేసి వశపరచుకోలేము; ఏవేవో అల్లిబొల్లి కబుర్లతో లోబరచు కోలేము. ఎంతో ప్రపంచం చూచి అనుభవం పొందిన ముసలి పిల్లిని గంజిపెట్టి మోసం చేయడం సాధ్యమా? ముసలిపిల్లి గంజినిచూచి, పాలు అని మోస పోతుందా? ప్రపంచంకూడ అంతే. మంచితనంతో జనాన్ని లోబరచుకోగలంగాని మోసంతో కాదు.

44. రణ్ణా ఉ తణం రణ్ణాఉ పాణిఅం సవ్వఅం సఅంగాహమ్
తహ వి మయాణం మఈణం అ ఆమరణాంతాఇం
పేమ్మాఇం 3-87

(అరణ్యాత్తృణ మరణ్యాత్పానీయం సర్వతః స్వయం
గ్రాహం

తథాపి మృగాణాం మృగీణాం ఆ మరణాంతా ప్రేమాణి)

అకారణంగానూ, నిస్స్వార్థంగాను జనించే ప్రేమ ఆమరణాంతం తరగదు అంటాడు ఒక కవి. అడవుల్లో జింక లున్నాయి. జీవికకు అని ఒకదానిపైని మరొకటి ఆధారపడి

వుండవు. అడవుల్లో గడ్డితిని, అడవుల్లో నీరుతాగి స్వేచ్ఛగా, అన్నీ పరస్పర భావం లేకుండా స్వయంగానే సంపాదించు కుంటూ మనుగడ సాగిస్తాయి. కాని లేళ్ళు, దుప్పులు మర ణించే వరకు ప్రేమతో ఉంటాయి. కనుక నిస్స్వార్థమూ, నిరపేక్షమూ అయిన ప్రేమే శాశ్వతమైనది.

45. జహ జహ జరాపరిణఓ హోఇ పఈ దుగ్గఓ విరూఓ వి,
కులవాలిఆణ తహ తహ అహిఆఅరం వల్లహో హోయి 3-93

(యథా యథా జరాపరిణతో భవతి పతిః దుర్గతో విరూపోపి,
కులపాలికానాం తథా తథా ధికతరం వల్లభో భవతి)

కులస్త్రీల - ఉత్తమవంశ సంజాతలయిన స్త్రీల స్వభా వాన్ని, పొట్టిసుడనేకవి ఈ గాథలో వర్ణించాడు. సామాన్య స్త్రీలయితే రూపం, ధనం, యౌవనం చూచి భర్తలను ఆద రిస్తారు, రూపహీనుడైనా దరిద్రుడైనా వయసు మళ్ళినా ఆదరణ తగ్గుతుంది. కులస్త్రీల స్వభావం దీనికి ప్రతికూలం. పతి ముసలివాడయిన కొద్దీ, బీదవాడయిన కొద్దీ, రూపహీను డయిన కొద్దీ కులస్త్రీల ప్రేమ ఎక్కువవుతుంది. వారిదిసహజ ప్రేమ. బాహ్య విషయాలకు అతీతమైనది.

46. ణ గుణేణ హీరఇ జణో హీరఇ జో జేణ భావిఓ తేణ,
మోత్తూణ పుళిందా మోత్తిఆఇం గుంజాఓ గేహ్ణంతి 4-10

(న గుణేన హ్రియతే జనో హ్రియతే యో యేన భావితస్తేన,
ముక్త్వా పులిందా మౌక్తికాని గుంజా గృహ్ణంతి)

జిహ్వకొకరుచి, పుర్రెకొక బుద్ధి - అన్నారు అనుభ వజ్ఞులు. కనుక ఎవరికిఏదిఇష్టమో వారు దానినిఆదరిస్తారు. గుణాలు చూడరు. విలువలూ చూడరు. బోయలు అడవులలో ఏనుగులనుచంపి ముత్యాలుసంపాదిస్తారు. కాని వారు వాటి విలువనుగాని, గుణాలనుగాని చూడక గురివిందలను దండలుగాగుచ్చుకొని వేసుకుంటారు. మరి పుర్రెకొకబుద్ధి అనక ఏమి చేస్తాము!

47. భుంజసు జం సాహీణం కుత్తో లోణం కుగ్గామరిద్ధమ్మి,
సుహఅ సలోణేణ వి కిం తేణ సిణిహో జహిం ణత్థి!

(ఖండ్వ యత్స్వాధీనం కుతో లవణం కుగ్రామరిద్ధి?
సుభగ సలవణేనాపి కిం తేన స్నేహో యత్ర నాస్తి?)

కేవలం బాహ్యలావణ్యానికి మోసపోరాదు. స్నేహం మానవునికి ముఖ్యమని త్రిలోచనుడనే కవి ఒక కుగ్రామ దృశ్యాన్ని వివరిస్తున్నాడు: ఒకనాగరికుడు కుగ్రామానికి పనిపడి వెళ్లాడు. ఒకగృహస్థు ఇంటిలో భోజనం ఏర్పాటు అయింది. ఉప్పులేనికూర వడ్డించింది యిల్లాలు. అతిథి భిత్తరపోయి ఆమెపైపు చూచాడు. "కుగ్రామం వంటలో లవణం ఎక్కడఉంటుంది? మేము వడ్డించింది, నీకులభిం చింది తిను, ఓ సుభగుడా? ఇంతకూ వట్టిలవణమున్నా ఏమిటి ప్రయోజనం? స్నేహం లేనప్పుడు?" అన్నది ఇల్లాలు. లవణ మంటే లావణ్యం; ఉప్పు. స్నేహ మంటే నూనె నేయివంటి పదార్థాలు; ప్రేమాదరాలు. కవి శ్లేషతో కేవలం లావణ్యం చూచి ఆకర్షితుడు కారాదని, ప్రేమాదరాలు సంపాదించడం కష్టమని చెప్పాడు. ఉప్పు, సౌందర్యం సులభవ్యయంతో, అల్పవ్యయంతో విలుచుకొనదగినవి. స్నేహం, చమురు ప్రేమ బహుమూల్యమయినవి. పల్లెటూరి అమాయకులు ప్రేమాదరాలతో వడ్డించింది ఆరగించుమంటుంది ఆఇల్లాలు.

48. అవమాణి ఓ వి ణ తహా దుమ్మిజ్జఇ సజ్జణో విహవహీణో,
పడికాఉం అసమత్థో మాణిజ్జంతో తహ పరేణ. 4-20

(అవమానితోఽపి న తథా దూయతే సజ్జనః విభవహీనః
ప్రతికర్తు మసమర్థో మాన్యమానో యథా పరేణ)

అభిమానధనుడైన సజ్జనుని మనస్తత్త్వమే వేరు-ముఖ్యంగా ధన విహీను డయినప్పుడు. కాని, ఇతరులు తనకు సమ్మానం చేసినప్పుడు, వారికి ప్రత్యుపకారం ఏమి చేయలేక పోతిమే, వారికేమీ ఇవ్వలేకపోతిమే అని కష్టపడ తాడు. అతనికి ఇతరులకు ఇవ్వడమే తప్ప, ఇతరులనుండి తీసుకోడం తెలీదు. ఇప్పుడు ఆ పరిస్థితి వచ్చి, ఇతరుల ఉప కారానికి ప్రత్యుపకృతి చేయకపోయామే అని బాధ.

49. కలహంతరే వి అవిణిగ్గ అఇం హిఅఅమ్మి జరముహగ అఇం,
సుఅణకఅఇం రహస్సాఇం దహఇ ఆయుక్ఖఏ అగ్గీ, 4-21

(కలహాంతర్వే వ్యవినిర్గతాని హృదయే జరాముపగతాని,
సుజనశ్రుతాని రహస్యాని దహత్యాయుఃక్షయేఽగ్నిః)

ఇది హాలునిగాధ. హాలుడు రాజనీతిచతురుడైన చక్ర వర్తి కనుక అతనికి రహస్యగోపనమంటే ఏమిటో తెలుసు. అది పెదవి దాటితే పృథివి దాటుతుందని కూడా తెలుసు. కనుకనే సజ్జనుల రహస్య గోపన యోగాన్ని వర్ణిస్తున్నాడు. సజ్జనులు ఎవరిదైనా ఏదైనా రహస్యం వింటే, దానిని వారితో పోట్లాటలు వచ్చినప్పుడుకూడ బయటపెట్టరు అది వారి హృదయంలోనే ముసలిదై పోయి, వారితో పాటేచితిలో కాలిపోవలిసిందేకాని, ఎన్నటికీ, ఎప్పటికీ, వెలువడదు.

50. వాహి వ్వ వేజ్జరహిఓ ధణరహిఓ సుజణమజ్ఝవాసో వ్వ.
రిఉరిద్ధిదంగుణఖమ్మివ దూసహణిఓ తుహ విఓఓ 4-63

(వ్యాధిరివ వైద్యరహితః ధనరహితః స్వజనమధ్యవాస ఇవ,
రిపు బుద్ధి దర్శనమివ దుస్సహనీయ స్తవ వియోగః)

వామదేవుడనే కవి విరహాన్ని సహింపరాని కొన్నింటితో పోల్చాడు. ఒక విరహిణి మాటలలో రహిణి విరహం దుస్సహమంటూ ఒక మాలోపమను చూపింది. వైద్యుడు లేని వ్యాధివలె, డబ్బులేక తనవారిమధ్య నివసించడం వలె, శత్రువు వృద్ధిపొందడాన్ని చూడడంవలె విరహం సహింప రానిది-అంటుంది.

51 వసణమ్మి అణుద్విగ్గా విహవమ్మి అగవ్వి ఆ భఏ ధీరా,
హోంతి అహిణ్ణ సహావా సమేసు విసమేసు సప్పురిసా 4-80

(వ్యసన్వేనుద్విగ్నా విభవ్వేగర్వితా భయే ధీరాః,
భవంత్యభిన్నస్వభావాః సమేషు విషమేషు సత్పురుషాః)

సత్పురుషుల స్వభావాన్ని మరొక కవి ఇలా వర్ణిస్తు న్నాడు. సత్పురుషులు కష్టాలకు కలతపడరు. ఐశ్వర్యం వచ్చినప్పుడు గర్వపడరు. భయంకరమైన పరిస్థితి వచ్చి నప్పుడు ధైర్యంతో ఎదుర్కొంటారు. అనుకూల ప్రతికూల సన్నివేశాలలో ఒకటే విధంగా నిబ్బరంతో ప్రవర్తిస్తారు.

52. ఉఅఅం లహిఊణ ఉత్తాణిఅణణా హోంతి కే వి సలి సేసమ్
రిత్తా ణమంతి సుఇరం రహట్ట ఘడిఅవ్వ కాపురిసా 5-90

(ఉదకం లబ్ధ్వా ఉత్తానితాననా భవంతి కేపి సవిశేషమ్,
రిక్తా నమంతి సుచిరం రహట్టఘటికా ఇవ కాపురుషాః)

గ్రామాలలోని సహజ దృశ్యాలతో నిత్యసత్యాలు తెలుపడం మహా కవుల లక్షణం దేనినైనా పరిశీలించడం, దానిని జీవితానికి అన్వయించడం సాధారణ విషయంకాదు. గ్రామాలలో పొలాలకు నిరుపెట్టడానికి కుండల కపిల వాడు తారు దీనిని రహట్టం, అరఘట్టం అని అంటారు ఈ కవి కొంచెపు సంపదకే మిడిసిపడే వారిని - అల్పులను కుండల కపిలతో పోల్చాడు కుండల కపిలలోని కుండలు బావిలోనో, మరేజలాశయంలోనో నీరు ముంచుకొన్న తర్వాత విర్రవీగుతూ పైకి లేస్తాయి నీరు కాలువతూములో పోసిన పిదప వట్టివయిపోయి ముఖం కిందికి దించుకుని మళ్ళీ నీటివైపు వస్తాయి అలాగే అల్పులు కొద్దిపాటి ధనం చేరగానే మోరఎత్తుకుని విర్రవీగుతూ "ఇక ఈ ప్రపంచంతో నాకేమిటిః" అన్నట్టు నడుస్తారు. ఆ డబ్బు కాస్త వ్యయ మయిపోగానే, ముఖం వేలవేసుకొని అడుగులు వేస్తారు. ఎక్కడలేని వినయ విధేయతలు చూపుతారు కనక ఉత్త ముడు కాగోరేవాడు కుండల కపిలలాగ ప్రవర్తించరాదు

53. సంతమసంతం దుక్ఖం సుహంచ జాఓ ఘరస్స జాణంతి
తో పుత్తఅ మహిళాఓ సేసా ఓః జరా మనుస్సారామ్ 6-12

(సదసత్ దుఃఖం సుఖం చ యా గృహస్య జానంతి,
తాః పుత్రక మహిలాః శేషా జరా మనుష్యాణామ్)

ఒక ఇల్లాలు తన కోడలికి ప్రపంచంలోను, ఇంట్లోను నడచుకోవలసిన తీరును బోధించే ఉద్దేశంతో తన కుమారు నితో ఇలా అంటున్నది 'నాయనా, ఇంట్లో ఉన్నది లేనిదీ మంచి చెడ్డా, సుఖం దుఃఖం తెలుసుకొని ఇంటిమేలు కోసం ప్రవర్తించే వాళ్ళే మహిళలు అనిపించు కొంటారు- ఇల్లాండ్రు అనిపించు కొంటారు. తక్కిన వారంతా పురుషులకు ముదిమివంటివారు. ముదిమి ఒంటి మీదికి తప్పని సరిగావచ్చి క్రమంగా దేహాన్ని కుంగదీసి, మరణాసన్నం చేస్తుందో అలాగే తక్కిన స్త్రీలూ పైనబడి పీక్కుతింటారేగాని ఇంటి తనాన్ని నిలబెట్టరు.

54. హసిఏహిఁ ఉవాలంభా అచ్చువ చారేహిఁ ఖిజ్జిఅవ్వాఇం
అంసూహిఁ మండణాఇం ఏసో మగ్గో సుమహిళాణం 6-13

(హసితైరుపాలంభా అత్యుపచారైః ఖేదితవ్యాని,
అశ్రుభిః కలహో ఏష మార్గః సుమహిలానామ్)

కులస్త్రీలు తమ కోపాన్ని ఎంత ఉదాత్తంగాను, సున్నితంగాను తెలుపుతారో ఒక అజ్ఞాతకవి సుకుమారంగా చెప్పాడు ఉత్తమ ఇల్లాండ్రు తమ కోపాన్ని, కష్టాన్ని, కలహాన్ని తెలిపే తీరేవేరు. ఎదుటివారిని మర్మందూరి పార నాడడానికి ఒక నవ్వు నవ్వుతారు. దానితో ఎదుటి వాన్కి లోలోపల రంపపుకోత అవుతుంది. అవసరానికి మించిన ఉప చారాలతోనే తమ ఖేదం తెలియజేస్తారు ఒక్క కన్నీటి చుక్కలతోనే ప్రణయ కలహం సూచిస్తారు. ఏడుపు, పెడ బొబ్బలు పెట్టరు ఇదే ఉత్తమ మహిళల మార్గం

55 హసిఅం అదిషుదంతం భమిఅమదిక్కంతదేహలీదేసమ్.
దిట్ఠ మణుక్ఖిత్తముహం ఏసో మగ్గోకులవహూణమ్ 6-25

(హసిత మదృష్టదంతం భ్రమితమనిష్క్రాంతదేహళీదేశమ్,
దృష్టమనుత్క్షిప్తముఖం ఏష మార్గః కులవధూనామ్)

మరొక అజ్ఞాతకవి కులస్త్రీల ప్రవర్తనను తాను మంచిదనుకొన్న రీతిలో తెలిపాడు కులస్త్రీలు పలువరుస కనిపించకుండా నవ్వుతారట. మందహాసం తప్ప ఇకిలించ డం, సకిలించడం ఉండదు. ఎంత తిరిగినా ఇంటి తల వాలికి గడపలోపలేనట. దేనిని చూచినా తల యెత్తి చూడ రట. ఇదే కులవధువుల మార్గం అన్నాడు కవి. (ఇప్పటి వారికి ఇవి నచ్చకపోవచ్చు. దానికి రెండువేల ఏళ్ళనాటి కవి బాధ్యుడు కాదు కదా!)

56. గేహం వ వి త్తరహిఅం ణిజ్ఝరకుహరం వ సలిలసుణ్ణవిఅమ్,
గోహరణరహిఅం గోట్ఠం వ తీఅ వఅణం తుహ విఓఏ
7–9

(గృహమివ విత్తరహితం నిర్ఝరకుహరమివ సలిల శూన్యమ్,
గోధనరహితం గోష్ఠమివ తస్యా వదనం తవ వియోగే)

ఇదివరకు వామదేవుడనే కవి విరహాన్ని వర్ణించాడు. మరొక అజ్ఞాతకవి ఒక ప్రేమార్త వియోగాన్ని తన గ్రామ పరిసరాల ఉదాహరణతో ఒక చెలికత్తెద్వారా చెబుతున్నాడు "ఓ ప్రేమికుడా, నీ ప్రియురాలు నీ వియోగంతో వాడి వత్తలయింది. ఆమె ముఖం ధనరహితమైన ఇంటిలాగ, నీరులేని సెలయేటి నల్లటి గాటివలె, పశువులేని కొట్టంవలె శూన్యంగా వుంది." ఇంటికి డబ్బు ప్రాణం వంటిది అలాగే సెలయేటిలో నీరు దూకుతూవుంటేనే అందం. పశువులేని కొట్టం ఎందుకు, వెలవెలబోతూ?

57 దీసంతో దిటిసుఓ చింతిజ్జంతో మణవల్లహో అత్తా,
ఉల్లావంతో సుఇసుహో పిఓ జణో ణిచ్చరమణిజ్జో 7–51

(దృశ్యమానో దృష్టిసుఖః చింత్యమానో మనోవల్లభః శ్వశ్రు
ఉల్లప్యమానః శ్రుతిసుఖః ప్రియోజనో దృష్టిరమణీయః)

ఇష్టమయినవారు ఏమిచేసినా మనకు హాయిగా వుంటుంది ఇది ఇష్టులయెడల జనానికి ఉన్న మనస్తత్వం. ఈ విషయాన్నే ఒక అజ్ఞాత కవి మనోరంగా ఒక వనితద్వారా చెబుతున్నాడు ఆ వనిత ఇలా అంటున్నది. "అత్తా చూడావా ఏమిటి ఆశ్చర్యం! ఇష్టమైన వ్యక్తి కనిపిస్తేనే కళ్ళు చల్లబడుతాయి మనసులో అతడు మెదిలాడాడో మన సంతా హాయిగా వుంటుంది ఇక మాట్లాడితా, వీనుల విందుగా వుంటుంది ఇలా ఇష్టమయిన వ్యక్తి నిత్య రమణీయుడు సుమా! ఏమిటో ఈ రహస్యం!" ఇది వారి మనసులో ఉన్న భావం. మనకు ఇష్టమయినవాడు అన్ని విధాల మనకు సమర్థుడుగా కనిపిస్తాడు.

58 జం జం ఆవిహఇమణో ఆసావట్టీహిః హిఅఅ ఫలఅమ్మి,
తం తం బాలో వ్వ విహీ ణిహుఅం హసిఊణ పంఛుసఇ
7–51

(యద్యదాలిఖతి మనః ఆశావర్తికాభిః హృదయఫలకే,
తత్తద్బాల ఇవ విధిః నిభృతం హసిత్వా ప్రోంఛతి)

ఏమేమో ఆలోచనలుచేసి ఏవేవో కోరుకుని, అవేవీ నెరవేరక నిరాశపడిన వ్యక్తి చెబుతున్న మాటలివి ఈ గాథ చెప్పినకవి ఎవరోగాని, విధిలీలలను బాలలీలలతో పోల్చాడు గొప్పగా మనస్సు ఆశ అనే బలపంతో హృదయఫలకంమీద పలకమీద ఏమేమో వ్రాసుకుంటుంది పెద్దలు పలకలమీద ఏదో ముఖ్యమని వ్రాసి పెట్టుకున్న దానిని పిల్లలు తమ చాపల్యం కొద్దీ తుడిచి వేసినట్టుగా-పూరికేకాదు, తనలో తాను గుంభనగా నవ్వుతూ తుడిచివేసినట్టుగా విధికూడ నవ్వు కుంటూ తుడిచి వేస్తుంటాడు. తానొకటి తలిస్తే దైవ మొకటి తలుస్తుందనేది ఇదే

59 జే జే గుణిణో జే జే అ చాఇణో జే విఅడ్ఢవిణ్ణాణా,
దారిద్ద రే విఅక్ఖణ తాణః తుమం సాణురా ఓసి. 7–71

(యే యే గుణినో యే యే చ త్యాగినో యే విదగ్ధ విజ్ఞానాః,
దారిద్ర్య రే విచక్షణ తేషాం త్వం సానురాగోఽసి)

ఎందుకో ఏమో గుణాలకు ధనానికి పొత్తు కలవడం లేదు, అనాదిగా. దారిద్ర్యం వాటిని వెదుక్కుంటూవస్తుంది ఈ విషయాన్ని ఎవరో అజ్ఞాతకవి భంగ్యంతరంగా చెప్పాడు దారిద్ర్యాన్ని సంబోధిస్తూ. "ఓ దారిద్ర్యమా, ఎవరుగుణ వంతులో, ఎవరు త్యాగులో, ఎవరు చతురులో, ఎవరు విశిష్ట జ్ఞానం కలవారో, వారిని నీవు ఎంతో అనురాగంతో చూస్తావు నీ విచక్షణజ్ఞానం ఏమనిచెప్పను!" అంటాడుకవి. అంటే లోకంలో గుణవంతులు, త్యాగబుద్ధి కలవారు, చతురులు, విజ్ఞానధనులు దరిద్రులుగా వుంటున్నారు ఏమివిధి అన్నమాట

30 అత్థక్కరూసణం ఖణపసిజ్జణం అలిఅవఅణబిబ్బంధో,
ఉమ్మచ్ఛరసంతావో పుత్తఅవఅవీ సిణేహస్య 7-75

(అకస్మాద్రోషకరణం క్షణప్రసాదో హ్యాళీక నిర్బంధః,
ఉన్మత్సరసంతాపః పుత్రక పదవీ స్నేహస్య)

ప్రేమగాని, స్నేహంగాని తెలియాలంటే మార్గాలు విచిత్రమైనవి. అవిసూటిగా ఉండవు. వంకరగా వుంటాయి. ఈ విషయంలో పండితుడొకడు ఒక నవయువకునికి ఇలా చెబుతున్నాడు "అబ్బాయ్ స్నేహమార్గం విచిత్రం అకస్మాత్తుగా కోపగించుకోడం, క్షణంలో సంతోషం ప్రకటించడం, మచ్చరంతో బాధపడడం-ఇవన్నీ స్నేహ సూచకాలు." స్నేహంగాని, ప్రేమగాని ఎక్కువయితే, ప్రేమపాత్రమైన వ్యక్తిపై ఎక్కడలేని స్వాతంత్ర్యం వస్తుంది ప్రేమించే వ్యక్తికి కనుక ఊరికినే రుసరుసలాడడం, అంతలోనే చల్లబడడం, మరికొంతలోనే బాధపడడం వంటి చిత్రవిచిత్ర చేష్టలు పుట్టుకు వస్తాయి. స్నేహాతిశయం అలా చేస్తుంది అందువల్లనే ప్రేమ పట్టిన వాడికి, దయ్యం పట్టినవాడికి, భేదం లేదన్నాడొక కవి. స్నేహప్రేమలకు ప్రభుత్వానికి కేనన్ని అధికారాలు అబ్బుతాయి.

31 ధణ్ణా బహిరా అంధా తే చ్చిఅ జీఅంతి మాణుసేలోఏ,
ణ సుణంతి పిసుణవఅణం ఖలాణఇ బుద్ధిం ణ పేక్ఖంతి 7-95

(ధన్యా బధిరా అంధాస్త ఏవ జీవంతిమానుషేలోకే,
న శృణ్వంతి పిశునవచనం ఖలానామృద్ధిం న ప్రేక్షంతే)

ఈ గాధ చెప్పిన అజ్ఞాత కవి ఈ ప్రపంచంలోని గుడ్డివారిని, చెవిటివారిని "మీరే ధన్యులయ్యా!" అని అభినందిస్తున్నాడు. ఈ మానవలోకంలో వసించే చెవిటివారు, గుడ్డివారు ధన్యులు. వారే ఈ మానవలోకంలో సుఖంగా మనగలుగుతున్నారు. ఎందుకంటే, చెవిటివారికేమో కొండెగాళ్ళ కొండేలు వినే దురవస్థ లేమ గుడ్డివారికేమో దుర్మార్గుల అభ్యుదయాన్ని చూసే దుర్భాగ్యంలేదు, ఈ ప్రపంచంలో దుష్టులే ఐశ్వర్యవంతులవుతున్నారు. అలాటివారిని చూడవలసి వస్తున్నది. దుర్మార్గులు మంచివారిపైన ఏవేవో లేనిపోనివి చెప్పి అందరికీ దురభిప్రాయాలు కలిగించి తమ పబ్బం గడుపుకొని పోతున్నారు అలాటివారి మాటలు వినవలసివస్తున్నది ఎందుకంటే, అలాటివారే అధికారంలో వుంటున్నారు! అలాటివారికే సంఘంలో పలుకుబడి మరి ఏం చేస్తాం, వినక తప్పదు.

గాధాసప్తశతి ఎంతో లోకవృత్తం తెలిసిన హాల సాతవాహనుడు గుచ్చిన అపూర్వ పుష్పమాల, మణిమాల, ముక్తాహారంకదా! ప్రపంచానుభవం వడపోసి తీర్చిన, గాధలు అసంఖ్యాకంగా వున్నాయి దీనిలో అనడం చర్విత చర్వణం వాటిని ఇక్కడ దిఙ్మాత్రంగా చూపాను.

## గాధాసప్తశతిలో మనస్తత్వ మాధుర్యం

గాధాసప్తశతిలో వివిధ మనస్తత్వాలు మనకు దర్శనమిస్తూ ముచ్చటగొలుపుతాయి. జానపద కవులు నిరంతరం గ్రామీణులను; వారి జీవితాలను పరిశీలించడంవల్ల వారి మనస్తత్వాన్ని గూడ బాగా చిత్రించగలిగారు. కర్షకుల మనస్తత్వం, జారిణుల మనస్తత్వం, విటుల మనస్తత్వం, కులస్త్రీల మనస్తత్వం- వీరేమిటి వారేమిటి, అందరి మనస్తత్వం చిత్రించారు కవులు, కవయిత్రులు.

సుఖమే ప్రధానమన్న వారి సంగతిచెప్పనక్కరలేదు. ప్రియురాలు అలిగింది. ప్రియుడు అనునయిస్తున్నాడు. రాత్రి నిరర్థకంగా గడచిపోతుందని అతని భయం కనుక 'ఋణంకృత్వా ఘృతంపిబేత్' తత్త్వంబోధించడం ప్రారంభించాడు

1. జివిఅం అస్సాసఅం విఅ ణ ణివత్తఇ జోవ్వణం అతిక్కంతమ్,
దిఅహా దిఅహేహిం సమా ణ హోంతి కిం ణిట్టురోలోఓ. 3-47

(జీవితమశాశ్వతమేవ న నివర్తతేయౌవనమతిక్రాంతమ్
దివసా దివసైస్సమా న భవంతి కిం నిష్ఠురో లోకః

"ప్రియురాలా! ఈ జీవితం శాశ్వతముగుండేది కాదు గడిచిపోయిన యౌవనం తిరిగిరాదు. ఒక దినం మరునటి దినంతో సమానంగా వుండదు. అలాంటప్పుడు జనం సుఖం అనుభవించడానికి ఎందుకు జంకుతుందో!" అని భార్యను అభిముఖిని చేసుకోడానికి ప్రయత్నిస్తాడు ప్రియుడు.

ఎంతో కష్టపడి సంపాదించిన వస్తువు అనుకూలంగా లేకపోతేనే ఎంతో కష్టం కలుగుతుంది. అలాంటప్పుడు కష్టంతో సంపాదించుకొన్న ప్రియుడు అనుకూలంగా లేనప్పుడు, తన మనసెరిగి ప్రవర్తించినప్పుడు ఎలా వుంటుంది మహిళల మనస్సు?

2 దుక్ఖేహిం లంభఇ పిఓ లద్ధో దుక్ఖేహిం హోఇ సాహీణో,
లద్ధో వి అలద్ధో వ్విఅ జఇ జహ హిఅఅం తహ ణ హోఇ 4-5

(దుఃఖై ర్లభ్యతే ప్రియో లబ్ధో దుఃఖై ర్భవతి స్వాధీనః
లబ్ధోప్యలబ్ధ ఏవ యది యథా హృదయం తథా న భవతి)

ఎంతో కష్టంతో ప్రియుణ్ని సంపాదిస్తాము. అతడు ఎంతో కష్టంమీద స్వాధీను డవుతాడు. కాని మన మనసు ఎరిగి ప్రవర్తించకపోతే ఆ ప్రియుడు లభించినా లభించనట్టే-అంటుంది ఒక విదగ్ధనాయిక. భర్తగాని, యజమానుడుగాని సులభంగా లభిస్తాడు. దయితుడు-ప్రియుడు ఎంతో శ్రమతోగాని లభించడు. అంతగా ఎంతో శ్రమతో సంపాదించుకొని ఆత్మీయుణ్ని చేసుకొన్న ప్రియుడు మనసెరిగి మెలగకపోతే ఎలా!

3. దృఢరోసకలుసి అస్స వి సుఅణస్స ముహాహిం విప్పిఅం కంతో?
రాహుముహమ్మి వి ససిణో కిరణా అమఅం విఅ ముఅంత 4-19

(దృఢరోషకలుషితస్యాపి సుజనస్య ముఖాదప్రియం కుతః?
రాహుముఖేపి శశినః కిరణాః అమృతమేవ ముంచంతి)

ఒక వ్యక్తి తన మిత్రుని విషయంలోనే పొరపాటు చేశాడు. అందువల్ల మిత్రుని చూడడానికే భయపడుతున్నాడు. అలాటి వాడి భయం పోగొట్టడానికి ఉత్తముని చరిత్రను ఉదాహరిస్తుంది ఒక దూతిక. సజ్జనుని మనస్సు ఎంత రోషకలుషితమయినా, అతని ముఖం నుంచి చెడుమాట వెలువడదు. రాహువు మింగుతున్నా చంద్రుడు అమృతమేకురిపిస్తాడు గదా! కనుక నీవేమీ భయపడవద్దు నీ మిత్రుడు ఉత్తముడు అని భయం పోగొడుతుంది దూతి. చంద్రుడు శత్రువు మింగుతున్నా అమృతం కురిపిస్తున్నట్టే నీ మిత్రుడుకూడ నీ అపరాధాన్ని సహకుచేయడు-అంటున్నది దూతి.

4. దిఅహం ఖుడక్కిఆఏ తీఏ కాఊణ గేహవావారమ్,
గరుఏ వి మణ్ణుదుక్ఖే భరిమో పాఅంతసుత్తస్స. 4-26

(దివసం రోషమూకాయా స్తస్యాః కృత్వా గేహవ్యాపారమ్,
గురుక్యేవి మన్యుదుఃఖే స్మరామః పాదాంతసుప్తస్య.)

భర్త ప్రవాసంలో వున్నాడు. ఊరిలోని భార్య చెయిదాలు జ్ఞాపకం వస్తున్నవి, ఒక్కొక్కటే. ఒక నాటి సంగతి ఇది. తనేదో అపరాధం చేశాడు. భార్యకు చాల కోపం వచ్చింది. కాని ఒక్కమాటకూడ పలుకలేదు. పగలెల్లా ఇంటి పనులు చేసింది నోరు విప్పకుండా. కోపం చల్లారలేదు. చీకటి పడింది. పనులన్నీ ముగిసిన పిదప పడక గదిలోకి వచ్చింది. ఇంకా కోపం చల్లారలేదు. తన పాదాల కడ ముడుచుకొని పడుకుంది. ఆ పడుకోడం జ్ఞాపకం వస్తున్నది-అంటాడు నాయకుడు. ఒక్కమాటా పలుకలేక కోపం ప్రకటించడం, చివరకు భర్తపాదాల వద్ద పడుకోడం ఇల్లాలి మనస్తత్త్వానికి నిదర్శనాలు.

5 వంకమలిలేణ చిరేక్క పాఇణా దిణ్ణజాణు వడణేణ,
అనందిజ్జఇ హలిఓ పుత్తేణ వ సాలిఛేత్తేణ. 6-67

(పంకమలినేన, క్షీరైకపాయినా దత్తాజానుపతనేన,
ఆనంద్యతే హాలికః పుత్రేణేవ శాలిక్షేత్రేణ)

కర్షకులు పంటలను పుత్రులతో సమానంగా చూసుకుంటారు. వారి పరిశ్రమ ఫలితంకదా మరి! కొడుకులను

పెంచినట్టే శ్రద్ధగా చూచుకుంటారు పొలాలనువారు. చేను ఎదుగుతున్నకొద్దీ పిల్లవాడు ఎదిగి వస్తున్నంతగా సంతోషిస్తారు. ఈ గాథలో కవిశ్లేషతో వరిచేనును దోగాడుతున్న పసిపాపడితో పోల్చాడు. వరిచేనికి పాలుపట్టింది. కాడలు బలపడి. కింద బురద. పాలుపట్టుగానే కంకులు కిందికి వంగడం మొదలవుతుంది. ఆ చేను ఎలా వుందంటే బురదలో దోగాడే పాలుతాగే పసిపాపడిలాగ వుందట. దానిని చూచి హలికుడు ఆనందిస్తున్నాడు.

శరత్కాలం కొత్త బియ్యప్పిండి ఆరబోసినట్టుగా వెన్నెల. వరిచేను పూటుగా పండింది. కర్షకుడు ఆనందం పట్టలేకపోయాడు. గొంతెత్తి ఝుమ్మని పాడేస్తున్నాడు.

ణిప్పణ్ణ సస్సరిద్ధీ సచ్ఛందం గాఇ పామరో సరఏ;
దలిఅ ణవసాలి తండుల ధవల మియంకాసు రాఈసు.
7-89

(నిష్పన్నసస్యబుద్ధిః స్వచ్ఛందం గాయతి పామరః శరది,
దలిత నవశాలితండుల ధవలమృగాంకాసు రాత్రిషు)

౯. మా వచ్చహ వీసంభం ఇమాణం బహుచాటుకమ్మణి ఉణాణమ్,
ణివ్వత్తిఅ కజ్జ పరమ్ముహాణం సుణఆణం వ ఖలాణమ్
7-86

(మా వ్రజత విస్రంభమేషాం బహుచాటుకర్మని పుణానామ్
నిర్వర్తిత కార్య పరాఙ్ముఖానాం శునకానా మివ ఖలానామ్)

దుర్మార్గుల మనస్తత్వం కుక్కల మనస్తత్వం ఒక్కటే నంటాడు ఈ గాథా రచయిత. దుర్మార్గులు ఏవేవో తియ్యని అల్లిబొల్లి మాటలు చెప్పడంలో నిపుణులు. అలా చెప్పి తమ పనులు చేసుకొని వెళ్ళిపోతాయి. మళ్ళీ కనిపించరు. కుక్కలు కూడ తమ పని అయ్యేవరకూ తోక ఆడిస్తూ చుట్టూ తిరుగుతాయి. ఏదో తిండి దొరకగానే వెళ్ళిపోతాయి. మళ్ళీ పనిబడితేగాని కనిపించవు.

గాథాసప్తశతిలో దాదాపు ప్రతి గాథా ఏదో మనో విశ్లేషణకు సంబంధించిదే గనుక జానపదకవుల పరిశీలన పాండితికీ ప్రబల ప్రమాణంగా వెలుగొందుతుంది.

# నీరాజనం

## సాంధ్యశ్రీ

పాట పాడుదునన్న తలపొక్కటేగాని
పాట తానెదనుండి బైట పడదు
భావమెదలోన బంగరు తీగసాగి
చేయితాకని వీణగ చిన్నవోయె....

ఏ గాలి కొనగోటి కొసతాకెనో ఇట
కదులుచున్నది కమ్మని బాణి యొకటి
మదివీడి కలనైన మాటగా రాదేమి
మూగవోయిన కంఠశోషగా భాషగా....

పూర్వజన్మ ప్రథా పూర్ణకలశ
దివ్యామృతచ్ఛాయ బంపి
ప్రాక్తనాభోగ పరితవ్య
భాగ్య మయ్యె ప్రేమ .

దివసాంత సాంద్రతమః పటలీ
కుటీర మొక దివ్యకాంతి నరయు
అర్కుడిందు రేఖాభ్యుదయము చేసె
పశ్చిమాంగణ వీధికి పరుగులిడుచు .

వెడద కన్నుల వెలిగెడి వెన్నెల
ఆగియాగి విరతినా తేలిశోపిల్లె
పులిన సీమల విఫలిత రాగాలు
గాలు లందున తేలెడిగానమందు...

పలుకు కిన్నెర వలపు లొలక బోసిన
జాలు; ప్రవహించి ఎదలోన ఝరిథవిల్లె
వలపు తూపులు కరసానవాడి చేసి
పెరిమంబు జతచేసి పెనవేసె . .

ప్రమోయించగా నైతి సీమహతి నెపుడు
రవళించు భావాల రాయంచ లెగుర
నాబాల లీలాకలాప క్రియా లీనమందు
ప్రమోగుచున్నవి రాగముల్ మోహమార...

భావాతిరేక సంజనిత ప్రేమవారాశిలో
రాయంచ మలయికల్ రాణకెక్కె
రాగాతిశయముచే రవళించుగానాని
పదము భావమువెంట పరుగుతీసె....

ఇంత వలపు తలపునెంతదనుక
మోసి మోసి మనసు వేగవలయు
ఆగామిజన్మలో ననుభవించుట యన్న
సంశయాకుల చిత్త వృత్తి శంకరేపు....

ఎవియోతలంపుల నారతమ్ము
వికచ నవ వసంత మల్లికాసూనమై
ఎదపొదలందున సురభిళశ్రీలనుంచె
గంధ మొక జన్మానుబంధమ్ముగాగ

మృదు మధురపుల మొక యొరవుగా
మై విరువుగా తానలముకొనియె
భావమొదవని రీతిని
బాహిరిల్లి....

ఈ రీతి వలపునెంత వరకు
భరియింతు.. ? తలపతనియుదాక
తలపుకాలీల ఏమికలదన్న
నవ్వుకొన్నది మనసు మోమాటపడుచు...

చిరుగాలి సైదోడు మనసులో చెలరేగి
కదులాడు భావాల కమ్మతెమ్మెరవీచె

తలపు కలదన్న సుంతలేదు—కాని
లేదనంగ వలపు నిదుర లేచు....

ఇంతకింత గాఢతరమూ ప్రేమలో
కొట్టు మిట్టాడుచుంటిని కుదురని ఎదు
తలపు కలదన్న సుంతలేదు-కాని
లేదనంగ వలపు తలుపుతీయు....

ఫల మొక్కటే కాదు; పృథివిలో వాదము
విరహ భరమందు పై విధ్య మొదవి
రుచులు సచరించి రూపభేదముచెందు
మనసు దరులొరసి ఈ ప్రేమసరసి....

పరిచయానుద్రిక్త ప్రాపంచికాపరిధి
వాయులీనవృత్తమై విస్తరిల్లె
విధురభావ రాగ విప్రలంభము నేడు
వీధి వీధుల మధుర యోగమయ్యె....

విరాళి వింత చింత నాగ్ని కీల
తమితీరని భావముల్ సమిధలవగ
యజ్ఞ ఫలముకొరకు ఎదురుచూచు....

పూవ ప్రాయాన పూవులపొంగులు దాచి
ఆత్మలో నద్వైత చింత లెగసె
మొదట వాసన లేని మొగ్గ మొగసాలు
రేకువిచ్చిన చోట రేకెత్తె గంధము

తా వకీన ప్రేమ భావాను రాగమ్ము
తప్తహృత్ సీమలో తృప్తి హిమపాతమవగ
దీవన పున్నమ రేయి తవిరుచున్నది హాయి
తావి గాలులు పెనగొన్న చోచూలెపేవలో....

వింత సృష్టినేమొగాని భావ వనధి
యందనురాగ కెరటముల్ కెరలుచు
జఘనసీమకు కట్టిన జవరాలి
కటి సూత్రమై తోచె....

మనసునందరలేని కూరిమిసెలంగ
చెలియొసంగిన విరుల సరమ్మును దాల్చితి
ప్రేమరూపమిది యనంగ యౌనో,
కాదో-తెలియదునాటి వరకు. ..

చెలియచిరునగవు చంద్రాతీపముగాగ
జలక మాడగనెంచిన జలజమూదు
సఖియహృదయాన తొలికారుకాలమైన
జలక మొలికించ నెంచిన జలజమూదు....

ఎలదేటిపాటలో వలనంత పచరించి
వలపుకెరటాల వెల్లువల్ తేల్చి తేల్చి
ఊగి ఊయలలూగించి తూలిపడు
కమ్మతెమ్మెర కౌగిలిన్ కరిగిపోతి....

అంతకంతకు గాఢతర మౌయాహ
యొక్కటి విహాయసమ్మునంటియున్న
చుక్కల గుంపులోన చిక్కు వడియె
వీతార రాలునో కడకు నీమోల....

కురంగ లోచన లోచనే స్ఫూర్తద్రస
వీక్షణా కైవల్య పథముదాటని
సంధా నైక వైవశ్యముల్ గని
తలపోతు రేమొ నన్నొక వెర్రిగ....

ప్రేమ పూరితమైన నాఎద ప్రమిద
చెలిమివత్తి తలపుచమురీవడిపి
ఎంత యత్నించి నాలోన వెలిగించి చూడ
నీదు రాగ మొకండెతోచు నెల్లెడల....

మలయచందన మైత్రీ కషాయ
మాధురుక మోహన మార్మురించి
సౌంధ్యశీతల పవకరాంగుళీచ్ఛాయ
చిత్తాన నీతలపు బలాకరించ....

లలిత శృంగార రస వితర్దిపైన
రమ్యవిలాస హావాకమతిశయిల్ల
నీరూపలావణ్య నిస్తులతేజమునకు
నీ రాజనమ్మిచ్చె అస్మదీయభావప్రమద....



తప్పక చూడండి!
శ్రీ ఉమయాంబికై కంబైన్స్
పింజల నాగేశ్వరరావు సమర్పించు
తల్లీకొడుకుల
అనుబంధం
కలర్
దర్శకత్వం కె.యస్.ఆర్.దాసు
నిర్మాత: R.M.సుబ్రమణియన్
లక్ష్మీఫిలింస్
సీడెడ్: నవయుగపిక్చర్స్. నెల్లూరు: కళ్యాణిఫిలింస్. కర్నాటక: ఉమాశంకర్‌పిక్చర్స్. బెంగుళూరు.
LAKSHMI PUBS.

శ్రీ ఏ. శ్రీరామచంద్ర

# వర్షము

1. నిశా తమసం నడుమనిదిరిస్తున్న ప్రపంచంలో కనులు విచ్చి అవలోకించిన స్వతంత్రభారతదేశం తన మూడున్నర దశాబ్దాల పయనాన్ని వెనుదిరిగి చూచుకుంటే ఏ ప్రశ్నలు మోసులెత్తుతాయి? పయనించినమార్గం, వేగం, సహపథికులు విరామసమయాలు, ప్రయాణసాధనాలు తగినవేనా? తదితరమైనవాటికి అవకాశం వున్నదా? వుంటే, అవి ఎందుకు వుపయుక్తంకాలేదు? భవిష్యంలో సరిదిద్దుకునే అవకాశంవున్నదా? తన సమస్యలను అవలోకించిన తీరు, అవలంబించిన వైఖరి సరైనవేనా? ఇవి సాధారణప్రశ్నలుకావు, తాత్వికచింతనతో కాలయాపనకూ అవకాశంలేదు. తిండీ నిద్రలే బ్రతుక్కి పరమావధిఅనుకునే తామస ప్రవృత్తి ప్రకోపించనక్కరలేదు, కడుపుకాల్చుకుని కళ్ళెదుట వికృత తారతమ్యాలను చూచి చిరునవ్వు నవ్వుకునే పరమసాత్విక ప్రవృత్తీ అక్కరలేదు. అయితే ఆముష్మికసాధనకు, అలౌకికానందస్థాయికి ప్రస్తుతం వ్యావహారికంగా కొలమానం లేదుగనుక ఆర్థికవ్యవస్థదృష్ట్యా, కొంతవరకు సామాజిక స్థితిగతులననుసరించి ఈ ప్రశ్నలను పరిశీలించి చూద్దాం. అభ్యుదయానికి దోహదం చేసే ఆర్థికేతరవిషయాలు కొంతవరకు స్థూలప్రగతి మీద, వైయక్తికఆదాయవిభజనమీద, కొంతసామాజికశక్తులపరస్పరసమన్వయం మీద ఆధారపడి వుంటాయి అనేది తర్కానికి అతీతమైన సంగతి కాదు.

2. ప్రణాళికావ్యవస్థ వున్నదేశాలు లేనివీ కూడా వున్నాయి. అన్నీ కొద్దోగొప్పో ప్రగతి పొందుతునే వున్నాయి. మరి భేదమేమిటి? సాధనసంపత్తిని సమీకరించి పూర్వనిర్ధారిత లక్ష్యాలను సిద్ధింపజెయ్యడానికి నియత వ్యవధిలో చేసే ప్రయత్నం ప్రణాళికావిధానం. బాహిరదృష్టికి ప్రణాళికాయంత్రాంగం లేకున్నా అంతర్భూతంగా కొన్ని లక్ష్యాలకు అనుగుణంగానూ, కొన్ని నియమనిబంధనల కింద లోబడి పని చెయ్యక తప్పదు ఏ ఆర్థికవ్యవస్థకైనా. ఆర్థిక వ్యవస్థ యొక్క అంతిమ నియంత్రణాశక్తి ప్రభుత్వపరమై వుండటం ఆధునిక రాజ్యస్వభావం. ప్రపంచవ్యవస్థ పరిణమిస్తున్నతీరు, ఆర్థికవ్యవస్థల వైరుధ్యానికి అతీతంగా ఒక్క సారూప్యతను నెలకొల్పుతున్నది. పశ్చిమఖండదేశాలు, ప్రాచ్యవ్యవస్థలు, సోవియట్‌వర్గప్రణాళికాబద్ధవ్యవస్థలు, మిశ్రమఆర్థికవ్యవస్థలు-అన్నిటిపట్లా యిదిసత్యం. అయితే, సాధారణ పరిస్థితులలో అవిపని చేస్తున్నతీరులో వున్న విభేదాలను పురస్కరించుకుని ఒకవిషయం చెప్పకతప్పదు వలసపెత్తందారీ విధానంనుంచి విముక్తిపొంది సాంప్రదాయికంగా సిద్ధించిన ఆర్థికవ్యవస్థను ఆధునిక మార్గాన పునర్నిర్మాణంగావించుకోవాలంటే వెనుకబడినదేశాలకు ప్రణాళికాబద్ధ విధానం తప్ప అన్యమార్గంలేదు. పెరుగుతున్న జనసంఖ్య, అవసరాలను, అంతర్జాతీయ ఆంతరంగిక శక్తులవలన ఆర్థిక రంగంలో కలిగేవైపరీత్యాలను దృష్టిలో వుంచుకుంటే ఆర్థిక వ్యవస్థలను ప్రణాళికామార్గంలో నియంత్రితంచేయడంతప్పనిసరి అని తోస్తుంది.

3. 1951 లో ప్రణాళికా కార్యక్రమాలు ప్రారంభించే నాటికి స్థితిగతులు ఎలావున్నాయి? మూడుదశాబ్దాల కృషి అనంతరం ఎటువంటి మార్పుచూడగలుగుతున్నాం? వీటిని అనుసరించి, మనం ఎక్కడ పొరపాట్లు చెయ్యవలసి వచ్చింది, ఎందువలన, ఏవిధంగా సవరించుకోవాలి అనే ప్రశ్నలకు సమాధానం నిర్ణయించవచ్చు. అసలుప్రణాళికా వ్యవస్థనే ఎత్తివేస్తే సరిపోతుంది అనేవాళ్ళు వుండవచ్చు, మొత్తంమీద ఫర్వాలేదు అనేవాళ్ళు వుండవచ్చు, మధ్యేమార్గంగా సవరణలతో సరిపుచ్చేవారు వుండవచ్చు. సాంకేతిక పరిజ్ఞానం, ప్రభుత్వలక్ష్యాలు, ప్రజాభాగస్వామ్యం యొక్క స్థాయి మొదలైన అంశాలలో తేడాలవలన ఆంగ్లేయప్రభుత్వకాలానికి, స్వాతంత్ర్యానంతరస్థితికినడుమ ఎంతో మార్పు గోచరిస్తుంది. దేశవిభజన వలన ఆర్థికవ్యవస్థలోనే తీవ్రమైన మార్పువచ్చింది తన్మూలంగా ఏర్పడిన క్షోభను, వైపరీత్యాలను సరిదిద్దుకోడానికి బృహత్ప్రయత్నం చెయ్యవలసి వచ్చింది. స్వాతంత్ర్యం అనే చారిత్రక ఘట్టం చేరుకోడంతోమనం ఆర్థికవిధానాలలోని మార్పులుదేశవిభజన వలన ఏర్పడిన ఆర్థికపరమైన తదితరమైన ఉపద్రవాలను నివా

రించడంకోసం మరొకరకమైన మార్పుకులోనయ్యాయి. కొంతవరకు యీ రెండు ప్రభావాలు (స్వాతంత్ర్యం,విభజన) ఏకదిశాభిముఖంగానే సాగిపోయాయి తర్వాత కొంత వైరుధ్యానికి ప్రోవతీశాయి కొంత, దీర్ఘకాలికమైన వైకల్పిక ప్రగతిపథాన్ని నిర్దేశించాయి ముప్పదిసంవత్సరాల ఎగుడుదిగుళ్ళు, ఆర్థిక అసమానతలు, భవిష్యన్మార్గాలను పరిశీలిస్తున్నప్పుడు ఆరంభదశలోనికొన్ని అనివార్యపై పరిత్యాలను దృష్టిలో వుంచుకోవడం తప్పనిసరి అవుతుంది అందుచేత, స్వతంత్ర ప్రజాస్వామిక ప్రణాళికాబద్ధవ్యవస్థ, దేశవిభజన వలన ఏర్పడిన ఉపద్రవ అత్యవసరస్థితిగతుల నెదుర్కొనడానికి ఎలాంటి ఒత్తిడులకు గురయింది, అందుకోసం తీసుకున్న చర్యలు ఎటువంటి దీర్ఘకాలికప్రభావాన్ని చూపెట్టాయి, నేటి ఆర్థికవిపత్కరపరిస్థితికి అవి ఏవన్నా కారణం అని నుకోవలసి వస్తుందా? ఈ ప్రశ్నలను నేటి ఆర్థికశాస్త్ర విద్యార్థి ఎదుర్కొనకతప్పదు.

4 ప్రణాళికాలక్ష్యాలు ఏవిధంగా నిర్ధారితమవుతాయి? ప్రజలఅవసరాలను,మనోభావాలను అవిప్రతిబింబిస్తున్నవా? ఇలాంటి ప్రశ్నలు చిరకాలంనుంచి ఆలోచనాప్రేరకాలుగా వుంటూవచ్చాయి సరైనసమాధానం యింతవరకూ దొరికిందని గానీ అది నిలకడ సమాధానం అని గానీ చెప్పడం కష్టం అయితే,స్థూలంగాప్రణాళికాలక్ష్యాలను యథాతథంగా అంగీకరించి వాటిని సాధించడంలో మనం విఫలురం కావడానికి కారణాలు వెతుక్కుంటేకొంత ఉపయోగకరమైనప్రయత్నం అవుతుంది కొంత ప్రణాళికారచనలో సాంకేతికమైనపరిజ్ఞానం యొక్క లోటుపాట్లవలన,కొంత వ్యవస్థలోని అనివార్యమైన ఒత్తిడులవలన, మరికొంత ప్రముఖంగా పరిగణనలోకి తీసుకొనవలసిన అంశాలను విస్మరించడంవలన యీ వైఫల్యాల పునః పునః అనుభవంలోకి వస్తున్నాయి అటువంటికొన్ని ముఖ్యాంశాలను గురించి పరామర్శ యీ రచన

5 మనం చేరుకున్న స్థితి ఏమిటో వివరంగా పరిశీలించి స్వభావనిర్ణయంచేసే వరకూ అందుకు కారణభూతము విస్మృతము అయిన అంశాలప్రస్తావనకుతూహలజనకమైన నేపథ్యంలోనేవుంచడం ఏవేం ప్రతిప్రణాళిక అనేక వేలకోట్ల రూపాయలచొప్పున ఖర్చు చేసుకొంటూ అయిదుప్రణాళికలు చిల్లర,మూడుసంవత్సరాలు ప్రణాళికలులేనిసమయందాటుకుని ఆరవప్రణాళికలో రెండుసంవత్సరాలు భుక్తం చేసుకుంది మనఆర్థికవ్యవస్థ సుమారు రు 2800 కోట్లు ఖర్చుతో మొదటి

ప్రణాళిక (1951-52 నుంచి 1956-57వరకు) అమలు జరిగింది. ఇప్పటి ఆరవప్రణాళిక (1980-81 నుంచీ 1985-86 వరకూ) లో తలపెట్టిన ఖర్చు రు. 1,72,000 కోట్లరూపాయలు ప్రతిప్రణాళికలోనూ పూర్వప్రణాళికకు రెట్టింపు ఖర్చులో కొనసాగింది వ్యవహారం.

6. 1951-57 ఆర్థికప్రణాళికలో కన్న నేడు 60 రెట్లు ఎక్కువడబ్బు ప్రణాళికా వినిమయం క్రింద కేటాయించాం. అయితే జాతీయాదాయంలో పెరుగుదల రేటు, రెండవ ప్రణాళికాసమయంలో ఎలావున్నదో (మొదటిప్రణాళికలో తలపెట్టినప్రగతిరేటు 3 శాతం మాత్రమే, నేడు కూడాఅలాగే వున్నది. మరెందుకిన్ని రూపాయలు? జనసంఖ్య పెరిగిందని తెలుసుకుంటున్నాం, అనుకుంటున్నాం. 36కోట్లమంది నుంచీ 68కోట్లకు పెరిగింది. నూరుశాతం కన్న కొంచెంతక్కువ. తలఒక్కింటికి, ప్రణాళికాఖర్చు మొత్తాన్ని ప్రజలకువంచిపెట్టే, మొదటిప్రణాళికలోసాలుకు 16 రూపాయల సుమారు వచ్చేది ప్రస్తుతం ఆరవప్రణాళికలో మొత్తం పంచిపెట్టే ప్రతిమనిషికి సగటున సాలుకు 500 రూపాయలమొత్తం లభ్యమవుతుంది. సగటు తెలివిగల మనిషి అనుకుంటాడు, ప్రణాళికాకార్యక్రమాల క్రింద ఖర్చుబెట్టే బదులు తలకి రు. 500 చొప్పున జనాభా లెక్కల సేకరణ ప్రకారం జనానికివంచి పెట్టేస్తే బతుకులు బాగుపడిపోనుగదా అని. ఆ విధంగా వంచిపెట్టడానికి ప్రణాళికకూతేడాలేకకాదు. కానీ ఆ విధంగా అనుకోవలసి వచ్చేస్థితికి తెచ్చింది ప్రణాళికావ్యవస్థ అని విజ్ఞులు విచారిస్తున్నారు.

7. ఇక్కడ యింకొక చిన్న తిరకాసు వున్నది. 1951లో రూపాయబిళ్ళకూ 1982లో రూపాయబిళ్ళకూ అంతరంలేదనుకుంటే విడ్డూరమైనమనిషే. బిళ్ళలోసరుకూ, విలువా అటుంచి దాంతో కొనుక్కునే వస్తువుల పరిమాణం ఎంత తగ్గిందో ధరలు ఎంతగా పెరిగినయ్యో ప్రతిమనిషికీ అనుభవంలోని విషయమే. అందుచేత రూపాయికి కొనుక్కోగలిగిన వస్తువుల మొత్తం లెక్కనచూస్తే 16 రూపాయలకు 500 రూపాయలకు ఎంత తేడా వుంటుందంటారు. టోకుధరల సూచిక 92 యూనిట్లనుంచీ 336యూనిట్లకు పెరిగింది యీ మధ్యకాలంలో అంటే ఒకరూపాయివిలువ 1/3 5 రూపాయలకు (30 పైసలు) పడిపోయింది. ఈ లెక్కన చూదాం. 1980-81లోని 500 రూపాయలు, 1951-52 లోని 150 రూపాయలకుసమానం. ధరల గణాంకాలమదింపు మొదలైన విషయాలలో పొరపొచ్చాలుండకతప్పదు అవన్నీ లెక్కతీసుకు చూసినాగూడా, తలఒక్కింటికి అప్పటి ధరలను ఒట్టి సుమారు 8 రెట్లు ప్రణాళికపేరుతో ఖర్చు చేసుకుంటున్నాం. ఫలం ఎక్కడికి పోతున్నది? సగటున తల ఒక్కింటి జాతీయాదాయం పెరుగుదల దాదాపు అట్లానే వున్నది. సాలుకు ఒకటిన్నర శాతం మించి పెరగడం లేదు ఎందువలన?

8. ధర పెరిగితేనేమండీ! మన వస్తువులకు ఎక్కువ ముడుతుందిగదా! మరింత మదుపుపెట్టి వుత్పత్తి పెంచడానికి ఆకర్షణీయంగా వుంటుంది. అని ఆర్థికశాస్త్రంలో ప్రథమ పాఠాలు చదివేవిద్యార్థికూడ వల్లెవేస్తున్నాడు ఒప్పుకున్నాం కానీ వుత్పత్తి పెరుగుతున్నదా? ప్రభుత్వ గణాంకశాఖవారి ఉత్పత్తుల అంచనాలను నమ్మడానికి వీలున్నదా! ఆహారపదార్థాలవుత్పత్తుల అంచనాలలో గణాంకనిపుణులు అనుసరిస్తున్న విధానాలు లోపభూయిష్ఠమైనవన్న విషయం యిప్పుడిప్పుడే ప్రస్తావనకు వస్తున్నది. అసలు ధరలే ప్రగతికి సూచిక అనేవాదం కూడా లేకపోలేదు తక్కువ కష్టంతో తగిన ఆదాయం సమకూర్చుకోడానికి ధరలు పెరగడం అవసరం. ధరలు పెరిగినంత మాత్రాన వుత్పత్తి పెరగనక్కరలేదు అయినా ధరలపెరుగుదలను లెక్కలోకి తీసుకున్నా కూడా తలకు 8 రెట్లు ఎక్కువఖర్చుచేస్తున్నప్పుడు జాతీయ ఆదాయం పెరుగుదల అంతే ఎందుకున్నది?

9. ఒక్కొక్క రూపాయి విలువగల వస్తువులను వుత్పత్తి చెయ్యడానికి ప్రస్తుతం ఎక్కువఖర్చుపెట్టవలసి వస్తుంది. అసలువిషయంఅది. మొత్తం జాతీయాదాయందృష్ట్యా చెబుతున్న విషయంయిది. ఎందువలనఆవిధంగా చెయ్యవలసివస్తున్నది? దీనికి రెండు కారణాలున్నాయి. ఒకరూపాయివిలువగల విద్యుచ్ఛక్తి వుత్పత్తికి, అదేవిలువగల గోధుమలు లేక బియ్యం వుత్పత్తికయ్యేఖర్చుకన్న ఎక్కువ ఖర్చుపెట్టవలసి వస్తుంది కనుక విద్యుదుత్పత్తికి కావలసిన పెట్టుబడిఖర్చు అదే విలువగల ఆహారధాన్యాల వుత్పత్తి కయ్యే ఖర్చు కన్న ఎక్కువుంటుంది. కాబట్టి, విద్యుదుత్పత్తికి ప్రాధాన్యమిస్తే ఎక్కువ ఖర్చుతో కొద్దిమాత్రపు పెరుగుదల మాత్రమే గోచరిస్తుంది. ఈ విధంగా ఎక్కువ వుత్పత్తి ఖర్చుతో

# మీకై మీరు స్వయంగా పని చేయగల్గిన శక్తి ఉన్నపుడు ఇతరుల వద్ద పనిచేయడమెందుకు



"నేను పట్టభద్రుడను, కాని ఉద్యోగం దొరుకుతుందని ఆశలేని వాడ్ని"



"నేను స్వయం ఉపాధిగల సాంకేతిక నిపుణుడను.

మీరు పట్టభద్రులై లేక సాంకేతికంగా మంచి అర్హతలు కలిగినవారై. తక్షణ ఉద్యోగావకాశాలు లేనివారై ఉండవచ్చు లేక మీరు సాంకేతిక పరమైన ఉద్యోగం చేస్తూ, నిరాశ. నిస్పృహలతో దానిని వదలివేద్దామనే ఉద్దేశ్యం మీకు ఉండవచ్చు. ఈ రోజుల్లో ఉద్యోగావకాశాలు చాల తక్కువ. ఒకవేళ మీరు ఉద్యోగస్థులైనా, దానివలన తరచు పూర్తి ఉద్యోగ సంతృప్తి పొందలేక పోవచ్చు

లభించిన అవకాశమును సద్వినియోగ పరచుకొని. పారిశ్రామిక వ్యవస్థాపకునిగా సగర్వంగా స్థిరపడగలిగే వారికొరకే స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ ఎదురు చూస్తున్నది

భారత దేశము చాల త్వరగా అభివృద్ధి చెందుచున్నది దేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధి చేయుటలో మీరుకూడ ప్రముఖపాత్ర వహించవచ్చు. ఆర్థిక సహాయం, ఉత్పత్తిదారులనుండి పోటీ, మరియు మార్కెటింగ్ సమస్యలతో మీరు నిరుత్సాహపడవద్దు. మీరు ఉత్సాహవంతులై లేక ఆర్థికంగా స్వయంభరణ శక్తిగల (viable) పథకము కలిగిఉంటే మిమ్ములను ఒక పారిశ్రామిక వ్యవస్థాపకునిగా తయారు చేయుటలో స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ శక్తివంచన లేకుండా కృషిచేస్తుంది. పరిశ్రమల స్థాపనకు సహాయపడే అనేక పారిశ్రామికాభివృద్ధి సంస్థలతో మీకు సంబంధాలను కల్పిస్తుంది. ముఖ్యంగా గమనించవలసిన విషయము. మీది స్వయంభరణ శక్తిగల పథకము అయితే బ్యాంకు ఆర్థిక సహాయముచేసి మీకు అండగా నిలబడుతుంది. ఇతర వివరములకొరకు మీ దగ్గరలోనున్న స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ శాఖయొక్క నిర్వహణాధికారిని సంప్రదించండి.

బ్యాంకు సహాయ సహకారాలతో మీరు మీ స్వంత గ్రామములో లేక పట్టణములో పారిశ్రామిక వ్యవస్థాపకునిగా సగర్వంగా నిలిచి. స్వయంగా అభివృద్ధి సాధిస్తూ, దేశాభివృద్ధికి కూడ తోడ్పడిన వారవుతారు. అందువలన బ్యాంకుకు వచ్చి మీ పథకాలను గురించి చర్చించండి. మీకు సహాయ సహకారాలందించుటకు బ్యాంకు సిద్ధముగా నున్నదని గుర్తించుకొనండి.

## స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్,

ప్రధాన కార్యాలయము, గన్‌ఫౌండ్రి, హైదరాబాద్–500 177.

స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ సహాయ సహకారాలతో మీ స్వస్థలంలోనే ఒక పథకాన్ని ప్రారంభించండి.

కూడుకున్న వస్తువులకు ప్రణాళికల కేటాయింపులలో ఎక్కువ ప్రాధాన్యమిస్తే సహజంగా పెరుగుదలరేటు ఎక్కువవుండదు. ఇది మొదటి కారణం. ఒకే వస్తువు యొక్క అదే మొత్తాన్ని వుత్పత్తి చెయ్యడానికయ్యే ఖర్చుకూడా ఎంతో పెరిగింది. ఈ పెరగడం ధరల పెరుగుదలవలన మాత్రమేకాదు; వుత్పాదన విధానాలలో ఎక్కువ ఖర్చుతోగూడిన విధానాలను అవలంబించడం వలనకూడా యిలా జరుగుతున్నదన్న విషయం ప్రస్ఫుటం. కాలువలో నీరు ఏతాయేసి విత్తులుజల్లి పిల్లాపాపా కలిసి నూర్పిడిచేసి ఎద్దుబండిలో యింటికి ధాన్యం మళ్ళించే రోజులు పోయినయ్యనో పోవాలనో అంటున్నారు. ఆయిలింజనో, ట్యూబువెల్లో వుండాల, విత్తుల్లో బాటు. ఎరువులు, కీటక సంహారులు, తొందరగా పంటనిచ్చేవి నేవళంగా రంగు దిద్దేవి, రకరకాల మందురసాయనాలుండాలి. పిల్లలు పొలంలో దిగకుండా చదువుకుని వుద్యోగాలు చేసుకుంటుండాలి గనక బజారుకూలిబెట్టి వాళ్ళమీద తనిఖీని సూపరువైజర్లనుపెట్టి అవిచేసే రంధ్రాలు పూడ్చడానికి యింకొకరకమైన అజమాయిషీ ఏర్పాట్లు చేసుకోవాలి. ట్రాక్టరులోనో ట్రక్కులోనో పంటయింటికి కాకుండా గోదాముకు, మధ్య దళారికీ,మిల్లుకూ,మార్కెట్‌కూ, వీలయితే యితరదేశాలకు వెళ్ళిపోవాలి. చివరకు వస్తువు తినేవాడు సహజంగా ఎక్కువచెల్లించాలి. వస్తువు అదేఅయినా ఎక్కువ విలువగల వస్తువు తింటున్నాడని అనుకోవాలి. అక్కడికి ఫర్వాలేదు. అదే ప్రగతిలే, ఎక్కువ మాత్రంఎందుకు, ఎక్కువ వస్తువులెందుకు అనుకుంటే కొంచెం ఆలోచించ వలసి వస్తుంది? కనుక ఒకే విలువ, ఉపయోగము వస్తువును ఆధునిక విధానాల ద్వారా వుత్పత్తి చెయ్యడం వలన, అత్యధికంగా పెట్టుబడి సాధనాలు సమకూర్చుకున్నప్పటికీ, వుత్పత్తి మాత్రం అంతగా పెరగడంలేదు. ఇది రెండవ కారణం.

10. మొదటి కారణం చూదాం. 1951–56లో వ్యవసాయరంగానికి. ముఖ్యంగా ఆహారధాన్యాల వుత్పత్తికి ఎక్కువ ప్రాధాన్య మిచ్చాం. భాక్రానంగల్ ప్రాజెక్టు త్వరలో పూర్తి చేసుకున్నాం. లోపాలు భర్తీ చేసుకున్నాం. అన్నీ అనుకూలించి పంటలు పండినై, మొత్తంజాతీయాదాయపు పెరుగుదలరేటు నిర్దేశించినరేటుకంటె ఎక్కువగానే తేలింది. నెమ్మదినెమ్మదిగా యితర అంశాలవైపు చూపు మళ్ళించాం. ఉక్కు, బొగ్గు, విద్యుచ్ఛక్తి, రసాయనాలు, రవాణా, సాధనాలు, వైజ్ఞానిక పరిశోధన – వీటికి ప్రాధాన్యమిచ్చాం. సహజంగా వీటికి ఎక్కువ కేటాయింపులు చెయ్యబడుతున్నవి. అంటే యింకొక రకమైన వస్తువులు ఎక్కువ మాత్రంలోవుత్పత్తి అవుతున్నయనుకోవాలి. మంచిదే. జీవన స్థాయి పెరుగుదలకు ఒక సూచిక ఎక్కువ రకం వస్తువుల ఉత్పత్తి వినియోగమూ, ఎలక్ట్రానిక్‌యంత్రాలు, గృహోపకరణాలు, మోటారువాహనాలు, తప్పనిసరి అవుతున్నట్లనిపిస్తున్నది. విద్యుదీకృత ప్రాంతాలు విస్తరిస్తున్నాయి, సాంకేతిక విజ్ఞానం ప్రాచుర్యంలోకి వస్తున్న . అయితే ప్రాథమికావసరాలు తగిన పాళంలో తీరుతున్నాయా? తెలుసుకుంటే మంచిది. 1951–1980 మధ్యకాలంలో తలసరి సగటు జాతీయాదాయం (స్థిరమైన ధరలలెక్కన) 65 శాతం పెరిగింది. తల ఒక్కంటికి స్థిరమైన ధరల లెక్కన పెట్టుబడిని సాలుకు 16 నుంచీ 150 రూపాయలకు పెంచితే తలకు ఆదాయం 436 రూపాయల నుంచి 712 రూపాయలకు పెరిగింది (1970–71 ధరలలో). నిజానికి 1979–80లో తలసరి జాతీయాదాయం 6.8 శాతం అంతకు పూర్వపు సంవత్సరం కన్న తగ్గిపోయింది. ఇదేమంత చెప్పుకోదగ్గ ప్రగతి కాదు. ప్రణాళికారంభంలో, – అంటే 1950–51లో, జాతీయాదాయంలో 13.7శాతం ఖర్చుచెయ్యకుండాపొదుపుచేసేవాళ్ళం ప్రస్తుతం 24 శాతం పొదుపుచేస్తున్నాం వర్తమాన వినియోగాన్ని తగ్గించుకుని ఎక్కువభాగం పొదుపు చేస్తున్నామంటే భవిష్యంలో మంచిరోజుకోసం ఎక్కువ శ్రమ పడుతున్నామని అర్థం. అయితే నెలకు నూరు రూపాయలు ఆదాయం కలవాడు 24 రూపాయలు పొదుపు చెయ్యటంలోనూ, పదివేల రూపాయలు ఆదాయం కలవాడు 2400 రూపాయలు పొదుపు చెయ్యడంలోనూ వున్న కష్టం ఒకటే అనే ఆర్థిక విజ్ఞాని ఎవడూ వుండడు. అయితే వినియోగపు పరిస్థితి ఎలా వున్నది?

11. కాయధాన్యాలు 1951లో తలకు రోజుకు 360గ్రాములు లభిస్తుంటే 1979 లో 434 గ్రాములుమాత్రంలభిస్తున్నాయి.

రోజుకు 74 గ్రాములు 23 సంవత్సరాల ప్రగతి తర్వాత చెప్పుకోదగ్గ విషయమే అనుకుందాం మొత్తానికి. పప్పు ధాన్యాల వసతి చూడండి. 1953లో తలకు రోజుకు 70.4 గ్రాములుంటే 1979లో 41.8 గ్రాములకు తగ్గింది. మొత్తం కలుపుకు చూచుకుంటే, పోషక పదార్థాలదృష్ట్యా మరిచి పోయినా, ఎంత ప్రగతి తెలుస్తుంది. రోజుకు మనిషికి 47 గ్రాముల పెరుగుదల. వంటనూనెలు సాలుకు సగటున తల ఒక్కంటికి 1955-56లో 2.5 కిలోగ్రాములుంటే 1978-79లో 4.0 కిలోలకు పెరిగింది. పంచదార అదేలెక్కన 5.0 కిలోల నుంచీ 9.7 కిలోలకు పెరిగింది నూలుగుడ్డ వుత్పత్తిసాలుకు తల ఒక్కంటి నిమిత్తం 14.4 మీటర్లనుంచీ 12.3మీటర్లకు తగ్గిపోయింది. టీ 25 గ్రాములనుంచీ 198 గ్రాములకు పెరిగింది కాఫీ 67 గ్రాములనుంచీ 73 గ్రాములకు పెరిగింది.

పాదరక్షణకు పలసిన చర్మవస్తువుల వుత్పత్తి సూచిక ననుసరించి, 1971లో 99 నుంచీ 1979లో 76స్థాయికి పడిపోయింది. యంత్రసామగ్రి, అల్యూమినియం, ఉక్కు వంటి లోహాలు, యాంత్రికవాహనాలు, ఎలక్ట్రిక్ వస్తువులు, రసాయనాల వుత్పత్తి పెరిగింది. విచిత్రమైన విషయమే మిటంటే భూమి ఆపురావురని ఎరువులు, మందులు మింగే స్తుంటే మనిషి కడుపుకు దొరికే తిండి ఎక్కువగా పెరగడం లేదు 1955-56 లో పొటాషియం, నైట్రోజన్, ఫాస్ఫరస్ ఎరువులు అన్నీ కలుపుకుని 1 లక్ష 55వేల టన్నులు వాడు కుంటే 1978-79లో సుమారు 5000 టన్నులు (అంటే 50 లక్షల టన్నులు) వాడుకున్నాం. ఇది తప్పకుండా ఆలో చించవలసిన విషయం. ఆర్థిక కార్యక్రమాలలో ఒకతార్కిక క్రమం, నిశ్చితత్వం, ప్రజాబాహుళ్యపుదీర్ఘకాలిక సంక్షేమం కోరేవారందరూ తప్పనిసరిగా ఆలోచించవలసిన విషయం. ఆర్థికవ్యవస్థ అస్తవ్యస్తమై వికృత లక్షణాలు పొడజూప కుండా నిర్వహించే బాధ్యులు పరిగణించవలసిన విషయం.

12. ఇక వుత్పత్తి విధానాల సంగతి చూదాం. వ్యవ సాయరంగం మిగిలిన అన్ని రంగాలకన్న తక్కువపెట్టు బడితో ఎక్కువ వుత్పత్తిని తయారుచేస్తున్నది. రవాణా, విద్యుదుత్పత్తి వంటి రంగాలు మరొకవైపు నున్నాయి. అయితే వ్యవసాయ రంగంలోని పెట్టుబడితీరు, వుత్పాదన విధానాలు 1951 కీ 1981 కి నడుమ ఎంతగానో మారి పోయాయి తక్కువ భూమిలో ఎక్కువ పంటపండించడానికి తక్కువ శ్రమతో ఎక్కువ పంట పండించడానికి అనేక సాధ నాలు లభ్యమవుతున్నాయి. నీటి పారుదల, మురుగునీటి సౌకర్యాలు, ఎక్కువ దిగుబడినిచ్చే విత్తులు, కొంతవరకు ఎరువులు, స్వల్పకాలంలోనే రాలుబడినిచ్చే రకాలు మొదలైనవి తక్కువభూమిలోనే ఎక్కువమార్లు ఎక్కువ పంటనిచ్చేవి ఆయిలు ఇంజన్లు, ట్రాక్టర్లు, హార్వెస్టకంబైన్లు తదితర యాంత్రిక పరికరాలు తక్కువ మానవశ్రమతోనూ పశుశక్తి తోనూ పంటనిచ్చేవి. భూమి కొరత వున్నచోట మొదటి విధానాలను, శ్రామికులకొరత (రైతు ఎద్దడి) వున్నచోట రెండవరకం విధానాలను అవలంబించటం ఆర్థికవ్యవహార రీత్యా వుచితమైన పని అయితే రెండు విధానాలకు పెట్టు బడి ఖర్చు అధికంగా వుంటుంది. మొదటి రకంలో, స్వంత కమతపు నీటి సరఫరా ఏర్పాట్లు లేకుంటే, సాలుసాలుకూ అయ్యే ఖర్చు వెంటనే దిగుబడి నిస్తుంటుంది. ట్యూబ్‌వెల్స్ యితర ఏర్పాట్లలో ఎక్కువ ఖర్చు పెట్టవలసి వస్తుంది. రెండవరకం విధానాలలో ఆరంభంలోనే అధికమైన స్థిర పెట్టుబడి ఖర్చు పెట్టవలసి వుంటుంది. మొదటిరకం విధా నాలు చిన్నకమతాలలో కూడా లాభదాయకంగా అమలు జరపవచ్చు. రెండవరకం విధానాలు పెద్ద కమతాలలో తప్ప లాభదాయకంగా అనుసరణీయం కావు. ప్రస్తుతం సగటున వ్యవసాయరంగంలో 1 రూపాయి విలువగల వుత్పత్తికయ్యే పెట్టుబడివిలువ (భూమివిలువతోసహా) మొత్తం 2.0 రూపా యలనుంచి రు 3.2 రూపాయలవరకూ పెరిగింది. 195-51 నుంచీ 1978-79 మధ్యకాలంలో పంజాబు, పశ్చిమ ఉత్తర ప్రదేశ్, మహారాష్ట్ర, హర్యానా, తమిళనాడు, ఆంధ్ర ప్రదేశ్‌లలో కొన్ని ప్రాంతాలలో వ్యవసాయం తక్కువ శ్రమశక్తితో అధిక పెట్టుబడితో రాలుబడితో లాభదాయకంగా కొనసాగుతున్నది. అయితే పెట్టుబడి ఎక్కువగా ఎక్కువ మార్లు అవసరం కావడంచేత అదే స్థాయి వుత్పత్తికి ఎక్కువ ప్రజాశికల కేటాయింపు జరగవలసి వస్తున్నది. ఇటీవల కొంత కాలంగా పబ్లిక్ యిరిగేషన్ ప్రాజెక్టుల పని చాలా మందకొడిగా సాగుతున్నది. కాలయాపన వలన, వృథా పోవడం వలన, ధరల పెరుగుదలవల్ల ప్రాజక్టులు ఆదిలో అనుకున్న డబ్బు ఖర్చుకంటె ఎన్నోరెట్లు కేటాయింపు జరిగితే తప్ప యిప్పుడు పూర్తికాని స్థితిలో వున్నాయి.

అయితే వాటివల్ల లాభించే ఉత్పాదన వస్తువుల మొత్తం మాత్రం అనుకున్న దానికన్న పెద్దభిన్నంగా లేదు. శ్రామికులకు కొరతలేదు, సాంకేతిక విజ్ఞానానికి లోటులేదు. ఉత్సాహానికి కొదువలేదు. అవసరం అలాగే వున్నది. అయినా ప్రాజక్టుల నిర్మాణంలో ఎందుకు విలంబన జరుగుతుంది? ఒకవేళ తాత్కాలికోత్సాహంతో ప్రాజక్టుల ఎన్నిక జరిగితే వాటినుంచి త్వరలోనే తప్పించుకునేందుకు ప్రయత్నించాలి.

13. అదే విధంగా యంత్ర సామగ్రి నిర్మాణం అధిక ఖర్చుతో కూడుకుని వున్నది. విద్యుదుత్పత్తి యంత్రాల తయారీమీద ఖర్చు రోజురోజుకీ పెరిగిపోతున్నది. ఆర్డర్లు యిచ్చి డెలివరీ తీసుకునే సమయంలో అనేక క్షేత్రాలలో యంత్రపరికరాల విలువ పెరిగిపోతున్నది. నిత్యావసర వస్తువులనేకం ఆధునిక పద్ధతులతో ఎక్కువఖర్చుతో, తక్కువ విలువగల వుత్పత్తినిచ్చే తీరులో వున్నాయి. పాదరక్షలు, సిగరెట్లు, వస్త్రాలు, అగ్గిపెట్టెలు, కాగితం అనేకవస్తువులు యీ విధంగా రూపొందుతున్నాయి. వస్తువుల వుత్పత్తి విధానాలమీద కొన్ని నిర్బంధాలు వున్నమాట వాస్తవమే; వాటికి అనువుగా లేకపోతే లైసెన్సులను యివ్వడం నిరాకరించవచ్చు. అయితే యివన్నీ ఎంతవరకూ వుపయుక్తమవుతున్నాయనిచూస్తే నామమాత్రంగానేనని తెలుస్తుంది.

14. ఏమయితే నేమి, జాతీయాదాయపు పెరుగుదల రేటులో నిర్దిష్ట లక్ష్యాలు, ఒక్క మొదటి ప్రణాళికలో మినహా ఎప్పుడూ నెరవేరలేదు. వివరాలు క్రింద చూడండి.

## పట్టిక 1

| ప్రణాళికలు ప్రగతిరేట్లు | నిర్దేశించబడిన లక్ష్యం | స్థిరమైనధరలలో సగటు పెరుగుదల |
|---|---|---|
| మొదటి ప్రణాళిక (1952-56) | | 3.6 |
| రెండవ ప్రణాళిక (1957-61) | | 4.0 |
| మూడవ ,, (1962-66) | | 2.5 |
| 3 సంవత్సరాల వ్యవధి (1967-69) | | 4.1 |
| నాల్గు ,, (1970-74) | | 3.4 |
| అయిదు ,, (1975-79) | | 4.9 |
| 1977-78 | | 8.1 |
| 1978-79 | | 4.2 |
| 1979-80 | | -5.0 |

ఈ వైఫల్యానికి కొంత వివరణ యింతకు ముందే జరిగింది. ఇప్పుడు మరొక విషయం చూద్దాం. ప్రణాళిక ఖర్చు అంచనాలు ఆరంభ సంవత్సరంలోవున్న ధరలననుసరించి తయారవుతాయి. అయిదు సంవత్సరాల వ్యవధిలో ధరలు పెరగడం తప్పనిసరి అని గత అనుభవం రూఢిగా తెల్పుతున్నది. ధరలు పెరిగితే అనుకున్నంత మాత్రంలో వస్తువుల వుత్పత్తి సాధించాలంటే ముందు నిర్ణయించుకున్న మొత్తం కంటె ఎక్కువ వ్యయం జరిగితే తప్ప సాధ్యం కాదు. ఎక్కువ వ్యయం చెయ్యడానికి ఎక్కువగా ధన సేకరణ జరగాలి. జరక్కపోతే అనుకున్న లక్ష్యాలు నెరవేరవు. ఉదాహరణకు ఆరవ ప్రణాళికలో మొత్తం రు 172000 కోట్లు రూపాయలు ఖర్చుకింద అంచనా వేశాం. సంవత్సరానికి జాతీయాదాయంలో 5.2 శాతం పెరుగుదల లక్ష్యంగా నిర్ణయించుకున్నాం. సంవత్సరానికి సుమారు 5 శాతం ధరలు పెరుగుతున్నయనుకుందాం. 5 సంవత్సరాలలో మొత్తం 26-27 శాతం పెరుగుతాయి. ఆదిలో అనుకున్న ధనరాశి యొక్క విలువ 26-27 శాతం తరిగి పోతుందని అర్థం. అనగా, అదనంగా సుమారు 44,000 కోట్లు రూపాయలు సేకరిస్తే తప్ప అనుకున్నట్లు 5.2 శాతం జాతీయాదాయపు పెరుగుదల లభించదు. అంటే సాలుకు 5 శాతం ధరలు పెరిగితేనే రు 1,72, 000 కోట్లు రూపాయలు రు. 2,13,000 కోట్లకు పెరగవలసి వస్తున్నది, ధరలు మరింత పెరిగితే మరింత

ధనం పెట్టుబడిపెట్టాలి. పెట్టలేకుంటే, లభించే తక్కువ ప్రగతి రేటుతోనే సంతృప్తిచెందాలి. ధరలు పెరిగినంత తేలికగానూ ఎక్కువగానూ పెట్టుబడికి ధనసేకరణ జరగడం చాలా అసాధ్యం. ప్రైవేటు రంగంలో కానివ్వండి, ప్రభుత్వ రంగంలో కానివ్వండి యిది నిజము. అందుకే మన లక్ష్యాలు చాలా కాలంగా అసాధ్యాలుగానే పరిణమిస్తునే వచ్చాయి. అయినా ఆశాభావం విడనాడకుండా ముందుచూపుతో సాగిపోతునే వున్నాం. కొంత వెను జూచుకుని యీ విషయాన్ని నెమరు వేసుకుంటే ప్రణాళికారచన మరింత ప్రయోజనకరంగా కొనసాగుతుంది. ప్రజలను మభ్యపెట్టి మరేవో వివరాలు వుగ్గడించడం అనుచితం, విజ్ఞుల ఎదుట అవివేకం.

15. ఉత్పత్తి చెయ్యడానికి నిర్ణయించబడిన వస్తుసముదాయపు స్వరూపస్వభావాలు మారడంవలన, ఉత్పాక విధానాలు మారడంవలన ఏటేటా ఎక్కువ శ్రమపడి పొదుపుచేసిన మొత్తంలో తక్కువ ఫలం సిద్ధిస్తున్నదని చెప్పడం జరిగింది. ఆదే విధముగా ధరలు పెరగడం అనివార్యం అని తెలిసివున్నప్పుడు కూడా లక్ష్యాలనిర్ణయంలోగానీ వనరుల సేకరణలోగానీ యితరఅంచనాలలో అందుకు తగినఏర్పాట్లు చెయ్యలేక పోవడం ప్రణాళికాపైఫల్యానికి త్రోవ తీసింది. ప్రణాళికా రచయితల పాండిత్య లోపమనీ చెప్పలేము, పాలనా నిర్వాహకుల నిజాయితీలేని తనమనీ అనలేము మొత్తంమీద ఎక్కువ జాగ్రత్త తీసుకోవలసిన అంశాలపట్ల వుపేక్ష జరిగింది. ఎక్కువ వుక్కు, శక్తి, సిమెంటు, అల్యూమినియము ఎరువులు వుంటే ఎక్కువ పంటలు పండుతవా? ఎప్పుడు? ఇవన్నీ అయిన తర్వాత వచ్చే పంటలకోసం ఎదురు చూడటం మంచిదా? ముందే మరికాస్త కడుపునింపుకుని మిగిలిన వాటి సంగతి చూడటం మంచిదా? అసలు మన పంటల లెక్కలు సరైనవేనా అని ఎవరన్నా అడిగితే అజ్ఞుడా అని తలపంకించే రోజులు కావని కొంతమంది పండితుల అభిప్రాయం. గోధుమ, వరి యితర ఆహార ధాన్యాల వుత్పత్తి అంచనాలు అసలు కంటె కొంచెం ఎక్కువ పాళంలోనే వున్నాయని తెలుసుకోడం కొంచెం కష్టంతో కూడిన పనే అయినా అసాధ్యం కాదు. మనకున్న గణాంక విధానాలను చూస్తే వ్యవసాయ రంగంలోని అంచనాలు అత్యంత స్వాభావికంగా తప్పు పోవడానికి అవకాశం వున్నది. ఎక్కువ ఆదాయం వస్తున్నప్పుడు ఎక్కువ వుత్పత్తి చెయ్యవలసిన అవసరం ఏమీలేదు. తక్కువ వుత్పత్తిలో వ్యక్తిగతమైన శ్రమ తగ్గుతుంది, పెట్టుబడి ఖర్చు తగ్గుతుంది ఆదాయానికి ఆదాయమూ వుంటుంది. అందువలన ధరలు పెంచినంతమాత్రాన పంటలు తప్పనిసరిగా ఎక్కువ పండిస్తారని అనుకోవడంకష్టం, పారిశ్రామికోత్పత్తి ఎక్కువగా జరుగుతుందని చెప్పడమూకష్టమే ఇవన్నీ తెరవెనుక మామూలుగానే మిగిలిపోకుండా ప్రజాబాహుళ్యం ముందుకు, చైతన్యపూరితులైన వివేకులముందుకుచర్చకురాగలిగినాడు కొంత మేలుజరగడానికి ఆస్కారం వున్నది.

16. ప్రణాళికా లక్ష్యాలు వగైరాలను గురించికాక ప్రణాళికా నిర్మాణాన్ని గురించి, అమలు జరపడానికి అనుసరించే విధానాలను గురించి అభిప్రాయ భేదాలుండవచ్చు. పన్నులరూపంలో ధనం సేకరించాలనీ అప్పుల రూపంలో సేకరించాలనీ, వేతనాలు వడ్డీలు వగైరాలు యిలా అలా వుండాలనీ అనుకోవచ్చు. విదేశాలనుంచీ దిగుమతులు చేసుకోవాలనీ దేశంలోపలనే వుత్పత్తి చేసుకోవాలనీ అని వాదించుకునేవారు వుండవచ్చు అదంతా సమస్యను గురించి వారి అవగాహనమీద ఆధారపడి వుంటుంది. ఈ అవగాహన వారి విద్య, అనుభవం, మేధస్సు ఇతర వ్యక్తిగతమైన సామాజికమైనశక్తులవలన ఏర్పడి కొన్ని మానవ సహజమైన పొరపాట్లవలన కూడా ప్రభావిత మవుతుంటుంది. అయితే, అభిప్రాయభేదానికి తావులేకుండా, తెలుసుకోలేకుండా వుండటానికి వీలులేకుండా ప్రణాళికాలక్ష్య సిద్ధి మీద దుష్ప్రభావం నెరపుతున్న కొన్ని అంశాలున్నాయి. ఇంత కాలం యింతమంది నాయకులు, విజ్ఞానులు, విద్యావంతులు యితరులు ఎలా విస్మరించారా అని ఆశ్చర్యం కలుగుతుంది అది వాతావరణము. వాతావరణంలోనికలిగే ఒడుదుడుకులుమార్పుల వలన మన ఆర్థిక వ్యవస్థలోనూ సామాజిక జీవనంలోనూ ఒక లయ కనిపిస్తుంది. అది విశృంఖలమూ స్థిరమూ కానిది వాతావరణంయొక్క ప్రభావాన్ని ప్రణాళికా రచనలో ఏ విధంగా ఎందుకు పరిగణనలోకి తీసుకోవాలి అనేది ప్రకృతం.

17. వసంతానికి మోసులెత్తే నవతా, మలయానిలపు తాకిడికి సొక్కిపోయే నీటి తరగలు, తొలిమొయిళ్ళ నడుమ తళుకారే మెరుపు తీగలు, మిన్నూమన్నూ ఏకంగా కురిసే జడివానలు, శరత్తు జగమంతా నింపే వెండి వెన్నెలలూ, మంచు తెరలమాటున నిస్తబ్ధంగా కుంచించుకునే శీతా

కాలమూ, కావ్యములలో వర్ణించబడినరీతి పాఠకులకు అపరిచితంకాదు. సంప్రదాయమూ, లాక్షణిక పరంపర యీ నాటివికావు. ప్రకృతికి ప్రతిస్పందించే ప్రతి మానవుడికీ, రసగ్రహణ పారణతగల ప్రతి వ్యక్తికీ అనుభవైక వేద్యం. ఋతుక్రమం యొక్క లయ అనాదినుంచీ నిశ్చితంగా నియమబద్ధంగా వున్నది. ఈ విషయం విదితమే మానవుడి ప్రాథమిక విజ్ఞానానికి అంకురార్పణ ప్రకృతి క్రమంతో ఆరంభమయిందన్న విషయం ఇప్పటికి అందుబాటులో వున్న తర్క సిద్ధాంత రీత్యా విప్రతిపత్తి రహితము.

18. వాతావరణంలో ఋతు లక్షణాలు ముఖ్యము. కొన్ని ప్రాంతాలలో ఋతువులు కుదించుకుని వుంటాయి. విస్తరించుకుని వుంటాయి, కొన్ని చోట్ల కొన్ని ఋతువులు నామమాత్రంగానే వుంటాయి. భూసారం, పంటలతీరు ఆహారపు అలవాట్లు, జనసాంద్రత, భూమియొక్క యితరవాడకపు విధములు మొదలైన అంశాలు ఋతులక్షణాల తీవ్రత, విస్తరణలమీద ఆధారపడి వుంటాయి. ప్రతి సంవత్సరమూ ఋతుక్రమం దాదాపు ఒకే రీతిగా వుంటుందని కొంతవరకూ నిశ్చయంగా చెప్పవచ్చు. అయితే కొన్ని సంవత్సరాలకొక పర్యాయం ఒక్కొక్క ఋతువుయొక్క తీవ్రత విస్తరణ మారుతూవుంటాయి. వడగాడ్పులు, వరదలు, చలిగాలులు మూడు సంవత్సరాలకో నాలుగు సంవత్సరాలకో ఒక పర్యాయం రావడం అనుభవం. అదే విధంగా అనేక దశాబ్దాల కాలంలో ఋతువుల తీరులో పరిగణించ దగిన మార్పు రావడం కొంతమంది ఎరికలోని విషయమేగాక వాతావరణ గణాంక వివరాలుకూడా కొంతవరకు పుష్టినిస్తున్న విషయం. ఇటీవల ఆధునిక సాధనాలు ప్రయోగించి వాతావరణాంశాలను కొలుస్తున్నాం. ఇదివరలో శారీరక మానసిక అనుభవపు స్థితిగతులను బట్టి కొన్ని స్థూల సూచికలద్వారా తెలుసుకునేవాళ్ళం.

19. అదిమవృత్తి వ్యవసాయం ప్రకృతిమీద ఆధారపడి వున్నది. వెలుగు, ఉష్ణోగ్రత, గాలి, తేమ, దుమ్ము మొదలైన అంశాలు తగుమాత్రంలో వుండటమే కాక వ్యవసాయానికి నీటియొక్క అవసరం కొంతైనా వున్నది. బావులు, చెరువులు, నదులు, కాలువలు—ఎటువంటి నీటివసతి వున్నా అన్నీ చివరకు వర్షపాతం మీద ఆధారపడి వుండేవే. భూగర్భ జలసంపదకూడా వర్షపాతం ఎక్కువగా వున్న చోట్ల తక్కువ లోతునుంచీ ఎక్కువ మేరలో విస్తరించుకుని వుంటుందని తెలుస్తుంది. నదుల పారుదల ప్రాంతం, కాలువలు వర్షపాతం హెచ్చుగా వుండే చోట్లనే విస్తరించుకుని వున్నాయి. జనసాంద్రత నీటి వసతులున్న చోట అత్యధికంగా వున్నది. ఆనకట్టలు, ప్రాజక్టులు కట్టి నీటిని నిలవచెయ్యడం నేర్చుకున్నా ఒకటి రెండు సంవత్సరాలకైనా వర్షంమీద ఆధారపడక తప్పదు. ఒక్కొక్క ప్రాంతంలో కురిసేవర్షం యితర వాతావరణాంశాలను బట్టి అక్కడి పంటల తీరు, పరిమాణము నిర్ణయమవుతుంటాయి.

20 మనది ఎప్పుడో కాదు యిప్పుడుకూడా వ్యవసాయమే ప్రధాన ఉత్పాదనరంగంగా వున్నదేశం. మొత్తం జాతీయాదాయంలో 45 శాతం పైచిలుకు వ్యవసాయం నుంచే లభిస్తున్నది. ప్రణాళికారంభకాలంలో, 1951-52 లో, 55 శాతం వుండేది. క్రమేపీ కొంత తగ్గింది. 70 శాతంపైగా జనాభా వ్యవసాయం దాని ఉపాంగాలు ప్రధాన వృత్తిగా జీవిస్తున్నారు. పెట్టుబడికి వలసిన పొదుపు మొత్తంలో అత్యధికభాగం వ్యవసాయరంగంనుంచే ఏదో ఒక రూపంలో సంక్రమిస్తున్నది. వ్యవసాయరంగంలో వుత్పత్తి 1951-52 లో రు. 5320 కోట్ల రూపాయలనుంచీ 1979-80లో రు.8800 కోట్లకు పెరిగింది (1960-61 ధరల ప్రకారం). 28 సంవత్సరాల వ్యవధిలో 75 శాతం కన్న కొంచెం ఎక్కువగామాత్రం పెరిగింది. చెప్పుకోదగ్గ విషయం కాదు. అయినా అంత కన్న ముఖ్యమైన విషయం యింకొకటున్నది. ఈ పెరుగుదల నిలకడగా లేదన్న విషయం స్పష్టం చేసుకోవలసిన అవసరం వున్నది. వ్యవసాయోత్పత్తిలోని ఎగుడు దిగుళ్ళు తెలుసుకోటానికి క్రింది పట్టికలోని వివరాలు తోడ్పడతాయి.

## పట్టిక 2

## ప్రణాళికా కాలంలో వ్యవసాయోత్పత్తి
## (1960-61 ధరలలో)

| సంవత్సరము | ఉత్పత్తి | సంవత్సరము | ఉత్పత్తి |
|---|---|---|---|
| 1950-51 | 5242 | 1963-64 | 7112 |
| 51-52 | 5316 | 64-65 | 7747 |
| 52-53 | 5492 | 65-66 | 6693 |
| 53-54 | 5940 | 1966-67 | 6675 |
| 54-55 | 5975 | 67-68 | 7791 |
| 1955 56 | 6028 | 68-69 | 7803 |
| 56-57 | 6273 | 69,70 | 8195 |
| 57-58 | 6050 | 1970-71 | 8793 |
| 58-59 | 6707 | 71-72 | 8643 |
| 59-60 | 6613 | 72-73 | 7900 |
| 1960-61 | 7010 | 73-74 | 8480 |
| 616-2 | 7079 | 74-75 | 8280 |
| 62-63 | 6709 | 1975-76 | 9320 |
| | | 76-77 | 8800 |
| | | 77-78 | 9750 |
| | | 78-79 | 9960 |
| | | 1979-80 | 8775 |



జెమిని
పళ్లపొడి
నోటి దుర్వాసన పోగొట్టి పయోరియా మొ॥ దంతవ్యాధులను నిర్మూలించి పళ్లను ముత్యాలవలె ప్రకాశింపజేయు అత్యుత్తమమైన ఒకే ఒక తెల్లని, మెత్తని పళ్లపొడి. పిప్పరమెంటు, లవంగనూనె, మొ॥ అమూల్య సమ్మేళనం...
జెమిని పళ్లపొడి
PHONES 977 209
Gemini TOOTH POWDER
GEMINI TOOTH POWDER
GEMINI TOOTH POWDER
VIJAYA M P M
తయారీదారులు :- జెమిని కెమికల్ ప్రొడక్ట్సు P.B.No 7 మచిలీపట్నం-521001(A.P.)

1957-58, 1962-63, 1965-66, 1966-67, 1972-73, 1974-75, 1976-77 చివరకు 1979-80 సంవత్సరాలలో అంతకు క్రితం అందుకున్నస్థాయి కన్న ఉత్పత్తి పడిపోయినట్లు తెలుస్తుంది. మొత్తం 30 సంవత్సరాలలోనూ 8 సంవత్సరాలు వ్యవసాయోత్పత్తి స్థాయి తరిగిపోయింది. అంటే సగటున 3-4 సంవత్సరాల కొకసారి వ్యవసాయోత్పత్తి క్షీణించక తప్పదు అని తెలుస్తుంది. ఇటీవలి కాలంలో సంవత్సరం విడిచి సంవత్సరం వ్యవసాయోత్పత్తి పడిపోయింది. ఇదివరలో అయిదారు సంవత్సరాల కొకసారి మాత్రమే అలా జరిగింది. ఎందువలన? ఇది మన సాంకేతిక ప్రగతికి సూచన అనుకోవాలా, వ్యవసాయ రంగాన్ని నిర్లక్ష్యంచేసి పెట్టుబడిని యితరరంగాలలో కేంద్రీకరించడం వల్లనా? ఇంకేమైనా మనకు తెలియని మన అధీనంలోలేని కారణాలవల్లనా? ఈ ఎగుడు దిగుళ్ళు ఆహార పదార్థాల ఉత్పత్తి విషయంలో ఎక్కువగా వుండటం గమనించ వలసిన విషయం. నూనెగింజలు, పత్తి జనుము వంటి నారపదార్థాలు, కాఫీ, టీ, రబ్బరువంటి పంటల ఉత్పత్తిలో ఎగుడుదిగుళ్లు అంతగా పరిగణించవలసిన స్థాయిలో లేవు. చెరకు, పొగాకు యితరాల ఉత్పత్తికూడా స్థిరంగా ఎదుగుతూనే వున్నది. ఆహారధాన్యాల వినియోగం తలసరికి ఎదుగూ బొదుగూలేకుండా అలాగే నిల్చి వున్నది. కొద్దో గొప్పో ఎగుమతి దిగుమతులుకూడా జరుగుతున్నాయి. ఇతర వస్తువుల వినియోగమూ పెరుగుతున్నది, ఎగుమతులు కూడా జరుగుతున్నాయి. చపాతీలు, అన్నం బదులు కాఫీ తాగి సిగరెట్లు కాల్చుకునే కన్న అవి తిని, తర్వాత తాగడం జరిగితే మేలు అంటే ఎవరా వీరు అని పరకాయించి చూసే వాళ్ళు కొందరున్నారు. ఇది అర్థశాస్త్రమా, సామాన్య పరిజ్ఞానమా- మన ఒత్తిడులా - ఏమిటి అనే ప్రశ్న రానక్కర లేదు.

21. వ్యవసాయోత్పత్తి చంక్రమణాల ప్రభావం ఇతర రంగాలకు కూడా వ్యాపిస్తుంది. ముఖ్యంగా పారిశ్రామికోత్పత్తిలో ముడిపదార్థాలుగా వినియుక్తం అయ్యే వస్తువుల ఉత్పత్తితో మార్పులు ఇందుకు దోహదం చేస్తాయి. పంచదార, వస్త్రాలు, అగ్గిపెట్టెలు, రంగులు, గోనెలు, సిగరెట్లు, యితర వస్తువుల ఉత్పత్తి వ్యవసాయరంగంనుంచీ లభించే ముడిపదార్థల ఉత్పత్తిమీద ఆధారపడి వున్నది. మొత్తం పారిశ్రామికోత్పత్తిలో యిలాంటి వస్తువుల పరిమాణం 3 శాతంవరకూ వున్నది. అయితే యింతకు ముందు చెప్పినట్లు యీ రకపు ముడిపదార్థాల ఉత్పత్తి చంక్రమణాల కన్న పరిమితంగావున్నాయి. కనుక పారిశ్రామికోత్పత్తిలో వచ్చే ఎగుడు దిగుళ్ళు ముడిపదార్థాల కొరతవలన కాదు; పారిశ్రామికరంగంలోనే వుండే యితర ఇబ్బందులవలన అని చెప్పుకోవాలి. అయితే సరఫరాఅవుతున్న ముడిపదార్థాల కంటె గిరాకీ ఎక్కువగావుండే రీతిలో ఆయా పారిశ్రామిక రంగాలు విస్తరించిన మాట కొంతవరకు నిజం. మేలురకం పత్తి దిగుమతి చేసుకుంటున్నాం, వంట నూనెలు దిగుమతి చేసుకుంటున్నాం, ముడి కాగితం వగైరా కూడా దిగుమతి చేసుకుంటున్నాం. కనుక దిగుమతి అయ్యే ఆవశ్యక ముడి పదార్థాల పరిమాణంలో ఒడిదుడుకులవలన, ఉత్పత్తి నిర్ణయాలు, సరుకునిల్వలు వంటి అంశాలవలన పారిశ్రామికోత్పత్తిలో ఎక్కువగా చైత్రికవైపరీత్యాలు సంభవిస్తున్నాయి. అయితే యితర రంగాలమీదకంటె వ్యావసాయికోత్పత్తి చక్రాలు మొత్తం జాతీయాదాయంమీద ఎక్కువ ప్రత్యక్ష ప్రభావం నెరపుతున్నాయి. ఉదాహరణకు వ్యవసాయోత్పత్తి 10శాతం పడిపోయిందనుకోండి, జాతీయాదాయంలో 5శాతంభాగంలో10శాతంతగ్గిందంటే, మొత్తంలో4.5 శాతం తగ్గిందని అర్థం. సాలుకు సగటున 5 శాతం జాతీయాదాయపు పెరుగుదల లక్ష్యంగా నిర్ణయించుకున్నప్పుడు వ్యవసాయోత్పత్తిలో 10 శాతం తరుగుదల వస్తే మొత్తం 5 శాతం పెరగడానికి బదులు 4.5 శాతం తరుగుతుంది. మన లక్ష్యాలు నెరవేరక పోవడానికి కారణం వ్యవసాయోత్పత్తి మార్పులలో వెతుక్కుంటే కనిపిస్తుంది. ఇంతకు ముందు చెప్పినట్లు వ్యవసాయోత్పత్తి వాతావరణపు సహజలక్షణాల క్రమంమీద నిర్ణయించబడుతుంది. వ్యావసాయిక చక్రాల లోని పల్లములవలన మొత్తం జాతీయాదాయం 1957-58, 1965-67, యిటీవలి 1979-80లలో మొక్కవోయింది. మిగిలిన సంవత్సరాలలో (20వ పేరాలో యిచ్చిన వివరములు) వ్యవసాయంలో వచ్చిన లోటు యితరరంగాల పెరుగుదల వలన భర్తీ అయింది కనుక మొత్తం ఆదాయం యథాతథంగానో కొద్దోగొప్పో ఎదుగుదలతోనో సాగిపోయింది.

22. పంటల ఉత్పత్తిలో హెచ్చుతగ్గులెందువలన వస్తున్నాయి గిరాకీ బట్టి లాభాన్ని బట్టి ఒక్కొక్క సంవత్సరం ఒక పంట హెచ్చు మాత్రం భూమిలోనూ మరొక పంట తక్కువ భూమిలోనూ సాగుబడికి రావచ్చు. కొంత భూసారంలో లోటుపాట్లవలన తగిన నేలకు తగిన పంట సెన్ను

కోవడంవలన కూడా కావచ్చు. కానీ మొత్తం సాగుబడిలో వున్న భూమిమేర విస్తరిస్తున్నప్పుడు, అన్నిరకాల పంటలు వుత్పత్తి కలిసి తరుచుగా తగ్గుతుండటం ఎందువలన? వ్యవసాయోత్పత్తి భూమితీరు, విత్తులు, ఎరువులు, శ్రమ అన్నింటికి మించి తగిన సమయంలో కృషి మొదలైన అనేకాంశాల సమీకృత ప్రయత్నఫలం ఇవన్నీవున్నా ప్రకృతి అనుకూలించకపోతే అంతా వ్యర్థమే. వాతావరణానికి తగిన ంటను తగిన సమయంలో ఎన్నుకోకుంటే అది రైతు లోపం. అంతా అయి వాతావరణంలో విపరీతమైనమార్పులు సంభవిస్తే అది అతని అధీనంలోలేని విషయం. ప్రతి ఋతువుకూ సహజమైన వాతావరణలక్షణాలలో అప్పుడప్పుడూ వైపరీత్యం పొడసూపటం కద్దు. వేసవి ఎండలు ఎక్కువ వుష్ణోగ్రత స్థాయినందుకోవచ్చు. వర్షాకాలంలో వరదలూ రావచ్చు, వర్షాభావం వుండవచ్చు. అంటే ప్రతి ఋతువు యొక్క ముఖ్య వాతావరణాంశానికి ఒక సహజ స్థితి వుంటుంది. ఆ సహజ స్థితిలోకూడా ఎగుడుదిగుళ్ళు వస్తే అనుకూల వాతావరణం క్రింద పరిగణించాలి. ప్రాంతీయ విభేదాలనుకూడా మనం జాగ్రత్తగా పరిశీలిస్తే యీవిషయం స్పష్టమవుతుంది. ఢిల్లీ పరిసర ప్రాంతాలలో చలికాలం కనిష్ట ఉష్ణోగ్రత రెండు లేక యింకా తక్కువకు పడిపోతుంది. అదే కోస్తా ఆంధ్ర తమిళనాడు ప్రాంతాలలో 10 డిగ్రీలదాకా వుండవచ్చు, చిరపుంజి ప్రాంతంలో సగటున 3000 సెం. మీ. వర్షం పడితే ఆంధ్ర ప్రాంతంలో 1025 సెం.మీ మించదు. గాలి తీవ్రత, తేమ, వెలుతురు, రోజులో వెలుతురుగల సమయపునిడివి యిలాంటి వాతావరణ అంశాలలో ఋతుభేదాలుతోబాటు ప్రాంతీయ భేదాలుకూడా ఆధికంగా గోచరిస్తాయి.

3. వాతావరణం మన వ్యవసాయ కార్యక్రమంమీద ప్రభావం నెరపుతున్నప్పుడు దానిని ఏ విధంగా కొలుస్తాం, అవసరమైన ప్రజావర్గాలకు కొలతల సమాచారం ఏ రూపంలో అందిస్తాం అనేవి ముఖ్యమైన ప్రశ్నలు. వాతావరణం పైన చెప్పినట్లు అనేక అంశాల సముదాయం. అందులో ఏ ఒక్క అంశమూ వాతావరణస్థితిని సమగ్రంగా నిర్దేశింపజాలదు. అయితే యీ అంశాలమధ్య ఒక సమన్వయ స్థితి గోచరి[illegible]ంది. చలికాలంలో వెలుతురు సమయపునిడివి. కనిష్ట, గరిష్ట ఉష్ణోగ్రతలు గాలితీవ్రతలమధ్య ఒకనిశ్చిత సంబంధం చూడవచ్చు. వాటిని విడివిడిగా కొల్చి పలురోజుల గణాంకములను కూర్చిచూస్తేవచ్చే "correlation coefficient" పరిగణనీయంగా వుంటుంది. వేసవిలో రోజునిడివి, అత్యధిక అత్యల్ప ఉష్ణోగ్రతలమధ్య యిలాంటి సంబంధం చూడవచ్చు. వర్షఋతువులో వర్షపాతము, గాలిలో తేమ, వెలుగు సమయాల మధ్య తప్పనిసరిగా గణాంక సంబంధమైన correlation coefficient హెచ్చుగా వుంటుంది. ఇంతే కాదు ఇంకొంచెం ఆసక్తికరమైన అంశాలున్నాయి. వేసవిలో వుష్ణోగత సగటుస్థాయికి, వర్షాకాలంలో ఏడేవానల స్థితికి సంబంధం వుంటుంది. వానల సగటు పరిమాణానికి చలికాలపు చలికి సంబంధం వుంటుంది. మళ్ళీ చలి తర్వాత వచ్చే వేడికి సంబంధం చూడవచ్చు. ఇదంతా ఒక విచ్ఛిత్తమైన ఋతు చక్రాలకు వార్షిక చక్రాలకు ఆధారభూతమైన ప్రకృతిలయ అంతేకాక ఒకే తాపమాన స్థితిలో వున్న భిన్న ప్రాంతాలమధ్య, వర్షమాపక రేఖలలోవున్న ప్రాంతాల మధ్య యిటువంటి సంబంధం చూడవచ్చు. కొన్ని అంశాలు ఒకే ధోరణిలోనూ మరికొన్ని విరుద్ధ దోరణులలోనూ ప్రవర్తిస్తుంటాయి (వీటిని పాజిటివ్, నెగిటివ్, రిలేషన్‌షిప్ అంటాము. దేశంలోని భిన్నభిన్న వాతావరణ కేంద్ర ప్రాంతాలలో 13 అంశాలకు చెందిన అత్యల్ప అత్యధిక స్థాయి గణాంకాలను సేకరించి ప్రభుత్వం వాతావరణం పట్టికలు ప్రచురించింది. (అయితే వాటి మధ్య అన్వయపు సూచికలు అంచనాలుగానీ,విశ్లేషణ గానీ యీ వ్యాసరచయిత దృష్టికి ఇంకనూ రాలేదు.) వాటినిబట్టి తెలుస్తున్న దేమిటంటే ఎక్కడైనా ఏ ఋతువులోనైనా ఒక్క ప్రముఖ వాతావరణాంశం యొక్క కొలతను మొత్తం వాతావరణానికి స్థూలసూచికగా వాడటం సబబుగానే వుంటుంది. మిగిలిన అంశాలు దానిలో మార్పులకు నియమిత సంబంధపు పరిమితిలో అనువర్తిస్తుంటవి గనుక ఎక్కువ బాధలేదు. పైపెచ్చు, వ్యవసాయోత్పత్తిలో చక్రీయ భ్రమణాలను విశ్లేషించేటప్పుడు ముఖ్యంగా కావల్సింది వర్షపాతంయొక్క స్థాయి. సారవా దాళవా పంటలు ఖరీఫ్, బీ పంటలనికూడా అంటాము) యొక్కనాట్లు ఎల్లు కకోతల సమయాలు-వాటికీ ఋతువుల మార్పుకూ గల సంబంధమూ తెలిసినదే. వర్షపాతానికీ జలాశయాలలో నీటి చేరువకూ, నీటి సరఫరాకు పంట. స్థాయికి సంబంధం తెలిసినదే నేలతీరు, విస్తారము పంటను బట్టి కావల్సిన నీటి

ప్రమాణము నిర్ణయమవుతుంది. అయితే నీరు వాడినకొద్దీ పంట పెరగదు అలా చెప్తే, ఎవరికి తెలియదు అనుకోవచ్చు అనుభవజ్ఞులు. అలాటి అనుభవజ్ఞులు ఎక్కువున్నకొద్దీ ఇంత గణాంకాలు, కంప్యూటర్లు, ఫలితాలు విశ్లేషణ అన సవసమె అవుతాయేమో అట్లాగే నీరు తరిగిన కొద్దీ పంట తరిగి పోతూ వుంటుంది అన్ని అంశాలు అనువుగా వున్నప్పుడు ఎక్కువ వర్షపాతం తక్కువ వర్షపాతం రెండూ పంటను అక్కడికక్కడే యిక్కడనుంచీ దించివేస్తాయి. వరదలూ తుపానులూ, ఒకవైపు క్షామం కాటకం, మరొకవైపు మన వ్యవసాయో త్పత్తిమీద దుష్ప్రభావం చూపెడుతున్న సంగతి తెలుసు.

24 వర్షపాతాన్ని గురించిన గణాంక వివరాలు పందొమ్మిదవ శతాబ్దపు ఆదినుంచీ లభ్యమవుతున్నాయి. ఇవి ముఖ్యంగా బొంబాయి, కలకత్తా, మద్రాసు ప్రెసిడెన్సీ ప్రాంతాలకు సంబంధించినవి. ఈ శతాబ్దపు మలిభాగం నుంచీ దేశంలోని అనేక ప్రాంతాలకు చెందిన వివరాలు లభ్యం కాసాగాయి. సం. 1910 నుంచీ 950 వరకూ దేశం మొత్తం లోని కేంద్రాలను సేకరించిన సమాచారం నెలవారీగా సాలు వారీగా కేంద్ర మెటీరియోలాజికల్ శాఖ వారు, 1961-62 ఒక గ్రంథాన్ని Monthly and Annual Normals of Rainfall and Rainy Days, 1901 50" అనే పేరుతో ప్రకటించారు. "నార్మల్" వర్షపాతం అనేది కేవలం అనేక సమయాల సగటుస్థాయి అని నిర్ణయించారు. పంటలకుగానీ యితర వుపయోగాలకుగానీ "నార్మల్" వర్షపాతానికి స్థూలస్థాయితో సంబంధం వుండటానికి అవకాశం లేదు. ఒక్కొక్క ప్రాంతంలో "నార్మల్" ఒక్కొక్కరకంగా వుంటుంది. అది ఎక్కువగా హెచ్చుపంట పండటానికి ఎంత వర్షపాతం కావాలి అనేది పంటమీద, ప్రాంతంమీద, యితర విషయాలమీద ఆధారపడి వుంటుంది. పంటలేగాక వాతావరణం మన జీవితంలోని అనేకకార్యక్రమాలమీద ప్రభావం నెరపుతుంది. విమానయానానికి, శారీరికోల్లాసానికి, సముద్రయానానికి, యింకా అనేక ఉపయోగాలకు కావలసిన "నార్మల్" లేక "ఆప్టిమమ్" స్థాయి వేరుగా వుంటుంది. నేడు దేశంలో 550 వాతావరణ పరిశోధనా కేంద్రాలు, కేంద్ర వర్షమాపక స్టేషన్లూ వున్నాయి. 5000 పైగా రాష్ట్రప్రభుత్వాల ఆధీనంలోని వర్షమాపక కేంద్రాలున్నాయి అయితే దేశంలో వివిధ ప్రాంతాలలోని వర్షపాతాన్ని ఎన్ని విధాలుగా వర్గీకరించవచ్చు అనే విషయంలో స్పష్టంగా సమాధానానికి రావడం కష్టము. అనేక పరిశోధనా సంఘాలు, డిపార్టుమెంట్లు కమిషన్లు, వ్యక్తులు, రకరకాలుగా వర్గీకరించాయి. ఒక విధమైన స్థూలవర్గీకరణ యీ క్రింద యివ్వబడింది.

## పట్టిక 3

### వర్షపాతప్రాంతాలు - సగటుసాలువర్షపుస్థాయి

| | |
|---|---|
| అరుణాచల్ ప్రదేశ్ | 3660 |
| కోస్తా కర్ణాటక | 3170 |
| | 2853 |
| హిమాలయ ఉపప్రాంత వర్తిత పశ్చిమబెంగాలు | 2[illegible]97 |
| కేరళ | 2[illegible]70 |
| దక్షిణ అస్సాం | [illegible]523 |
| ఉత్తర అస్సాం | 2430 |
| గోవా కొంకణ తీరము | 2202 |
| హిమాచలప్రదేశ్ | 1846 |
| ఉత్తరప్రదేశ్ పశ్చిమ పర్వత ప్రాంతం | 1769 |
| లక్షద్వీపములు | 1612 |
| ఒరిస్సా | 1473 |
| గంగాప్రాంతపు పశ్చిమబెంగాలు | 1461 |
| తూర్పు మధ్యప్రదేశ్ | 1401 |
| బీహారు పీఠభూమి | 1357 |
| బీహారు మైదానం | 1269 |
| తూర్పు ఉత్తరప్రదేశ్ | 1077 |
| పశ్చిమ మధ్యప్రదేశ్ | 1075 |
| పశ్చిమ ఉత్తరప్రదేశ్ | 1062 |
| విదర్భ | 1060 |
| కోస్తా ఆంధ్రప్రదేశ్ | 1017 |
| తమిళనాడు, పాండిచ్చేరీ | 1013 |
| తెలంగాణా | 903 |
| గుజరాత్ | 842 |
| మరట్వాడా | 7[illegible]7 |
| ఉత్తర అంతర్ కర్ణాటక | 760 |
| హర్యానా | 756 |
| దక్షిణ అంతర్ కర్ణాటక | 740 |
| మహారాష్ట్ర | 707 |
| పంజాబు | 696 |

| | |
|---|---|
| ఢిల్లీ | 690 |
| తూర్పు రాజస్థాన్ | 688 |
| రాయలసీమ | 672 |
| జమ్ము కాశ్మీరు | 533 |
| కచ్ సౌరాష్ట్ర | 165 |
| పశ్చిమ రాజస్థాన్ | 319 |

[సంవత్సరంలో "నార్మల్" వర్షమానం సగటున 50సెం.మీ. దాటిన ప్రాంతాలను, 750సెంమీ.-1150సెం.మీ. మధ్య ప్రాంతాలను, 750సెం.మీ. ప్రాంతాలను విభజించడం జరిగింది. దీనివివరాలను నేషనల్ కమీషన్ ఆన్ అగ్రికల్చర్ వారి రిపోర్టులోనూ ఇండియన్ క్రాప్ కాలెండర్ (సంవత్సరాది సంచిక) లోనూ ముఖ్యంగా చూడవచ్చు. వర్షపాతం ప్రాంతీయ భేదాల పరాసుర్న రెయిన్‌ఫాల్ ఇన్ ఇండియా అన్న రిజర్వుబ్యాంకు ఆప్ యిండియా వారి ప్రచురణలోనూ చూడవచ్చు. ఇండియన్ మెటిరియోలాజికల్ డిపార్ట్‌మెంట్, పూనావారి ప్రచురణలుకూడా అనేకం వున్నాయి] వర్షపాతం కొలిచే పద్ధతులలోనూ, వర్షపు తీరు తెన్నులను నిర్ధారించే విధానాలలోనూ అనేక మార్పులు వచ్చాయి. విశ్లేషణ విధానాలలో ఆధునికతతోబాటు ప్రాథమిక గణాంక వివరాల సేకరణలో వీలైనంత వరకు పొల్లు పోకుండా వుండేటట్లు చూడటం కూడా అవసరం. సంవత్సరంపు సగటు విలువలు 3-4 సంవత్సరాల కొకసారి పల్లుకు హెచ్చుకులకు మారుతూ వుంటాయనీ (వరదలు, కాటకాలవలన) మొత్తం మీద దీర్ఘకాలంమీద సగటు స్థాయికి సూచికలుగానే వుంటాయని చెప్పుకున్నాం. అయితే వర్షపాతం 90-100 సంవత్సరాల కొకసారి విస్తృతమైన చక్రభ్రమణానికి లోనవుతుంటుందని కొలాబా (బొంబాయి), త్రివేండ్రం (కేరళ) కేంద్రాలలో గత శతాబ్దకాలపు వర్షపాత వివరాలను పరిశీలించిన కొన్ని పరిశోధనలు తెలుపుతున్నాయి. అంటే 40-50 సంవత్సరాల తర్వాత వర్షపుస్థాయి అత్యున్నతస్థాయికి చేరుకుని తిరిగి అదే వ్యవధిలో పూర్వస్థాయికి రావడం జరుగుతున్నదని తెలుస్తున్నది. కొన్ని చోట్ల యీ భ్రమణ సమయం వేరుగా వుండవచ్చు.

౨౨. ఆర్థిక వ్యవస్థకు సంబంధించినంత వరకూ దేశం మొత్తానికి ఒక వర్షపాతపు సూచికను అనువైన పద్ధతిలో తయారుచేసి ప్రణాళికా కాలపు ప్రగతిరేట్ల ఎగుళ్ళు దిగుళ్ళతో పోల్చి చూడటం జరిగింది ఒక పరిశోధనలో. ★ జాతీయాదాయపు పెరుగుదలరేటు పెట్టుబడిస్థాయిమీద ఆధారపడివుంటుంది అనేది శాస్త్ర సమ్మతమైన విషయం. జాతీయాదాయంలో ఎంత ఎక్కువ భాగం పెట్టుబడికి కేటాయిస్తే పెరుగుదలరేట్లు అంత హెచ్చుగా వుంటాయని యింతకు పూర్వం చెప్పుకున్నాం అయితే 24 శాతం జాతీయాదాయం సాలుక్రు పెట్టుబడి మొత్తం కింద కేటాయిస్తూ కూడామనసగటు సాలు పెరుగుదలరేటు మూడున్నర శాతం మించి లేకుండటానికి కారణమేమిటి అనే విషయాన్ని విశ్లేషిస్తున్నప్పుడు వాతావరణ ప్రభావం ఒక ప్రముఖ విస్మృతాంశం అని తెలుసుకోడం జరిగింది అందుచేత సహజ వర్షపాతపు స్థితిలోని ఒడిదుడుకులను, పెట్టుబడి శాతాన్ని కలిపి మన ప్రగతిని పరామర్శించి చూస్తే యీకింది విషయాలుతెల్లమయ్యాయి. పెట్టుబడిశాతం స్థిరముగా వుంచినప్పటికీ, అధిక వర్షపాతం వలన, అల్పవర్షపాతం వలన పెరుగుదలరేటు తరిగి పోతున్నది. అయితే ఒకసాయింటుఅధికవర్షానికిఒకసాయింటు తక్కువ వర్షపాతానికి కలిగే ప్రభావం ఒకటిగా వుండదు. సాధారణంగా అధిక వర్షపాతాన్ని అనుకూలంగా మలుచుకోడానికి అవకాశం వున్నది. భూసారము పంటల విషయంలో కూడా కావలసిన పాళంకంటె వర్షం ఎక్కువైనా తట్టుకునే శక్తి ఎక్కువగా వుంటుంది. తక్కువ వర్షపాతం వలన నష్టం త్వరలోనే సంచవిస్తూ వుంటుంది. కాబట్టి తేలేదేమిటంటే వరదలూ, వానలు ఎక్కువకావడంవలన జరిగే నష్టం కన్న అదేమాత్రపు మోతాదులో సహజ స్థాయినుంచీ వర్షపాతం తగ్గిపోతే జరిగేనష్టం చాలా ఎక్కువ. ఒక్కొక్క స్థాయిని మించినా తరిగినా, జాతీయాదాయంలో ఎంత ఎక్కువ శాతం పెట్టుబడికి వినియోగించినా ప్రగతిరేటు శూన్యమే అవుతుంది.

౨౩. మన ఆర్థిక ప్రణాళికాలక్ష్యాల నిర్ణయంలోనూ, విధానాల స్వీకరణలోనూ ప్రాకృతిక శక్తులలో వచ్చే మార్పుల ప్రభావాన్ని పరిగణించడం ఎంత అవసరమో తెలుస్తుంది. దురదృష్టవశాత్తు యింతవరకూ మన ప్రణాళికల తయారీలో ఇందులకు ఎటువంటి ఏర్పాటూ చెయ్యబడలేదు లక్ష్యాలు నిర్ణయించడమూ విఫలంగావడమూ తప్పనిసరిఅవుతున్నది.

---

★"ఇన్‌వెస్ట్‌మెంట్ గ్రోత్ ఎండ్ వెదర్ ఫ్లక్చువేషన్స్ ఇన్ ఇండియా" అన్నపేరుతో వ్యాసరచయిత తయారు చేసిన పరిశోధనాపత్రం త్వరలోనే ప్రచురితం కాబోతున్నది.

ఈ పరిస్థితిని నివారించి వాతావరణ ప్రభావాన్ని కూడా ప్రణాళికా రచనలో ఒక అంశంగా చేర్చాలంటే రెండు ముఖ్యమైన ప్రాథమికావశ్యకతలను పూర్తిచెయ్యాలి ఒకటి ప్రకృతిశక్తుల విజృంభణ. వర్షాభావాల వల్ల పంటలకు, పశువులకూ. నివాసాలకూ, రవాణా, ఉత్పత్తి సాధనాలకు కలిగే నష్టాన్ని గురించి సరిగా బేరీజువేసే విధానాలను తయారు చెయ్యడం రెండవది వర్షపాతాన్ని గురించి సకాలంలో పిల్లైనంత స్వామి సమాచారం అందించడానికి తక్కువ ఖర్చుతో తగిన ఏర్పాట్లు చెయ్యడం, వరదల, ఎండలు, జడిగాల్పుల వలన పలరకాలుగా ప్రతి సంవత్సరమూ కలిగే నష్టం అనేక వందల కోట్ల రూపాయలలో వుంటుందని సూలమైన వడంపు. అయినా, వాటిని ఎదుర్కొడానికి తగిన ఏర్పాట్లు లేకుండా సంక్షేమ కార్యక్రమాల కిందనే కోట్ల రూపాయల ఖర్చు అవుతున్నది. కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు వర్షాలను గురించి వివరాలను ప్రకటించడంకూడా కొంత విచిత్రమైన పరిస్థితిలోనే వున్నది. సాధారణంగా ఋతుపవనాల ప్రారంభానికి మూడు వారాలు రెండువారాల కన్న ఎక్కువ వ్యవధిలో వాటి తేదీను గురించి స్థూలమైన అంచనాలుకూడా ప్రకటించం కావడంలేదు. పూర్వ సంవత్సరాల గణాంక వివరాలనుసరిగా విశ్లేషించిఋతు, వార్షిక దీర్ఘచక్రీయ క్రమాలను నిర్ణయించి వర్తమాన సంవత్సరంపు వర్షపాతపు స్థితిగతులను కొద్దిపాటి పొరపాట్లకు మాత్రమే అవకాశం యిస్తూ అంచనా వెయ్యడం రెండు మూడు నెలల ముందే జరగవచ్చు. రైతులు ఆలోచించుకుని పంటల నిర్ణయం వనరుల సేకరణ, యితరవ్యవసాయపు పనులకు తగిన వ్యవధి లభిస్తుంది వర్తమాన వివరాలను సాంకేతికంగా సేకరించి విశ్లేషించి ప్రకటించడం ఎలాగూ ఋతువుల మార్పులకు సమీపంలోనే జరక్క తప్పదు ఈ రెండు విధానాలద్వారా తగిన సమయంలో వాతావరణంతో పనికలిగే ప్రతివానికి సమాచారం అందింపజెయ్యడం మన ప్రణాళికల సాఫల్యానికి చాలా అవసరం.

27. వాతావరణ స్వభావాలను గురించి అనుకోకుండానూ పెద్ద పెట్టునవచ్చే మార్పులను గురించి ప్రపంచవ్యాప్తంగా పరిశోధనలు సాగుతున్నాయి జెనీవాలోని వరల్డ్ మెటిరియోలాజికల్ ఆర్గనిజేషన్ ఆధ్వర్యాన, విడివిడిగా ప్రభుత్వాలమధ్య సహకారంతోనూ, యీ పరిశోధనా కార్యక్రమాలు కొనసాగుతున్నాయి. 19?7 లో ఒక గ్లోబల్ అట్మాస్ఫియర్ రిసర్చి ప్రోగ్రామ్ ప్రారంభించబడింది. దీనిలో ఒక భాగంగా

ఫ్రెంచి నార్వీజియన్, రష్యన్, బ్రిటిష్ ప్రభుత్వాల సహకారంతో మాన్‌సూన్ ఎక్స్‌పెరిమెంట్ (II) జనవరి-మే 1979 లో బంగాళాఖాతం అరేబియా సముద్రాలలో జరుపబడింది భారత ఉపఖండం ప్రాంతంలోని ఋతుపవనాల ఆవిర్భావము, దిశలు, ఒత్తిడి, వర్షపాతము మొదలైన విషయాలను సాకల్యంగా పరిశీలించేందుకు జరిగిన ఏర్పాటు యిది విదేశ సహకారంతో కొనసాగింపబడిన యీ భారీ ప్రయోగం ఎంత సంతృప్తికర ఫలితాలనిచ్చిందో చెప్పడం కష్టం. గణాంక వివరములను విశ్లేషించి ప్రకటించడంకూడా జరిగింది. అంతకు పూర్వం 1963-65 లోనూ 1973 లోనూ 1977 లోనూ మనదేశాన్ని పర్యవేష్టించి వున్న మహాసముద్రాలను గురించి విశేషంగా తెలుసుకోవడానికి ప్రయత్నాలు జరిగాయి. 1963-65 లోని ఇంటర్నేషనల్ ఇండియన్ రిసర్చ్ ఎక్స్‌పెడిషన్ కార్యక్రమం కొద్దిపాటి వనరులతో దీర్ఘకాలం కొనసాగింది. చెప్పుకోదగిన ఫలితాల నిచ్చింది 1973 లో రష్యన్ల సహకారంతో మాన్‌సూన్ ఎక్స్‌పెరిమెంట్ (I) జరుపబడింది. వాతావరణ పరిశోధనలకు ప్రగతిచెందిన దేశాలు ఎంతో ప్రాముఖ్యమిస్తున్నాయి రోదసీయానం, నౌకరవాణాలు, విమానయానం, యుద్ధ తంత్రం రీత్యా ఎంతో కీలకమైన వివరాలు లభ్యమయ్యే ప్రయోగాలు జరుపబడ్డాయి సాధారణంగా ఆదేశాలు యితరదేశాల పొత్తు లేకుండానే యిటువంటి కార్యక్రమాలు చేబడుతుంటాయి ప్రత్యక్ష ఆర్థిక ప్రయోజనాల కన్న యితర వుపయోగాలు వాతావరణ పరిశోధనల వల్ల ఎక్కువగా సిద్ధిస్తున్నాయి.

28. అయితే యీ పరిశోధనల వలన ప్రకృతిని గురించి అవగాహన పెరిగిన ప్పటికీ అవాంతరాలను నివారించడంలో మానవుని కృషి సఫలం కాలేదనే చెప్పాలి. హరికేన్లు, తుఫాన్లు, టోర్నడోలు, విరివిగా తరుచుగా సంభవిస్తునే వున్నాయి, నష్టం కలుగజేస్తునే వున్నాయి. అవగాహన పెరిగిన తర్వాత రెండవ ఎత్తు ప్రకృతిని నిబద్ధం చెయ్యడానికి ప్రయత్నించడం. ప్రకృతిమార్పులు సహజమైనవి. ప్రజల ఆచార వ్యవహారాలు అలవాట్లు ఆర్థిక స్వరూపం అన్నీ ప్రకృతి లక్షణాలను ప్రయత్న పూర్వకంగా మార్చాలని అనుకోవడం అవివేకం. వాతావరణ పరిశోధనల వలన లభ్యమయిన జ్ఞానం పూర్తిగా ప్రజల సంక్షేమానికే వినియోగింపబడుతున్నదని చెప్పడానికి వీలులేదు. యుద్ధాలలో, సముద్రపు గ్లేజర్లను కలిగించి తుఫాను భీభత్సాలు సృష్టించడానికి, రోదసిలో ఓజోన్ పొరల మధ్య రంధ్రాలు చేసి భూమిమీద అగ్ని గుండాలు సృష్టించడానికి, టోర్నడోల వంటి బీభత్సాలను నియంత్రితంగా అనేకమైళ్ళదూరంనుంచీ సృష్టించడానికీ, ఇంకా ఏ ఏ విధములుగా ప్రకృతిని మానవ వినాశనానికి వాడుకోవచ్చునో ఇప్పుడిప్పుడే సాధారణ ప్రజానీకానికి కూడా తెలియవస్తున్నది. ఎక్కువగా వాతావరణ పరిశోధనా ఫలితాలు రక్షణ పథకాలకు వినియుక్తం అవుతున్నాయి. రక్షణ ఒడంబడికలు, ప్రచ్ఛన్న యుద్ధజ్వాలలు వాతావరణాన్ని గురించిన సమగ్ర పరిజ్ఞానానికి అవసరమైన కృషికీ వనరుల కేటాయింపుకూ దోహదం చేస్తున్నాయి. ప్రపంచ ఆహార పరిస్థితులు సక్రమంగా లేవని రాబోయే కొన్ని సంవత్సరములలో మరింత తీవ్రమైన కాటకముల నెదుర్కోవలసి వస్తుందనీ హెచ్చరికలు వెల్లడవుతున్నాయి. ఎందువలన ప్రాథమిక అవసరముల విషయంలో కూడా మన ప్రయత్నం మన విజ్ఞానము కొరవడుతున్నాయి? ఒక విషయం గుర్తుంచుకోవాలి. వాతావరణంలో వచ్చే అకస్మాత్‌తీక్షణ పరివర్తనలను నివారించడం యిప్పటి వరకే కాదు వచ్చే కొన్ని దశాబ్దాలవరకూ అసాధ్యం అన్న విషయం అంగీకరించక తప్పదు. అటువంటి సంఘటనలను వాటి ప్రభావాలను విశ్లేషించి వాటిని ఏ విధంగా మానవ ప్రయత్నంతో సృష్టించవచ్చును అనే విషయం మీద విపరీతమైన స్థాయిలో ప్రయోగాలు జరుగుతున్నాయి. అందువలన, ఎప్పటికైనా ముచ్చుందు రాకుండా ప్రకృతి నరికట్టడానికి కావలసిన విజ్ఞానం లభ్యమయ్యే అవకాశం వున్నదా? లేకుంటే వాతావరణ ప్రయోగాలు మానవ వినాశనానికి మరొక యుద్ధ తంత్ర విజ్ఞానానికి మాత్రమేనా? అనే అనుమానం రాక తప్పదు. నియంత్రిత వాతావరణ పరిస్థితులలో పంటలను పండించడానికి కొన్ని ప్రయోగాలు జరిగాయి. ప్రయోగాల స్థాయిని దాటి వుత్పత్తి విధానాలుగా కూడా అనుసరించబడినట్లు తెలుస్తుంది. వెలుతురు, తేమ, వర్షపాతం లేక యితర విధములుగా నీటి సరఫరాలను నిర్ణీతమైన స్థాయికి నియమబద్ధంచేసి కూరలు, పండ్లు పండించడానికి ప్రయత్నాలు జరిగాయి పెద్దపెట్టున యిటువంటి పద్ధతులు అనుసరించడానికి అవసరమూలేదు, అవకాశమూలేదు. ప్రతి ప్రాంతంలోనూ వ్యవసాయకార్యక్రమం అక్కడిసహజపరిస్థితులను బట్టినిర్ణయింపబడివుంటుంది ఎప్పుడో అరుదుగా తటస్థించే వికృతమైన మార్పుల ప్రభావం నిరోధించడానికిగానీ, సహజస్థితిగతులకు అనువుగాని ఆర్థిక కార్యక్రమాలు తలపెట్టడంగానీ ఊహాతీతమైన వ్యయప్రయాసలతో కూడిన పని. ఎటువంటి ఆర్థిక వ్యవస్థకైనా తలపెట్టలేని భారం. అయితే అటు

వంటి మార్పులను గురించిన సక్రమ సమాచారం ముందుగానే లభ్యమైతే కొన్ని రకాల నష్టాన్ని నివారించవచ్చు. పంటకొచ్చిన పైరులుంటే యింటికి చేరవేయవచ్చు. మనుషులు, పశువులు బతుకులు గట్టున వేసుకోవచ్చు. ఇతర వస్తువులూ వంగుడూ రక్షించుకోవచ్చు. అంతకన్న మరేమీ సాధ్యం కాదు. విచిత్రమేమిటంటే మనదేశంలో ఒరిస్సా, కోస్తా ఆంధ్రప్రాంతాలు తరచుగా తీవ్రమైన తుపానుల తాకిడికి లోనవుతున్న ప్రాంతాలు. వాతావరణ విజ్ఞానంవలన యీ వుపద్రవాలేమీ తగ్గినట్లు తోచడంలేదు సరిగదా మరింత తరుచుగానూ ఉధృతంగానూ వస్తున్నట్లు తెలుసు. 1977 నవంబరు నుంచీ మూడు సంవత్సరాలు వరుసగా ప్రళయోత్పాతం సంభవించినట్లు తెలుసుకున్నాం. చూచినవాళ్ళను చెప్పమని కూడా అడగలేని స్థితిలో వుంచి నవీ వుత్పాతాలు. మాగెకెన్(II) తర్వాత వేసవిలో (1979) తుపాన్లువచ్చిన విషయంకూడా ఆంధ్ర ప్రజలు యింకా మరువలేదు. ఒరిస్సా తీరంలో, కటకం బాలశౌర్ జిల్లాలలో, తరుణంలో హెచ్చరికలు చేసేందుకు తగినపరికరాలుకూడాలేవు యిటీవలి వరకూ. అక్కడి సముద్రం చొచ్చుకుని భూమిమీదకు వస్తున్నట్లు మరి కొన్ని పరిశోధనా ఫలితాలవలన వెల్లడవుతున్నది రక్షణ దృష్ట్యా చూచినాకూడా, ఆర్థిక పరిస్థితుల సంగతి ఎలా వున్నా, మన విజ్ఞాన శాస్త్రవేత్తలు దేశ సమస్యలపట్ల తమ అవగాహనలో సరైన అంగీకారానికి రాలేదని అనుకోవచ్చును.

23. బృహత్తర పథకాలు, ప్రాజక్టులవలన సమిత ప్రాంతాలు పరిసరాలు కొద్దిపాటి మార్పులు చెందే అవకాశం వున్నది. నదీలోయ ప్రాజెక్టుల వద్ద విశాలమైన నీటి రిజర్వాయర్ల వలన, లోహకర్మాగారాలు విద్యుదుత్పత్తి కర్మాగారాలు నెలకొల్పినచోట్ల సగటు వుష్ణోగ్రత, గాలిలో తేమ కొన్ని దీర్ఘకాలిక మార్పులకులోనయినట్లు ప్రజల అనుభవం తెలుపుతున్నది. అయితే యీ కార్యక్రమాలు వాతావరణాంశాలను దృష్టిలో వుంచుకుని నిర్ణయించడానికి అవకాశం తక్కువ. జనసాంద్రత హెచ్చుగా గల పెద్ద పెద్ద పట్టణాల సమీపంలో భారీ పరిశ్రమలు నెలకొల్పడం మీద ఆంక్షలున్నాయి. ప్రజల ఆరోగ్యం దృష్ట్యా పరిసరాల శుభ్రత దృష్ట్యా తీసుకునే చర్యలు అవి మనం విశ్లేషిస్తున్న వాతావరణాంశాలలో ఒక స్వల్ప భాగానికి చెందిన విషయం అది నదులున్న చోట, గనులున్న చోట ప్రాజక్టులు చేరక తప్పదంలేదు అదే విధంగా సాలు పొడుగునా పైరులుండే భూముల పరిసరాలలోకూడా "సహజ" వాతావరణ లక్షణాలలో కొన్ని మార్పులు వస్తున్న విషయంగోచరం. వ్యవసాయోత్పత్తి విధానాలు కార్యక్రమాల వలన, ఆనుషంగికంగా అంతు, పరోక్షంగా అనండి సిద్ధించిన ఒక రకమైన మార్పు యిది. సాంఘిక సంబంధాలు, ప్రజల జీవన విధానాలలో వచ్చిన మార్పులు ప్రత్యక్షగోచరములే వాతావరణ కాలుష్యానికి, దోహదకరంగా సహజ జీవసంపత్తి సమతౌల్యానికి వ్యతిరేకంగా రూపొందే కార్యక్రమాలు తప్ప స్వల్పమైన దీర్ఘకాలిక పరిణామానికి లోనయ్యే విషయాలను గురించి ఆర్థిక విధానాల నిర్ణయంలో పరిగణన యీయవలసిన అవసరం లేదు.

20. ప్రకృతి తన లయతో తాను సాగుతూ వుంటుంది. ప్రజల యిష్టానిష్టాలతో దానికి ప్రమేయంలేదు. సరైన అవగాహన వుంటే మానవుని మనుగడను భోగంతో రసవత్తరంగా క్షేమంగా మలుచుకోవచ్చు. పూర్వం ఖగోళ శాస్త్ర విజ్ఞానంతో మీనమేషాలుగుణించివర్షపాతవువివరాలు దాదాపు ఖచ్చితంగానే నిర్ణయించగలిగాం. ఇప్పుడుకూడా నిజాయితీతో గుణించే పంచాంగాలలో వర్షపాతం, వుష్ణోగ్రత వంటి వాతావరణ వివరాలను ఎన్నో నెలలు ముందుగానే ప్రకటించగలుగుతున్నాం ఉపగ్రహాలు, వాతావరణ పరిశోధనా కేంద్రాలు సమీకరించే వివరాలలో వర్షపాతం వుష్ణోగ్రత లక్షణాలు ప్రకటించడం సహజ పరిస్థితులకు ఎక్కువ పూర్వం సాధ్యం కాకపోయినా, పూర్వదీర్ఘ కాలిక గణాంక వివరాల విశ్లేషణలోనైనా మన విజ్ఞాన శాస్త్రవేత్తలు ఎందుకు ప్రకటించడంలేదు? వర్షపాతం గురించి సిద్ధాంతుల అంచనాలు వాతావారణ శాస్త్రజ్ఞుల అంచనాల కంటె ఎక్కువ పొరపాట్లకు ఆస్కారం యివ్వడం లేదంటే ఏమనుకోవాలి? వైజ్ఞానిక కృషిమీద పరిశోధనలమీద మనం చేస్తున్న ఖర్చు నిరర్థకమనా, ప్రాచీన విజ్ఞానాన్ని నిర్లక్ష్యం చెయ్యకుండా పదిలంచేసి తరతరాల సక్రమింప జెయ్యాలనా, రెండునా? అవకాశాలు, జీవన విధానాల మీద ఆసక్తుల దృష్ట్యా రెండు పద్ధతులమధ్య వైరుధ్యం వుండవచ్చు. తాత్కాలికంగా, సాంప్రదాయిక విజ్ఞానాన్ని ఆధునిక వ్యవస్థలోకి నాటడం

ఎంత కొంత సహాయం చెన్నుత్యాన్ని సర్జించే అవకాశమూ వున్నది. కానీ క్రమేణా దాని విలువను నిలుపుకో గలుగుతుంది. దశాబ్దాల జీవితపు అనుభవసంచయాలని నెమరు వేసుకుని ప్రకృతి బీభత్సాల క్రమాన్ని ఉటంకించగలుగుతున్నారు నిజమైన రైతులు.

31 ఆర్థిక ప్రణాళికలను ఎంత శాస్త్రీయంగా ఎంత ఖర్చుతో రూపొందించుకున్నా వాతావరణ పరిస్థితులలో అనివార్యంగానూ, కొంతవరకూ క్రమబద్ధంగానూ వచ్చే వైపరీత్యాలను వాటి ప్రభావాలను దృష్టిలో వుంచుకుని తగిన ఏర్పాట్లు చెయ్యకపోతే అనుకున్న అంచనాలు తారుమారవుతాయి. ఇది 31 సంవత్సరాల అనుభవం నేర్పిన పాఠం పొరపాట్లు ఎక్కడ జరిగాయో అని అంకెలు తిరగవేయడం వల్ల, విదేశ సహాయాల కోసం ఆశించడం వల్ల నిజాన్ని మరిచిపోయి మరింత పొరపాట్లు చెయ్యడమే అవుతుంది.

కృషితో నాస్తి దుర్భిక్షమ్

* "వర్షం" అన్న శీర్షికను సూచించిన శ్రీ ఇలపావులూరి పాండురంగారావుగారికి నా కృతజ్ఞతలు.

# పాడుదాం రండి ఉగాది పాట

శ్రీ తిరునగరి

నిన్న మొన్న వణికించిన నృశంస శైశిరం
నేడు చిత్తగించింది చెప్పకుండా పలాయనం
ఊహ కెక్కడిదీ గుండెలో ఆనందం
ఇదిగో కనిపిస్తోంది ప్రకృతిలో నవ్యసౌందర్యం
పరిమళిస్తోంది పూలగుత్తులతో ప్రతిరసాలం
అరుణారుణంగా పూస్తోంది అడవిలో ప్రతిపలాశం
ఎలుగెత్తుతోంది కొమ్మకొమ్మకో పుంస్కోకిలం
కిలకిలారావంచేస్తోంది చెట్టుచెట్టుకో కీరం
పచ్చని మధువనాల్లోకి
లక్షల పక్షులుస్వాగతగీతాలుపాడగా
ఆగమిస్తున్నాడు
చైత్రరథస్వామి
వెంట తెస్తున్నాడు జనావళికి
సౌఖ్యామృతాన్ని
దుందుభిధ్వానాలు చేస్తూరండి
'దుందుభి' వత్సరాన్ని అవనికి తెస్తున్న
శ్రీ వసంతస్వామికి స్వాగతార్చన చేద్దాంరండి
ఈ ఉగాదివేళ
ద్వేషాల్ని, దోషాల్ని పాతేయండి
కష్టలహూకార్పణ్యాలనూ కాల్చేయండి
నవయుగానికి వేద్దాంరండి నేడేవెలుగుబాట
నవోత్సాహంతోమనమంతాపాడుకుందాం
రండి ఉగాదిపాట!

# వీడ్కోలు పలుకు

కీ. శే. బుఱ్ఱా శేషగిరిరావుగారు

## I

త్రొల్లి చదువుల కెల్ల మొదలై
కల్ల చదువులకెల్ల పులియై
తల్లి భారతియుల్లమల్లుక
తనయులను బ్రోవన్–
బ్రముక్కి–
–చక్కగ మనసుకెక్కిన।
సాహితీసాధననిధానము।
నక్కరగ నిరు–వత్సరంబులు!
సేమముగనేర్చి–
స్నాతకులరై చాలశుభముల
సాంప్రతముసాధింపసాగెడు
సాహితీ సుకుమారవరులకు
వీడుకోల్పలుకు॥

## II

విజయనగరపు వింత యొజ్జల।
పజ్జనుంటిరి వినయముగనే।
విసుగు లేకను రెండు పంటలు।
వింత మనుషులు వీరలైనను।
నాటకములాడింపజాలరు।
వాటముగవాదింప జాలరు।
గోటుగా నధికారగర్వము!
గోచరింపగనైననేర్వరు!
ఆటతేటల నారితేరరు!
వీరి వెఱ్ఱులు వీరివేను!
వెఱ్ఱులై తేనేమిపోయెను?
వెఱ్ఱిమొఱ్ఱీవేషములకై–వెదుకులాడగవేళలేనా!
కవితసుఖువులు గాంచవలెనోయి!
కావ్య పట్టంగట్టవలెనోయి।
సాహితీసుకుమారతకు నిది।
సార్ధకంబోయీ।

## III

దేశకాలముసంప్రదాయము–దీక్షభేదము కవి
మనంబును।
హావభావము రసావేశము–కవితలను ప్రత్యేక
పరచును।
రంగురంగులగాజుగోళము–తెలివెలుంగును తీ
ర్చులాగున॥
రంగురంగులగాజుచక్రము–తిరిగితిరిగితిరిగిమరలగ।
రంగులన్ని కలిసి తెలుపై–వెలుగురీతినికవితచిత్రప్రభ।
నిత్య ధావళ్యము వెలుంగును–కాలచక్రము తిరుగగా॥

## IV

భారతికి పలుతొడవులున్నవి
రాగరంజితసుతకృతంబులు
పాట పద్యము పటముప్రతిమలు
పెద్దపిన్నలనీ॥
భావములు హృదయమున మెరయగ।
మెరుపులోనే మలచునొకకవి।
ధారణకు ధృతిచాలమని జీ
వితపు చీకటిలో।
మెరుపుసొమ్ములివంచు నిరసన
జేయబోదా భారతీసతి
విమల మణి మంజీరములుగా।
నెంచునేగాని॥
చదువులొకవిధి సాగిపోగా
సాముగరిడీలాగిపోగా।
నిండుసంసారముల నిల్పగ।
నిలువనీడయు బలముకోరగా।
ధృతులుచెదరగ–కలత లలలై
యిరులవారిధి–వెల్లివిరయగ
తొల్లిధారణ చేసియుంచిన
మెఱుపు కవితలె యెరుక మెరయును।

వర్తకుల ముఖ్య గమనిక ! స్టెయిన్‌లెస్ స్టీల్ క్రోకరి, జనరల్ కిరాణా వర్తకులు, ఎలెక్ట్రికల్ మరియు డిపార్టుమెంటల్ స్టోర్స్-ఆసక్తి గలవారు ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని జిల్లాలలో డీలర్‌షిప్‌వివరాలకోసం వ్రాయండి.



డా॥ యమ్. ప్రభాకరరెడ్డి

సమర్పించు

శ్రీ విఘ్నేశ్వర ఆర్ట్ పిక్చర్స్

# గృహప్రవేశం

నిర్మాత

యడవల్లి విజయేంద్రరెడ్డి

స్క్రీన్‌ప్లే- దర్శకత్వం

బి.భాస్కరరావు



నైజాం ఉషాఫిలింస్

మెఱుపు లేడుట బాట బయలౌ।
మెఱుపు కవితల నెరుగ దగదా
సాహితీవరులు?

## V

జీవికిహపర జన్మములలో
కాలవాహిని తీరములలో
మదిని నెలిచిన హావభావపు
చిత్ప్రకాశము చిందులై
పాట పద్యం పటం ప్రతిమలు
పలు తెరంగుల ప్రబలియుండును
కాలపరిమితిలో॥
పటము పాటల ప్రతిమ శోభల
మాట కూటము లందు మలచును
సాటికవులకు చుట్టు గీటగు
మేటికవియొకడు॥
పిన్న వాడా కన్న వాడా!
జాతివాడా పాటివాడా।
చిన్న ముదియా యన్న మిన్నా।
సాజకవియా-యోజగలడా।
విభవవిభుడా-వినుతయశుడా।
మూలమూలల-ముతుకువాడా।
వివిధవిద్యల-వల్లభుండా।
విద్యనేర్వని-లాలసుండా!
ఎవ్వడై తేనేమియాయెను?-ఎన్నికై
తేనతని శిల్పము
శిల్పమందలి చిత్ప్రకాశము-
చిత్త మరికడితే॥
శిల్పవిరహితమైన కల్పన-చిల్లిగవ్వకునైన
చెల్లదు ।
శిల్పమనగా చిద్విభాసము
చికిలి కాదోయీ॥
మాటమీదను మాటపేర్చితె
యిటికెపోగై విరిగిపోదా?
రంగుమీదను రంగుపులిమితె,
రమణికాగలదా?
సరస విరసము లరయకుండా
స్వరముతోడను స్వరముకూర్చితె
పాటగాకది చెవికిపోటై
విరసమై పోదా?
మాటనీటుల మాయమర్మము
వాక్యసుమమాలికలపరిమళ
మరసి పదవాక్యప్రమాణము
తెలిసి రూపుల మలచి మనముల
కింద్ర జాలపు దివ్యసౌఖ్యము
లింతలో గలిగించు కవితా

పట్ట భద్రుల కట్టులోకిట
రెండు వర్షములుంత్రిదీక్షక
నింద్ర జాలపు కట్టు విడెనిక
స్నాతకులుకాఁగడువు వచ్చెను।
కోరినపుడీ యింద్రజాలపు
కవులమంత్రములుండు మీమది।
యెంతగాదీ దీక్ష ఫలితము।
లిదియె గురికాదా॥
తేరగానీ యింద్రజాలము
కోరగాని విద్యవిభవము
జీవితములో పరుగువారికి
మెర్గయ బోదయ్యా॥
సాహితీసుకుమార—
యిహమున
మోహజలదిని—శోకతరగల।
కష్ట వీచీపరంపరలను
కలయదాటగ కలంబిదియే।
కంటివా లేదా?
పిన్న ఖిన్నునికిట్నుత్రోచెను।
మారుఖాత్ముని షెల్లి దేల్చెను।
ముదితలో మినిసనుని గాచెను।
ముక్తి జూపెను బైరనునికై
దినమువెత్సముతేర నేరని—ధీరుశ్రీనాథార్యునిలిపెను।
బ్రహ్మతేజముగన్న మిల్టను—బాహ్యదృష్టికి వెలితిదీర్చెను।
హాళికత్వపువృత్తితో నిజ—గౌరవము గాపాడు
కొనగా!
పోతనార్యుని భక్తిముక్తిక—దారితానై నిలిచితేర్చెను!
లలితకవితాకళాస్థానికి—
కాళిదాసుని ప్రభువుచేసెను।

సాహితీ సుకుమార నీవటు
భారతి భక్తుడవు కావోయి।
సాహితీ తత్వార్థపరుడయి
యిహపరంబుల లావు గనవోయి

VI

కవితతెరవుల దిట్టదేరిన
కలంపడితే కాసుకరువా?
కవితతెరవులదిట్టదేరిన
పలుకుపలికితె మాట తిరుగా?
కవితశోభానియతిగల్గిన।
పలుకులే యస్త్రములుగావా?
కవితమర్మం తెలియవోయి
కావ్య పట్టం గట్టవోయి
కాసులేమనుగడయటంటే
కాలమర్మముగాంచకుండుట।
అర్థమే పురుషార్థ మంటే।
ఆర్య ధర్మంబూదిగలుపుట।
కవితతత్వముగానవోయి।
కలి విజృంభణ కడరకోయి।
ఆర్థికాంబుధి వీచికలలో
నడిగిమడిగి యంతరింపక
నాకసములో నెగిరియెగిరి
యెగిరిపారెడు పికము నీవై
జీవితావధి చేరవోయి
చిత్త శాంతిని చెందవోయి.
శుభములలరగ—విభవమమరగ।
గురుల యాశీర్వచన బలముగ
సాహితీసుకుమార నీవిక
వీరస్నాతక మందవోయి॥

[ఈ రచనని క్రీ. శే. బుర్రా శేషగిరిరావు గారి కుమారుడు డా॥ ప్రసాదరావుగారు శ్రీ ఆర్. పద్మనాభరావుగారికి ఇవ్వగా వారు మాకు పంపారు.—సంపాదకుడు]




మా ఖా తా దా రు ల కు శ్రే యో భి లా షు ల కు ఉ గా ది శు భా కాం క్ష లు




కళ్యాణి నట్ పౌడర్ వర్క్స్ రుస్తుంబాదు మచిలీపట్నం-521001 ప్రొప్రయిటర్: దేవు లక్ష్మీకాంతరావు

"శాస్త్రుర్లు"

## లుప్తమాసశషభిషలు

# ఇంద్రకంటి, పిడపర్తి పంచాంగ కర్తల ఘర్షణ

--నూరేళ్ళ నాటి ఉదంతం

"లుప్తమాసమును పమ్మున్ జేయవోరాడి... విశ్వపతి పాడాయెన్...."

-తిరుపతి వెంకటేశ్వరులు

నూరేళ్ళ క్రితం మాట!

గోదావరి జిల్లాలోని రామచంద్రపురం తాలూకాకు చెందినది కోట గ్రామం. ఆ గ్రామంలో ఇంద్రకంటి విశ్వపతిశాస్త్రిగారు సకలవిద్యా సంపన్నులూ, సదాశిష్యపరివృతులూను. ఒకనాటి సాయంకాలం గోధూళివేళ శాస్త్రిగారు, శిష్యులు సంధ్యావందనాదికాలు నిర్వర్తించుకుంటున్నారు. "విశ్వపతి శాస్త్రిగారూ!" అని జలద గంభీర స్వరంతో ఒక పిలుపు వినవచ్చింది శాస్త్రిగారి నయనాలనుంచి ఆజ్ఞ తీసుకొన్న శిష్యుడు, బ్రహ్మ తేజోసంపన్నుడైన ఆ బ్రాహ్మణోత్తముని లోనికి ప్రవేశపెట్టాడు. ఆయనను చూచిన తక్షణం శాస్త్రిగారు సంతోషముతో "ఓహో, సీతారామశాస్త్రిగారా! ఎంతటి అదృష్టవంతులం! మీ దర్శనం దొరికిన ఈరోజు చాలా సుదినం. దయచేయండి. ఎక్కడనుంచి రాక?" అన్నారు.

"బూరాడపేట అగ్రహారంనుంచేనండి" అని సీతారామ శాస్త్రిగారు సమాధానమిచ్చారు.

శాస్త్రిగారి సతీమణి తెచ్చిన దోసకాయ చెంబులోని ఉదకంతో పాద ప్రక్షాళన గావించి దంపతుల కుశల ప్రశ్నాదికములకు సమాధానము యిచ్చి అరుగుపైనున్న చాప మీద కూర్చున్నారు, పిడపర్తి సీతారామశాస్త్రిగారు. జ్యోతిష సిద్ధాంతభాగంలో అసమాన ప్రజ్ఞావంతులూ వంశపరంపరాగత విద్యా సంపన్నులూను వారు. సిద్ధాంత భాగంలో వరాహమిహిర, భాస్కరాచార్య, గణేశదైవజ్ఞులకేమాత్రమూ తీసిపోరని దేశంలో పేరుగాంచిన అనుపమ విద్యావంతులు, అఖండకీర్తి సముపార్జితులూనైన పిడపర్తి చలమయ్య శాస్త్రిగారికి వీరు అనుజన్ములు.

ఆ రాత్రి భోజనానంతరం విశ్వపతి శాస్త్రిగారూ, సీతారామ శాస్త్రిగారు కూర్చుని మాట్లాడుకున్న విషయాల్లో మన కథకు సంబంధించినవి ఈ క్రింది రెండు.

మొదటిది: సీతారామశాస్త్రిగారు వచ్చే సంవత్సరం పంచాంగం పూర్తిచేసి కొన్ని ధర్మశాస్త్ర విషయాలను చర్చించి నిర్ణయం చేయడానికని సోదరుడు చలమయ్య శాస్త్రిని కలుసుకోడానికి దువ్వగ్రామం వెడుతున్నారన్నది.

రెండవది: రామచంద్రపురం రాజావారు వచ్చే సంవత్సరం పంచాంగం వ్రాసి ఇమ్మని విశ్వపతి శాస్త్రిగారిని కోరారని, అందుకు ఆయన తన కుమారుడైన రామశాస్త్రినీ, శిష్యుడైన వెంకటశాస్త్రినీ నియమించారన్నది.

ఈ సంభాషణంతా వింటూన్న రామశాస్త్రికీ, వెంకట శాస్త్రికీ ఒకేవిధమైన ఆలోచన తట్టింది. ఇద్దరూ ఆలోచించుకున్నారు. రెండుమూడు మాసాలు కష్టపడ నవసరంలేకుండా వారికివప్పచెప్పిన కార్యం పూర్తిచేయడానికి ఒక ఉపాయం తోచింది. చిన్న వయస్సుకల వారవడంచేత గ్రంథ చౌర్యంలోని దోషాతిశయాన్ని వారుగుర్తించలేకపోయారు.

మరునాడు ఉదయం విశ్వపతిశాస్త్రిగారు, సీతారామ శాస్త్రిగారు గోదావరి స్నానానికి కోటిపల్లి రేవుకు వెళ్ళివచ్చి దేవతార్చనాదికాలు ముగించి భోజనం పూర్తిచేసేప్పటికి, సీతారామశాస్త్రిగారి అంగవస్త్రంలో చుట్టివున్న పంచాంగానికి పూర్తినకలు తయారుచేశారు రహస్యంగా, ఇద్దరు ముగ్గురు ఇతర శిష్యుల సహాయంతో రామశాస్త్రీ, వెంకటశాస్త్రీ.

భోజనానంతరం కొంచెంసేపు విశ్రమించి సీతారామ శాస్త్రిగారు అందరివద్దా సెలవు తీసుకొని కోట గ్రామంనుంచి బయలుదేరి వెళ్ళారు.

## 2

భద్రాచల రాముని దర్శనం చేసుకుని రెండుమాసాలలో తిరిగివచ్చిన విశ్వపతి శాస్త్రిగారు తన కుమారుడు, శిష్యుడు తయారుచేసిన పంచాంగం చూచి వారి ప్రజ్ఞకు చాలా సంతోషించారు. ఏదో తిథుల వరకూ పూర్తి చేసి ఉంటారేమోనని అనుకొన్న శాస్త్రిగారికి గ్రహస్ఫుటాలు, సుముహూర్తాలు వగైరా యావత్తు గ్రంథం సిద్ధం కావడం చూసేసరికి ఆనందం పట్టలేక కుమారుణ్ణీ, శిష్యుణ్ణీ చాలా అభినందించారు.

వెంటనే ఒకశుభముహూర్తాన ఆ పంచాంగం తీసుకొని పోయి రామచంద్రపురంలో రాజా వారికి సమర్పించేరు శాస్త్రిగారు నిండుదర్బారులో. రాజావారు చాలా సంతోషించి శాస్త్రిగారిని ఉచితరీతిని సత్కరించారు. ఆ సత్కారాలందుకొని సంతోషంతో తన్మయులై వున్న శాస్త్రిగారితో దివానుగారు: "శాస్త్రిగారూ! వచ్చే సంవత్సరం విశేషాలేమైనా కొంచెం రాజావారికి వివరించండి" అన్నారు.

"ఆ! ఏమున్నయ్యండీ మామూలే" అంటూ విశ్వపతిశాస్త్రిగారు వర్షయోగాలూ, పంటల పరిమితీ, ధరవరలూ వగైరా వివరిస్తూ ఒక్క అర్ధగంటసేపు ప్రస్తావించారు.

అప్పటికే రాజావారి ఆస్థానానికిపిడపర్తి చలమయ్య శాస్త్రిగారు వ్రాసిన పంచాంగం ప్రతి చేరింది. ఆస్థాన జ్యోతిష్కులు ఆ పంచాంగాన్ని చూచి అందలి విశేషాలను ఇదివరకే రాజావారికి సమగ్రంగా తెలియపరచి ఉన్నారు.

అందువల్ల విశ్వపతిశాస్త్రిగారు చెప్పినదంతా విన్న రాజావారికి అందులో లుప్తమాసం ప్రస్తావన రాకపోవడం చాలా వింతగా తోచింది. వెంటనే శాస్త్రిగారిని ఉద్దేశించి వారిట్లా అన్నారు:

"ఏమండీ శాస్త్రిగారూ! వచ్చే సంవత్సరం లుప్త మాస మున్నదట కదా?"

"ప్రభువులు మన్నించాలి తమరెవరో తప్పుగా విన్నవించారు" అన్నారు శాస్త్రిగారు.

"కాదండీ. వచ్చే సంవత్సరం లుప్తమాస మున్నదట. శాస్త్రప్రకారం అదిసమ్మతం కూడానట."

"అది శుద్ధ అబద్ధం మీకు ఎవరు మనవి చేశారోకాని, అది శాస్త్ర విరుద్ధమైనది శాస్త్రప్రకారం చూచినట్లయితే వచ్చే సంవత్సరం లుప్తమాసం లేదు," అన్నారు శాస్త్రిగారు.

"అదేమండి అల్లా అంటారు! పిడపర్తి చలమయ్య శాస్త్రిగారే లుప్తమాసమున్నదని వ్రాశారు మీరుకాదంటే పోతుందా?" అన్నారు ఆస్థాన జ్యోతిష్కులలో ఒకరు.

శాస్త్రిగారికి గుండెల్లో రాయి పడింది. అయినా ధైర్యంగా ఇల్లా అన్నారు:

"చాల్లెండి. మహా తెలిసినట్లు చెపుతారేమిటి? మీకేమితెలుసు సిద్ధాంత భాగం? సూర్యసిద్ధాంత ప్రకారం పంచాంగం చేస్తే లుప్తమాసం రానేరాదు. చలమయ్యశాస్త్రి తప్పుడుత్రోవ త్రొక్కడు. అందువల్ల అతనికి లుప్తమాసం వచ్చిందేమో!"

"చలమయ్య శాస్త్రిగారు త్రొక్కిన తప్పుడు త్రోవ ఏమిటండీ?" అన్నారు రాజావారు ఆశ్చర్యంగా.

"చిత్తం, మనవి చేస్తా. సూర్యుని చేత మయునికి ఉపదేశించబడినదే సూర్యసిద్ధాంతం. ఇది మూడువేల సంవత్సరాలకు పూర్వమే వాడుకలో వుండేదని ప్రతీతి. అటువంటి అతి పవిత్రమైన గ్రంథాన్ని పట్టే మనం పంచాంగం చేసుకుంటున్నాము. మనది కర్మభూమి మనకుకర్మప్రధానం. అందువల్ల మనం సూర్యోపదిష్టమైన గ్రంథరీత్యా

తయారయిన పంచాంగమునే అనుసరించాలి. చలమయ్య శాస్త్రి సంస్కర్త. ఈ సూర్య సిద్ధాంతంలోని పథకాలను తనకు ఇష్టము వచ్చినట్లు సంస్కరించి పంచాంగం చేస్తాడు. అవి శాస్త్ర సమ్మతము లెట్లా అవుతాయి? ఎవరికి ఇష్ట మొచ్చినట్లు వారు సూర్య సిద్ధాంత పథకాలను సంస్కరించేయడమే? దానికి తాహతు ఉండవద్దా? పూర్వం కొంతమంది సంస్కరించారంటే, వారి ప్రతిభముందు మన ప్రజ్ఞ ఏ మాత్రం? అందువలన చలమయ్యశాస్త్రి వ్రాసినది శాస్త్ర సమ్మతం కాదని మనవి చేస్తున్నాను," అన్నారు శాస్త్రిగారు గంభీరంగా.

"శాస్త్ర సమ్మతం కాని సంస్కారం చలమయ్య శాస్త్రి గారు మాత్రం ఎందుకు చేస్తారండి? అయినా యీ విషయాలలో అభిప్రాయం వెలిబుచ్చడానికి మేమూ మా బోంట్లు అర్హులం కాము." అన్నారు రాజా వారు చిరునవ్వుతో.

ఆ నవ్వు చూచి ధైర్యం కలిగి, "ప్రభువువారు మన్నించాలి. ఎప్పటి కప్పటికి గ్రహాలను దృక్సిద్ధం చేయడానికి సంస్కారం చేయవచ్చుననీ, అది శాస్త్ర సమ్మతమైనదేననీ పూర్వ గ్రంథాలనుంచి ప్రమాణాలను ఇతోధికంగా చూపిస్తూ చలమయ్య శాస్త్రిగారు ఒకసారి రాజమహేంద్రవరంలో ఉపన్యసించారు. ఏమి పాండిత్యము! ఏమి వాగ్ధాటి! సాక్షాత్తూ సూర్యాంశ సంభూతులు ఆయన. ఆ సభకు కాకతాళీయంగా నేనూ వెళ్ళడం జరిగింది. అది నా అదృష్టం. సంస్కరించడమే శాస్త్ర సమ్మతం కాదనడం భావ్యంకాదని నా మనవి," అని ఆస్థాన జ్యోతిష్కులలో ఒకరు కొంచెం ధైర్యంగా అన్నారు.

రాజావారు చిరునవ్వుతో విని, విశ్వపతిశాస్త్రిగారివైపు దృష్టి మరల్చారు. విశ్వపతిశాస్త్రిగారికి సమాధానం చెప్పక తప్పింది కాదు.

"ప్రభువు వారికి నే విన్నవించేది ఒక్కటే విషయం. మనది కర్మభూమి మనం సూర్య సిద్ధాంతప్రకారం చేసిన పంచాంగాన్ననుసరించి కర్మ నాచరిస్తేనే దాని ఫలితాన్ని పొందగలం అంతే కాని ఎవరికి తోచినట్లు వారు పంచాంగాలు చేసే వాటిననుసరించినవాళ్ళు కర్మభ్రష్టులుకావడం తథ్యం. గ్రహాలలో ఏ సంస్కారాలు చేసినా, సూర్యచంద్రుల్లో చేసిన సంస్కారం మాత్రం పూర్తిగా తిథులను మార్చేస్తుంది. చలమయ్యశాస్త్రి చంద్రుడికికూడా సంస్కార మవలంబిస్తారు. ఇది బొత్తిగా శాస్త్రవిరుద్ధమని మనవి చేస్తున్నాను," అని సమాధానం చెప్పారు శాస్త్రిగారు.

"ఏమో ఈ ధర్మశాస్త్ర విషయాలు మాకు అవగాహన కావు అయినా చలమయ్యశాస్త్రిగారిలాంటిపండితులు మన దేశంలో చాలా అరుదు. అటువంటివారు అవలంబించిన తీరు శాస్త్రసమ్మతం కాదనడం కొంచెం సాహసమేమోనని నా ఊహ" అన్నారు రాజావారు.

"ప్రభువులు తమ ఆస్థాన విద్వాంసులనూ వారి విద్వత్తునూ కించ పరుస్తున్నారు. ఏ విషయంలోనైనా సరే చలమయ్యశాస్త్రితోసమాన పాండిత్యంగలవారమని ఋజువు చేసుకోగలం" అన్నారు విశ్వపతిశాస్త్రిగారు.

ఏ విషయంలోనో ఎందుకు? ప్రస్తుతం ఈ విషయంలోనే ఇదమిత్థమని తేలకపోతే వచ్చే సంవత్సరం ఏ పంచాంగాన్ని అవలంబించడానికి సందేహంలో పడిపోతాం."

"చిత్తం. ప్రభువువారు ఈ విషయం పూర్తిగా విమర్శించి, తగిన ఏర్పాట్లు చేయించి ఒక నిర్ణయానికి వస్తే అందులకు చాలా అనుకూలంగా ఉంటుంది. అవసరమైతే చలమయ్యశాస్త్రి గారిని ఇక్కడికే పిలిపిద్దాం," అన్నారు దివానుగారు ఇంతవరకూ మౌనంగా ఉండి.

'ఆ ఏర్పాటు చాలా బాగుంది. ఏమండీ విశ్వపతిశాస్త్రిగారూ? చలమయ్యశాస్త్రిగారిని ఇక్కడకు పిలిపించి సభ ఏర్పాటు చేస్తాం. మీకు సమ్మతమేనా?" అన్నారు రాజావారు.

"చిత్తం. ప్రభువుల ఆజ్ఞ శిరసా వహిస్తాను."

అంతటితో ఆ రోజుకు ఆ ప్రస్తావన ముగిసింది.

## 3

తణుకు దగ్గరున్న దువ్వగ్రామంలో ఉంటూన్న చలమయ్యశాస్త్రిగారు రామచంద్రపురం రాజావారు రమ్మన్నారని తెలియగానే శిష్య సమేతంగా బయల్దేరి రామచంద్రపురం చేరుకున్నారు. జరగబోయే సభను చూడడానికి అనేక మంది అనేక ఊళ్ళనుంచి వచ్చారు. పండితులూ సిద్ధాంతులూ చాలామంది రామచంద్రపురంలో చేరారు. నిర్ణీత సమయానికి సభఏర్పాటయింది పిడవర్తి చలమయ్యశాస్త్రిగారు వచ్చే సంవత్సరం లుప్తమాసం ఉన్నదన్న వాదాన్ని సమర్థిస్తే, విశ్వపతిశాస్త్రిగారు దాన్ని ఖండిస్తున్నారు. ఇరువురూ మహా పండితులు. ఆ రోజులలో పాండిత్యం ఏ ఒక్క విషయానికీ చెందివుండేది కాదు. సర్వతోముఖ పాండిత్యం వారిది అందువలన చలమయ్యశాస్త్రిగారితో సమానమైన పాండిత్యాన్ని సిద్ధాంత భాగంలో చూపిస్తున్నారు విశ్వపతిశాస్త్రిగారు. ఈ విధంగా మూడు రోజులు కేసరిద్వయం హోరాహోరీని వాద ప్రతివాదాలతో పోరుసాగించారు. ఇందులోచలమయ్య శాస్త్రిగారు ఆయన స్వయంగా చేసిన పంచాంగాన్ని సమర్థించుకుంటున్నారు. విశ్వపతి శాస్త్రిగారు తాము తయారుచేయని పంచాంగాన్ని సమర్థించుకోవలసి వచ్చింది. రాజావారి దర్బారులో మ్యానుషాని కన్న మాటలేకాని, చలమయ్యశాస్త్రిగారి ప్రతిభ, పాండిత్యం విశ్వపతిశాస్త్రిగారికితెలియకపోలేదు. అందువల్ల ఆయన వాదంలో బాగా వెలితి కన్పడుతూనే ఉంది. అది చలమయ్య శాస్త్రిగారు కనిపెట్టారు. కాని ఇతరు లెవ్వరూ తెలుసుకోలేక పోయారు. వీరిద్దరూ వాదించుకుంటూ ఉంటే విని తీర్పు ఇచ్చే సామర్థ్యం కలవారెవ్వరూ అక్కడ లేక పోయారు. అందువల్ల ఎవరో ఒకరు రెండవవారి వాదం

లున్నను ఆడినమాటలకు కట్టుబడుట తప్పదు. యాతాయాతములు, మనఃక్లేశము తప్పదు. బహుళమున ఆరోగ్యము అంత బాగుండదు. బహుళమున శుభకార్యములకు ఆటంకములు కలుగును. అధిక ఫాల్గుణ శుక్లమున నిరుత్సాహమున్నను కార్యసాఫల్యత చేకూరును. బహుళమున విద్యార్థులకు, పరీక్షలు సులువుగా నుండును. ఆరోగ్యాదాయములు బాగుండును. నిజ ఫాల్గుణ శుక్లమున గౌరవము తీసుకొనును. పరీక్షలు సులువుగా నుండును. మనస్పర్ధలు తప్పదు. బహుళమున ఆదాయము బాగుండును. కార్యసిద్ధియగును. నిర్వేదము తప్పదు. ఈ రాశివారికి 3—10—22—29 తారీఖులు సోమ గురు వారములు ప్రశస్తము. పూర్వార్ధమున శనికి ఉత్తరార్ధమున ఉపదానములు అవసరం

మూలవారలకు: వత్సరమంతయు గురుడు పాపి. వత్సరాది ప్ర॥ 5—5—82కు ఓర్గి 30—7—82 లగా 2—12—82 వరకు శని పాపి. వత్సరాది ప్ర॥ 30—6—82 వరకు రాహువు పాపి. వత్సరమంతయు కేతువు శుభుడు.

పూర్వాషాఢ వారలకు :— వత్సరమంతయు గురుడు పాపి. 5-5-82 లగా 30-7-82కు శని పాపి. వత్సరమంతయు రాహు కేతువులు శుభుల.

## మకరము:- సౌరగోచారము (మకరమాసములో పుట్టినవారికి)

### చాంద్రగోచారము (ఉ.షా 2-3-4 పా. శ్రవ 4 పా ధని 1-2 పా)

వత్సరాది ప్ర॥ కార్తిక శు ౯ గురువారము (25—11—82 కు) 10. వ యింట గురుడు తామ్రమూర్తి సామాన్యుడు. తదారభ్యావత్సరము లాభమున గురుడు తామ్రమూర్తి అర్ధశుభుడు. వత్సరాది ప్ర॥ సంవర్పాశ్వయుజ బ ౮ బుధవారం (6—10—82) వరకు భాగ్యమున (9) శని సువర్ణమూర్తి అర్ధశుభుడు. తదారభ్య వత్సరమున 10వ యింట లోహమూర్తి పాపి శ్రమకారి ఈ వత్సరమంతయు రాహు కేతువులు 6—12 రాసులయందు సువర్ణమూర్తులు శుభుల వేధ గోచారముచే వత్సరమంతయు గురుడు పాపి. శని రాహు కేతువులు శుభులు. సంవత్సర సముదాయ ఫలం॥ స్థితిగోచారముకంటే వేధగోచారము మేలుగా నున్నందున వ్యవహారము లన్నియు నిలకడ మీద ఫలించును. తొలకరి కంటె పైరులు చక్కగా ఫలించును ఉత్తరార్ధమున గృహ నిర్మాణాది శుభములు జరుగును. విద్యార్థులు అక్టోబరు ఛాన్సులో ఉత్తమ శ్రేణిలో ఉత్తీర్ణులు కాగలరు ॥మాసవారీ ఫలితములు॥ చైత్ర శుక్లమున శ్రమ యధికము. కుటుంబ సౌఖ్యము తక్కువ. ఆరోగ్యము సుమారుగ నుండును. విద్యార్థులు కృషి ఎక్కువ చేయవలెను. బహుళమున శుద్ధమువలె నుండును. వైశాఖ శుక్లమున వ్యయమధికము. మనో వైకల్యము, ఆరోగ్యము సామాన్యముగ నుండును బహుళమున ఋణబాధ ఎక్కువగును. కుటుంబ సౌఖ్యము తక్కువ. పేచీలు తలయెత్తగలవు. జ్యేష్ఠ శుక్లమున మనోభీతి హెచ్చును. ఔషధసేవ యవసరమగును. బహుళమున ఋణబాధ హెచ్చును. విరోధములు, కీర్తిహాని ఆషాఢ శుక్లమున కొలది అనుకూల వాతావరణము కలుగును. ఆదాయము ఉత్సాహము కలుగును. బహుళమున అలంకారము. సుఖము మనశ్శాంతి చేకూరును. శ్రావణ శుక్లమున అనారోగ్యము. మనఃక్లేశము కలుగును. బహుళమున ప్రాతికూల్య మధికము. కుటుంబ కలహము, వ్యసనముల యందు ప్రీతి సంభవించును. భాద్రపద శుక్లమున సుఖసంతోషములు కలిగినను కొన్ని దురలవాట్లకు లొంగిపోవలసి వచ్చును. ఋణభార మతిశయించును. బహుళమున మనఃక్లేశ భయము లతిశయించును. కీర్తికి మచ్చవచ్చును. ఆశ్వయుజ శుక్లమున గృహ వ్యతిరేకత హెచ్చును. వ్యర్థ సంభాషణ వ్యవహారములకు దారితీయును. ఆరోగ్య భంగము కలుగును. బహుళమున కార్యవిలంబము, మనోదుర్బల్యము, తొలకరి పంటలో లాభము, వర్తకములో లాభ శాతము కలుగును. నిజాశ్వయుజ శుక్లమున వ్యయ ప్రయాసలు. అన్ని రంగముల యందు మందగమనము. స్వల్ప సుఖ సంతోషములు కలుగును. బహుళము శుద్ధమువలె నుండును. కార్తిక శుక్లమున తొలకరి ఫలించును. ఆదాయము బాగుండును. కుటుంబమున ఉల్లాసముగ నుండును. బహుళమున వివాహాది మంగళ కార్య ప్రయత్నములు నెరవేరును. అనుకున్నంత ధనము చేకూరును. ఉద్యోగులకు ప్రమోషనులు రాగలవు. మార్గశిర శుక్లమున వ్యయప్రయాసలతో శుభకార్యములు నెరవేరును. బహుళమున స్తబ్దత. వ్యయప్రయాసలకు లొంగిపోవుట, స్వల్పముగ కుటుంబ పేచీలు, ఆదాయము కలుగును. పుష్యమాస శుక్లమున ఆదాయము బాగున్నను దురలవాట్లు-దుర్వ్యసనముల వలన సంసారమున శ్రమ, వ్యయము తప్పదు, బహుళమున అకీర్తి, సంసారము నందు స్వేచ్ఛా ప్రవృత్తిచే శ్రమ తప్పదు. అధిక ఫాల్గుణ శుద్ధము నిరుత్సాహముగనున్నను, ఆదాయ సుఖసంతోషములు కలుగును బహుళమున లాభము మెండుగా నుండును. శుభకార్య ప్రయత్నములు నెరవేరును పరీక్షలతి సులువుగా నుండును. నిజ ఫాల్గున శుక్లమున శుభకార్య పరంపర, విత్రసల్లాపము, నూతన దేవతా దర్శనము కలుగును. బహుళమున శుక్లమువలె నుండును. ఈ రాశివారికి 4—11—23—30 తారీఖులు సోమ శుక్రవారములు ప్రశస్తములు. పూర్వార్ధమున గురు శనులకు సంగజప దానములు వత్సరమంతకి ప్రతి శుక్రవారం కుంకుమపూజ అత్యవసరము.

ఉత్తరాషాఢ వారలకు :— వత్సరమంతయు గురు కేతువులు శుభుల. 6—10—82 లగా ఆవత్సరం శని పాపి. 9—3—83 లగా ఆవత్సరం రాహువు పాపి.

శ్రవణం వారలకు :— వత్సరమంతయు గురుడు పాపి. శని రాహు-కేతువులు శుభులు.

ధనిష్ఠ వారలకు — 11—10—82 లగా 11—12—82 వరకు గురుడు శుభుడు వత్సరమంత శని రాహు కేతువులు శుభులు

## కుంభము : సౌరగోచారము (కుంభమాసములో పుట్టినవారికి)

### చాంద్రగోచారము (ధని 3-4 పా. శత 4 పా. పూ భా 1-2-3 పా)

వత్సరాది ప్ర॥ కార్తిక శు ౯ గురువారం (25—11—82) వరకు 9వ యింట గురుడు రజతమూర్తి శ్రీపదశుభుడు. తదారభ్య వత్సరము 10వ యింట గురుడు రజతమూర్తి అర్ధశుభుడు. వత్సరాది ప్ర॥ సంవర్పాశ్వయుజ బ ౮ బుధవారం (6—10—82) వరకు 8వ యింట శని లోహమూర్తి పూర్తి పాపి శ్రమకారి తదారభ్య వత్సరము 9వ యింట తామ్రమూర్తి సామాన్యుడు ఈ వత్సరమంతయు 5—11 రాసుల యందు రాహు కేతువులు తామ్రమూర్తులు సామాన్యులు. వేధ గోచారముచే వత్సరమంతయు గురుడు పాపి. శని రాహువులు శుభులు. 3—11—82 లగా ఆవత్సరం కేతువు పాపి ॥సంవత్సర ఫలం॥ పూర్వార్ధమున సామాన్యముగ నున్నను ఉత్తరార్ధమున శ్రమకు, తీవ్ర బాధలకు గురియగుదురు. తొలకరి కంటే పైరు వేలనిపించును ॥మాసవారీ ఫలితములు॥ చైత్ర శుక్లమున నిర్వేదము, వ్యయ ప్రయాసల మెండు. అయినను మంగళ కార్యములు నెరవేరును. కుటుంబ సౌఖ్యము కలదు బహుళమున శుక్లమువలె నుండును. వైశాఖ శుక్లమున శుభాశుభమిశ్రమము. వివాహాది మంగళ కార్యములు నెరవేరును. కొలది అనారోగ్యమున్నను లాభముగా నుండును బహుళమున నిరుత్సాహమున్నను ప్రయత్నము చేసి కార్యములను నెరవేర్చెదరు. శ్రమ-వేడి అధికముగా నుండును. జ్యేష్ఠ శుక్లము మన్నుకంటె విద్యార్థులకు సిద్ధమయ్యెదరు శత్రువుల ఒత్తిడి ఎక్కువగా నున్నను శుభకార్యములు ఫలించును. బహుళమున శుక్లమువలె నుండును ఆషాఢ శుక్లమున అవసరములకు ధనము చేతికందదు. అలసట హెచ్చు. పలుకుబడి తగ్గును. ఉష్ణాధిక్యము హెచ్చు. బహుళమున కూడ నట్లే యుండును. శ్రావణ శుక్లమున శత్రు విజయము. భూషణ ప్రాప్తి. గౌరవము. ఆదాయాభివృద్ధి చేకూరును బహుళమున దుర్వ్యసనములు-దుస్సహవాసము తప్ప మిగిలినదంతయు శుక్లమువలె నుండును. భాద్రపద శుక్లమున ఆరోగ్యము సామాన్యము. కీర్తి-పలుకుబడి సన్నగిలును. అవసరములకు ధనమందదు బహుళమున మనఃక్లేశము వ్యయప్రయాసలు మెండు. ఆశ్వయుజ శుక్లమున శుభకార్య విలంబము, వ్యయప్రయాసలు. ఆరోగ్యము సామాన్యము బహుళమున వ్యయప్రయాసలున్నను ఉత్సాహముగా నుండును శని మార్పు వలన సుఖము చేకూరును. నిజాశ్వయుజమున శుభ మార్పు అన్ని రంగములందు మార్పు వచ్చును. ప్రమోషనలు రాగలవు. సస్యాభివృద్ధి, యుత్పి

కృత కార్యసాఫల్యము. కార్తీక శుక్లమున అనుకూలముగ పనులు నెరవేరును. తొలకరి పంటలు లాభించును. బహుళమున శ్రమ యధికము. పలుకుబడి సామాన్యముగ నుండును. మార్గశిర శుక్లమున ఆదాయారోగ్యములు బాగుండును. శుభకార్య సూచనలున్నవి. బహుళమున ఖర్చు అధికము. శుభములు అగు సూచనలు కలవు. క్షయమాసమున వ్యయమధికము. ఆరోగ్యము సామాన్యము. శుభకార్యమున ఆలస్యము కలదు. క్షయ మాసమున వ్యయమధికము. అవసరములకు ధనముండదు. కుటుంబమున కలతలు చెలరేగును. అనుకూల్యత తక్కువ. నిజ ఫాల్గునమున మానసిక దౌర్బల్యము ఏర్పడును. నియమములకు కట్టుబడి యుండలేకపోవచ్చును. వ్యయప్రయాసలు మెండు. కుటుంబ సమస్యలు తలయెత్తగలవు. ఈ రాశి వారికి 5—12—24—31 తారీఖులు బుధ- నివారములు ప్రశస్తములు. ఈశ్వరాభిషేకము, నవగ్రహ జపము ముఖ్యము.

శతతార వారలకు — వత్సరాది ప్ర॥ 11—10—82 వరకు గురుడు శుభుడు 2—12—82 లగా॥ ఆవత్సరం శనిపాపి. వత్సరమంత రాహువుపాపి. వత్సరమంతయు కేతువుశుభుడు.

పూర్వాభాద్ర వారలకు — వత్సరమంత గురుడు పాపి. కేతువు శుభుడు వత్సరాది ప్ర॥ 5—5—82కు 30—7—82 లగా 2—12—82 కు పాపి॥ వత్సరాది ప్ర 30—6—82కు రాహువు పాపి.

## మీనము :— సౌరగోచారము (మీన మాసములో పుట్టినవారికి)

## చాంద్రగోచారము (పూ.భా 4వ పా. ఉ.భా 4పా. రేవ 4 పా)

వత్సరాది ప్ర॥ కార్తీక శు 6 గురు (25-11-1982) వరకు 8వ యింట గురుడు లోహమూర్తి పూర్తిపాపి ప్రమాది ఉదాభ్య వత్సరము 9వ యింట సువర్ణమూర్తి పూర్తి శుభుడు వత్సరాది ప్ర॥ సంసర్పాశ్వయుజ బ 6 బుధవారం (6-10-1982) పర్యం॥ 7వ యింట సువర్ణమూర్తి అర్ధ శుభుడు ఉదారభ్య వత్సరము 8వ యింట శని రజతమూర్తి పాదశుభుడు. ఈ వత్సరమంతయు 4—10 రాసులయందు రాహుకేతువులు రజతమూర్తుల సంచారము. వేధగోచారముచే 7-3-83 లగా॥ ఆవత్సరము గురుడు శుభుడు వత్సరమంత శని శుభుడు వత్సరమంత శని పాపి॥ సామాన్య ఫలము॥ పూర్వార్ధము చాల శ్రమగనుండును అనేక విషమ సమస్యలకు గురియగుదురు. ఉత్తరార్ధమున కొలది మేలనిపించును। విద్యార్థులకు రెండు ఛాన్సులు సఫలమే। శ్రమపడివ్యాపారము చేయవలెను. పైరుపంటలలో లాభమెక్కువగనుండును॥ మాసవారీ ఫలము॥ చైత్ర శుక్లమున గ్రహబలము తక్కువ పెలకువతో వ్యవహరించుట చాలమంచిది। మౌనము ముఖ్యము అనేక ఇరుకు సమస్యలకు అగచాట్లకు గురికాగలరు. బహుళమున కుటుంబ సౌఖ్యము తక్కువ పేచీలు తలయెత్తగలవు. పరీక్షలలో మెలకువ యుండవలె. వైశాఖ శుక్లమున మనోదౌర్బల్యము నిర్వేదము అతిశయించును ఔషధసేవ అవసరమగును। బహుళమున వ్యయమధికము। పలుకుబడి సన్నగిల్లును। ఆరోగ్యము పట్ల శ్రద్ధ యవసరము, జ్యేష్ఠ శుక్లమున కలహప్రియత్వము, అగౌరవమున్నను అవసరమునకు ధనము జాప్యముగా లభించును। బహుళమున శుద్ధమువలె నుండును। ఆషాఢమున, శత్రువృద్ధి, ఔషధసేవ, అపవాదలు కల్గును శ్రావణ శుక్లమున ఆషాఢమువలె నుండును. బహుళమున నిరుత్సాహము, అగచాట్లు, హాని అపకీర్తులు ప్రబలును భాద్రపద శుక్లమున ఆదాయము బాగుండును. అలంకార లాభము, శ్రమయధికము, నిర్వేదము ప్రబలును బహుళమున కొలది శాతమాదాయము తగ్గును. ఆశ్వయుజ శుద్ధమున ధన వ్యయమధికము బహుళమున మనోక్లేశము, కోర్టు దెబ్బలాడుట జరుగును. నిజాశ్వయుజ శుక్లమున అధికారుల మన్నన తక్కువ. కుటుంబసౌఖ్యము స్వల్పము. బహుళమున ఋణబాధ, పేచీలు, ఆదాయము తగ్గుట జరుగును. కార్తీక శుక్లమున గత 15 రోజులవలె నుండును. బహుళమున వ్యయప్రయాసలు కలిగినను అనుకూల వాతావరణము ఏర్పడును. శుభకార్య ప్రయత్నములు నెరవేరును. ఆదాయము మెరుగపడును. మార్గశిరమాసమంతయు పైరులు కలసి వచ్చును. శుభకార్యములు జరుగును. ధనలాభము చేకూరును. కుటుంబసౌఖ్యము కలుగును. క్షయ మాస పూర్వార్ధమున ఆదాయము పెరుగను ఉత్తరార్ధమున పలుకుబడి హెచ్చును. శుభకార్య సూచనలు కలవు. అధిక ఫాల్గున శుక్లమున ఆదాయము సామాన్యముగ నున్నను ఆరోగ్యముగ పలుకుబడి బాగుండును బహుళమున వ్యయము ఎక్కువ శుభవార్తలు మనశ్శాంతి, పరీక్షలలో సంతోషము కలుగును. నిజ ఫాల్గున శుక్లమున ఆదాయ వ్యయములు సమముగ నుండును। బహుళమున ఆదాయమధికము ఆరోగ్యము మేలు. శుభ కార్య నిర్వహణ జరుగును ఈ రాశి వారికి 1-6 13-25 తారీఖులు ఆది, గురు వారములు ప్రశస్తము పూర్వార్ధమున అను దినము నవగ్రహస్తోత్ర పారాయణ, ఆదిత్య హృదయ పారాయణ, నమకపారాయణ చేయుటవలన అష్టమ గురుదోషమునకు పూర్వార్ధమున గురుజపము, అష్టమ శని దోషము పోవుటకు ఉత్తరార్ధమున శని జపమవసరం.

ఉత్తరాభాద్ర వారలకు — వత్సరమంతయు గురుడు పాపి 5-5-82 లగా. 30-7-82 వరకు శని పాపి 30-6-82 లగా 9-3-83 వరకు రాహువుపాపి। వత్సరాది ప్ర 3-11-82కు కేతువు పాపి

రేవతి వారలకు :— వత్సరమంతయు గురుడు పాపి శని శుభుడు. 9-3-83 లగా ఆ వత్సరం రాహువు పాపి. 30-11-82 లగా ఆవత్సరం కేతువు పాపి

**N B** ఇందలి ఫలములను స్థితి గోచారవశమున, వేధగోచారవశమున, లగ్న నక్షత్ర గోచారముల ననుసరించి వ్రాసినాము ఇంకను అష్టకవర్గ గోచారమును, ప్రతి గ్రహము యొక్క స్థితిగోచారమును మేళవించి చూచుకొనిన ఋజువగును అఖిర పక్షము సౌరచాంద్ర గోచారములందునను మేళవించి చూచుకొనిన ఫలములు సరిపోవును

## క్షయాధి మాసకర్తవ్య నిర్ణయ సంగ్రహము

ముందుగ మాస లక్షణము వివరించబడుచున్నది. బ్రహ్మ గుప్తః॥ మేష గరవి సంక్రాంతిః శశిమాసే భవతి తత్ర చైత్రః। ఏవం వైశాఖాద్యావృషాది సంక్రాన్తి యోగేః॥ ఇ॥ బ్రహ్మ సిద్ధాన్తే॥ మేషాదిస్థే సవితరి యోయో మాసః ప్రపూర్యతే చాంద్రః। చైత్రాద్యస్సజ్ఞేయః పూర్తిద్వత్వే ఒధి మాసోన్త్యః॥ ఇతి॥ వ్యాసః॥ మీనాదిస్థో రవిర్యేషా ఆరంభః ప్రథమే క్షణే। భవేత్తుఒబ్దే చాన్ద్రమాసా శ్చైత్రాద్యా ద్వాదశస్మృతాః॥ ఇతి॥ మహాభారతే॥ మేషాదయో ద్వాదశస్య శ్చైత్రాదిషు యథాక్రమం। క్షయాధి కేష్వాగతేషు నియమోయం నలభ్యతే॥ ఇతి॥ కశ్యపోపి॥ సంక్రాన్తి యస్య మేషాద్యా శ్చైత్ర మాసాదిషు క్రమాత్। నియమేన భవేత్తత్రత్వధి మాసే సమాగతే॥ ఇతి॥ వాసిష్ఠే॥ చైత్రాది మాసేషు యథా క్రమేణ మేషాదయో ద్వాదశ రాశయస్స్యు। న్యూనాధి మాసేషు సమాగతేషు చలన్తితేభ్యో నియతిం వినాపి॥ కశ్యపోపి॥ యస్మిన్మాసే సంక్రాన్తిర్నా త్వాక్రుర పరం। దర్శమమల్లం ప్యభవతి సంసర్పాధిక మాసకః॥ఆరభ్య శుక్లప్రతి పతి ప్రవేశాత్సంక్రమద్వయం ఆగామీందు క్షయస్స్యాత్ త్వాగూనాఖ్యోం హస్పతిః॥ ఇతి॥ ఈ ప్రవణ వాక్యములను ఏక వాక్యత చేయుగ మీన మాసముతో ఆరంభించి మేష మాసముతో పూర్తి అగును చాంద్రమానమునకు చైత్రమాసమని పేరు। అనగా పూర్వా రాశిలో సూర్యుడుండగ ఆరంభించి తదనంతర రాశిలో సూర్యుడుండగ సమాప్తి చెందిన చాంద్ర మాసమునకు స్పష్ట మాసమని, శుద్ధమాసమని, నిజమాసమని పేరు. క్షయ మాసముగాని, అధిమాసముగాని వచ్చునప్పుడు ఈ పూర్వోక్త లక్షణము అచట వర్తించదని మహర్షులు చెప్పిన పై వాక్యములందు కలదు। ఏ చాంద్రమాసమునందు రవి సంక్రాంతి ఉండదో అది అధిక మాసమనియు, ఏ చాంద్రమాసమునందు రెండు సంక్రాంతులు సంభవించునో ఆ చాంద్రమానమునకు క్షయమాసమనియు అనాది కాలమునుండియు వ్యవహారము ఇంతేకాద —సూర్యసిద్ధాంత కల్పవల్లీ వ్యాఖ్యానమందట్లు కలదు. యస్మిన్నబ్దే హస్పతి స్పందృశ్యతే తత్రసంసర్ప ద్వితయ స్యాత్తస్మిన్నబ్దే కథం నియమః। అర్కేందు మాసయోగః ప్రాయకో దృశ్యతే యదా యదా కాన్త్యా। కుర్యాత్తద్వైవ మాసౌస సర్వాపష్టౌ వాసరౌ భవతః। యస్సంసర్పః పూర్వః సంసర్పాఖ్యస్స ఏవస్యాత్। అపరస్సంసర్ప స్స్యాదధి మాస స్తాత సశభధా। సౌరైందవయో స్సమ్యగ్భవంతి యోగాస్

ద్వాదర్శే। శేషాశ్శుభకిర్మార్హా మాసాః సర్వే భవంత్యేవ। యస్మిన్నబ్దే అసంక్రాంతి మాసద్వయ మంహస్పతిశ్చ దృశ్యంతే తత్రైవం కుర్యాత్। పూర్వసంసర్పస్య షష్టి దినకల్పనాం కుర్యాత్। ఉత్తరసంసర్ప స్యాపి షష్టి దిన కల్పనాం కుర్యాత్। అంహస్పతి మాసే మాసద్వయ నామాంకితే కృతేసతిశేషాణాం చాంద్రమాసానాం స్వకీయ పౌరమాస సంయోగ నియమస్సంభవతి॥ ఈ ప్రమాణములచే పూర్వసంసర్ప—క్షయమాసముల మధ్య యందున్న స్పష్టమాసములను అన్యథాగా గ్రహించ కూడదు। అనగా నిజాశ్వయుజ కార్తికమార్గశిర మాసములయందు తత్తన్మాస విహిత వ్రతములను చేయవలెను। ఈ పరిస్థితియందు వృద్ధకుమారీ వరిణయ న్యాయము ఇచట వర్తించదు॥ కాన సంసర్పాశ్వయుజ మాసమున-ఆశ్వయుజమాస వ్రతములను నిజాశ్వయుజమున కార్తిక మాస వ్రతములను-కార్తికమున మార్గశిరమాస వ్రతములను। మార్గశిరమున-పౌషమాస వ్రతములను-క్షయమున-మాఘమాస వ్రతముల నాచరించవలయునని చెప్పిన కృష్ణంభట్టు వాక్యము శాస్త్రసమ్మతము కానేరదు-సాధారణముగ (30) ముప్పది చాంద్రమాసముల కొక అధికమాసము వచ్చును। అపుడు ఎట్లు వ్యవహరింపవలెననగ ప్రమాణము॥ చాంద్రాధి మాసో ఒసంక్రాంతస్సంసర్ప నతిచోత్తరే। తస్మిన్నర్వాః ప్రయత్నేన పితృదేవాదికాః క్రియాః అనిగాల వచనము॥ అధిక మాసము నిజమాసము కలిపి 60 దినములు వచ్చినపుడు గర్గవచనము ఈ రీతిగ నిర్ణయించుచున్నది ఏవం షష్టిదినోమాసః కథితో బాదరాయణైః। పూర్వార్ధంతు పరిత్యజ్య కర్తవ్యా ఉత్తరే క్రియాః। స్మృత్యంతర వచనము ఆద్యోమలిమ్లుచోజ్ఞేయః ద్వితీయః ప్రాకృతస్స్మృతః। ఏవం షష్టిదినోమాసః తదర్ధంతు మలిమ్లుచః॥ త్యక్త్వా వ్రత దుత్తరే కుర్యాత్పితృదేవాదికాః క్రియాః॥ ఈ ప్రమాణముల ననుసరించి ప్రాయికముగ వచ్చెడి సామాన్య అధిమాసము వచ్చునపుడు మొదటి ముప్పదిరోజులను విడిచి ఉత్తరార్ధమునందు పితృదేవకృత్యము లను నిర్వర్తించవలయునని చెప్పుచున్నట్లు స్పష్టమగుచున్నది - ఏ సంవత్సరమున ఒక చాంద్ర మాసమునందు 2 (రెండు) రవి సంక్రాంతులు వచ్చుచున్నవో, ఆ చాంద్రమాసము మాసద్వయ సంజ్ఞకలదనియు, క్షయమాసమనియు చెప్పుచున్న ప్రమాణ వచనములు "సిద్ధాంత సార్వభౌమము నందు" కదాచిదీందు మాసకోయుతార్క సంక్రమ ద్వయః। ద్విమాస సంజ్ఞకః క్షయః క్షయాభిధోమునిస్మృతః। రత్నమాలయందు "యత్రమాసి సంక్రమద్వయం తత్రమాసయుగళం క్షయాహ్వయం" అని కలవు। అనగా సంక్రమణద్వయం [2] కల చాంద్రమాసము ఆయా సంక్రాంత్యవలక్షితమైన మాసద్వయాత్మకమనియు. క్షయమాసమనియు సిద్ధమగుచున్నది అట్టి క్షయమాసమువచ్చిన సంవత్సరమందు ఆ క్షయమాసమునకు పూర్వమందు ఒక అధిక మాసము పరమందొ అధిక మాసము వచ్చును। పూర్వమందువచ్చు అధికమాసము అవ్యవహితము గను-వ్యవహితముగను రావచ్చును అవ్యవహితముగ వచ్చునపుడు ఆ అధికమాసము 60 దినము లగుననను అవ్యవహితోత్తరమందగు యుగళీభూతాత్మమైన క్షయమాసమునందంతర్భూత మగుటచే 30 దినములు అగుచున్నది. వ్యవహితముగవచ్చు అధికమాసము 60 దినములగు చున్నది ఈ ప్రకారముగవచ్చునపుడు జాబాలి ఈ రకముగ చెప్పెను॥ ఏకస్మిన్నేవ వర్షేతు ద్వౌమాసావధిమాసకౌ। ప్రాక్పస్తత్ర పూర్వస్స్యాదుత్తరస్తు మలిమ్లుచః ఇతి॥ మాసద్వయే ఒబ్దవద్యేతు సంక్రాంతిర్నయదా భవేత్। ప్రాకృతస్తత్ర పూర్వస్స్యా దధిమాసస్తదోత్తరః॥ ఇతి॥ అబ్దేధి మాసయుగళం భవేద్యస్మిన్న సంక్రమం। శుద్ధమాసస్తయోః పూర్వః అధిమాసస్తదోత్తరః। మరియు వశిష్ఠః అర్కేందు మాసయోగః ప్రాగుక్తో దృశ్యతేయథాయుక్త్యా-కుర్యాత్తత్రైవ మాసౌ సంసర్పాంహస్పతి వాసరౌభవతః॥ ఇంతేగాక సూర్యసిద్ధాంత వ్యాఖ్యానమునందు మల్లయాచార్యుడు చూపించిన ప్రమాణ శ్లోకములు. అధిమాసస్యయుగళం భవేత్సన్నిహితం యది। ప్రథమాపరసంసర్పౌగ్రహ్య ఏవన సంశయః। ఏకాబ్దే రవిసంక్రమ-హీనౌచేత్ఫాల్గున చేతరమాసకౌ। ఫాల్గున ఏవశుభస్స్యాదన్యో మాసోధికః ప్రోక్తః। అబ్దేధి మాసయుగళం భవేద్యస్మిన్న సంక్రమం। అధిమాసస్తయోరాద్యః శుద్ధమాసః పరోభవేత్। మరియు స్మృత్యంతర వచనము క్షయమాసోయదా జాతస్సంసరాఖ్య ద్వయం భవేత్। ఈ ప్రమాణ వచనములన్నిటిని విమర్శించి యల్లయాచార్యుడు ఇట్లు విశదీకరించెను. అసంక్రాంతి ద్విసంక్రాంతి. ప్రాప్తికాలే పూర్వోక్తక్రమేణైవ

అధిమాసద్వయం వికల్ప్య అధిమాస నిర్ణయః కర్తవ్య ఇత్యర్థో వా వ్యతే। సంక్రాంతి రహితో మాసో యోవా సంక్రాంతి యుగ్మయుక్। పూర్వస్సంసర్పమాస స్యాదంహస్పతి రథాపరః॥ మలమాసావితిప్రోక్తౌ సర్వకర్మ బహిష్కృతౌ॥ అని వైద్యనాథీయమందు గల నారద వచనము స్మృత్యంతర వచనము॥ సత్యవ్రతుడు॥ ఏక ఏవ యదామాసః సంక్రాన్తి ద్వయ సంయుతః మాసద్వయగతం శ్రాద్ధం మలమాసేపి శస్యతే॥ అని॥ మరియు॥ స్పష్టమాస విశేషాఖ్యం విహితం వర్జయేన్మమే॥ అని నిర్ణయామృతాద్యుదాహృతస్మృతి వచనం ప్రత్యాబ్దిక విధాయక వచనము॥ "మాసపక్షతిథిస్పృష్టేయోయస్మిన్మ్రియతే హని। ప్రత్యబ్దంతు తథాభూతం క్షయాహం తన్యతం విదుః॥ అని కాలచంద్రికాద్యుదాహృతస్మృతి వచనము। ఇంతేగాక మదన రత్నాకర. స్మృతి చంద్రిక-జయసింహ కల్పద్రుమాద్యుదాహృతస్మృతి వచనము. "మాస ద్వయోదితం కర్మ తత్కుర్యాదితి నిర్ణయః ఏకస్మిన్ మాస మాసాద్వౌయదిస్యాతాంతయోర్ద్వయోః। తావే పక్షౌతా ఏవతిథయస్త్రింశదేవహి। అని కలదు ఈ ప్రమాణముల ననుసరించియే ధర్మసింధువునందు యత్రాపిక్షయమాద్వ్య వహితో పూర్వోధిమాసః యథాశ్వినోమాసః మార్గశిరః క్షయ "మాసః తత్రాపి ఆశ్వినమాస గతశ్రాద్ధం అధికే. శుద్ధేచ అశ్వినే కర్యం। ద్వయోరపి కర్మార్హత్వాత్। ఇ॥ రణవీరరత్నాకరమునందు" కార్తిక మార్గశిరయోః క్షయ మాసాంతః పాతే కార్తిక సంబధీని మార్గశిర సంబధీనియా నిశ్రాద్ధ వ్రతాదీ నియస్మిన్నక్షే. యస్యాంతిథా యస్మిన్న పరాహ్ణకారే విహితాని క్షయమాసే తత్రైవకర్వ్యాని। ఏవం క్షయ మాసాంతరే విదష్టవ్యం తతశ్చ కార్తిక శుక్ల ప్రతిత్ప్రయుక్తం పితృక్షయాహైకోద్దిష్టం మార్గశిర శుక్ల ప్రతిత్ప్రయుక్తంమాతుం క్షయాహైకోదిష్టం. చక్షయమాస శుక్ల ప్రతి పన్మధ్యాహ్నాదికాల ఏవ కర్తవ్యం। ఏవం అన్యాన్యపీతి దిక్। ఇట్లు విచారణ చేయగ క్షయమాస పూర్వభావ్యధిమాసమునక, ప్రాకృతత్వమును కొందరు, మలత్వమును కొందరు చెప్పుచున్నారు. ఆకారణముచే నిరమిత్రోదయమునందు-జయసింహ కల్పద్రుమమందు హేమాద్రియందు శ్రాద్ధాదిక విషయమున శుద్ధత్వమని స్పష్టపరచినరు. క్షయమాస పూర్వభావ్యధి మాసమునందు ప్రాకృ తత్వము చెప్పినను, సూర్యసంక్రాంతి లేద గావున మలమాసము అమలమాసమునందు (స్పష్ట)శుద్ధ మాసవిహిత కామ్యకర్మలగు వ్రతాదులు నిష్ఫలములగును గన "స్పష్టమాస విశేషాఖ్యం విహితం వర్జయేన్మమే" అను ప్రతి ప్రసవ వాక్యము నాధారముచేసి నవరాత్రాది దీపావళ్యంత కామ్య వ్రతములు నిజమాసమునందే చెప్పబడినవి। సంపూర్తిమాస లక్షణముతో ఒప్పారుచున్న కార్తిక మార్గశిరమాసముల యందు తత్తన్మాసవ్రత విశేషములు చెప్పబడినవి। క్షయమాసమునందు రెండుమాసములు స్వతంత్రములు కాక రెండుమాసకృత్యములను నిర్వర్తించవలెనని చెప్పెను. ఇక మాసికముల విషయమై విచారణ చేయబడుచున్నది॥ చైత్రాది మాసములతో కూడిన 12 మాసములు కల దానిని సంవత్సరముగను, ఇంతేగాక చైత్రాది మాసములకు ప్రాధాన్యత యిచ్చినట్లు కానరాదు కారణమేమనగా తిర్గి మరుచటి సంవత్సరములో ఆ మాసము కారోజు వర్కునగు సంవత్సరమును పైతృమేధిక సంవత్సరమని నిర్ణయించిరి అద్దు మాసగణన "మాసశ్చాంద్రతమృతాహ తిథిమారభ్యత్రింశత్తిథ్యాత్మకశ్చాంద్రో మాసః అని మాసిక నిర్ణయమున పురుషార్థ చింతామణిలో కలదు" మృతాహాన్మృతాహాంతో మాసః అని సుదీవిలోచనమున కలదు ఆ పైతృమేధిక సంవత్సరమున 14వ. మాసికము రాకుండగ సు-12 మాసికము సిద్ధించు టకు క్షయ మాస పూర్వోత్తరాది మాసములకు వైకల్పికముగ ప్రాకృతత్వ కల్పన చేసినట్లు పైతృమేధిక సారమువలన అర్థమగుచున్నట్లు స్పష్టము ఈ విషయము పట్టికలో విశదము కాగలదు. నిర్ణయ సింధు వ్యాఖ్యాత కృష్ణంభట్టు యాంతిథిగనము ప్రాప్యతలాంగచ్ఛతి భాస్కరంః. తయోవ సర్వసంక్రాతిర్యాన్వేషంన గచ్ఛతి॥ అనుదానిని స్వీకరించి శాస్త్రసిద్ధ మగు మాస లక్షణములతో కూడియున్న కార్తిక మాసప్రత్యాబ్దికమును నిజాశ్వయుజములోను. మార్గశిర మాస ప్రత్యాబ్దికమును కార్తికములోను ప్రమాణరహితముగ గు స్వతంత్రముగ వ్రాసెను. సమన్వయము చూపబడుచున్నది. అధిక మాసము వచ్చినపుడు ఉత్తర మాసము ను గ్రహించమని సామాన్య శాస్త్రము. క్షయమాస పూర్వభావ్యధి మాసమును గ్రహించమని విశేష

శాస్త్రము స్పష్టముగా విశేషముగ చెప్పబడిన కామ్యవ్రతాదుల విషయమై సూర్యసంక్రాంతి లేని మల (నపుంసక) మాసము నిషిద్ధమని ప్రతిప్రసవ శాస్త్రము. అధిక క్షయ మాసములలో సామాన్య శాస్త్రము క్షయ మాసము మలమాసమైనను మాసద్వయ శ్రాద్ధములు, వ్రతములు చేయవలెనని విశేష శాస్త్రము. ఇదిగాక వసిష్ఠ సంహితయందు క్షయ మాస పూర్వభావ్యధి మాసమునకు సంసర్పమని, యుగళీభూత క్షయ మాసమునకు క్షయ మాసమనియు, తదుత్తర వర్త్యధి మాసమునకు అంహస్పత్యమని వ్యవహరించినట్లు స్పష్టముగ గలదు. ముహూర్త చింతామణి లోకూడ నిట్లుగనే వ్యవహరించెను. సంసర్పాంహస్పతిశ్చేతి ద్వివిధాధి మాసకా అని చెప్పెను. ఇట్లు చెప్పుట వేదమూలకమని పించుచున్నది. కనుకనే తుల్యబల విరోధేసతి వికల్పః అను న్యాయము ననుసరించి 14 మాసికములు పైతృవైధిక సంవత్సరము నందు కలుగకుండ పరిహరించుటకు క్షయ పూర్వపర భావ్యధి మాసములకు వైకల్పికముగ ప్రాకృతత్వము పరిహార్యము. ఇంతవరకు కృష్ణంభట్టు మాసికముల సరిపెట్టుటకు ఒక మాసమును ముందుకు గెంటి సరిపెట్టెను. కాని ప్రత్యబ్దంతు తథాభూతం అనునపుడు ఇతను చూపిన ఆశ్వయుజమేకాని తథా భూతమైన కార్తికము కానేరదు. అదియుగాక క్షయ మాస, అధిక మాసములు వచ్చినపుడు వేరుగ చెప్పిన మాస లక్షణము నియతముగాదని చెప్పినపుడు, మాస లక్షణము వ్యభిచరించుచున్నది తత్పరిహారముగ అనార్షేయముగు అభూత కల్పనచేసి కార్తికమాస శ్రాద్ధమును ఆశ్వయుజమాన మార్గశిర శ్రాద్ధమును కార్తికమున పెట్టమనుట వ్యాస వచన విరోధము. కృష్ణంభట్టు విశృంఖల విహారము. "మృతాహం సమతిక్రమ్య చండాలేష్వభిజాయతే,

లేనట్లు ప్రత్యవాయజనకము గావున - ధర్మసింధు - నిర్ణయ రత్నాకరం - జయసింహ కల్పద్రుమ, హేమాద్రి మొదలగు ప్రాచీన నిబంధన కర్తల నిర్ణయమే పరిగ్రాహ్యము. కృష్ణంభట్టు నిర్ణయము స్మృతి విరుద్ధము, ప్రత్యవాయజనకము అగుచున్నది. స్మృతేర్వేద విరోధేతు పరిత్యాగో యథాభవేత్। తథైవ లౌకికం వాక్యం స్మృతి బాధే పరిత్యజేత్। కావున ఎంత మాత్రము గ్రహించతగినదికాదు. దుర్మతి సం॥ ఆశ్వయుజ శు ౧ లగాయతు॥ దుర్మతి సం॥ ఫాల్గున బ 30 వ్య వరకు గతించినవారికి 11వ రోజుననే కాబోవు మాసికములను ఊహచేసి విధి విధానముగ నడిపించవలయును గాన నేను అను మాసికముల వివరణ 1981 అక్టోబరు 2 తేదీన ఆంధ్రపత్రిక 4 వ పేజీలో ప్రకటించియున్నాము. తిరిగి ప్రకృతము దుర్మతి సం॥ ది॥ ఆశ్వయుజ శు ౧ లగాయతు దుందుభి సం॥ ది॥ క్షయోత్తరార్ధం (మాఘాంశ) లో గతించిన వారి వరకు అను మాసికములను ప్రత్యేక మాసవారీగ వివరించి చూపినాము. ఇంకను సందేహము కలవారు వచ్చి సంప్రదించి సందేహనివారణ చేసుకొనవచ్చును. ఈ ప్రకారం నిర్వర్తించిన కర్మలోపము రాదని శాస్త్ర నిర్ణయము॥ కొందరు నామమాత్ర సిద్ధాన్తులు ఒక మాసికమును మానవచ్చునని ఇదివరలో చెప్పియున్నారు. అట్లు మానుట కర్మలోపము. ప్రత్యవాయజనకమును అగును. ఏ మాసికమును మానకూడదు అని సర్వ గ్రంథ సమ్మతముగ శాస్త్రీయ మార్గము.

ఇట్లు,
పంచాంగ కర్తలు.

| మరణించినవారికి | అనుమాసికముల వివరణము | | | | | | | | | | | | | ప్రథమాబ్దికము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| దుర్మతి ఆశ్వయుజ | ఆశ్వ 1 | కార్తి 2 | మార్గ 3 | పౌష 4 | మాఘ 5 | ఫాల్గు 6 | చైత్ర 7 | వైశా 8 | జ్యే 9 | ఆషా 10 | శ్రావ 11 | భాద్ర 12 | | దుందుభిసం ఆశ్వయుజ |
| దుర్మతి కార్తిక | కార్తి 1 | మార్గ 2 | పౌష 3 | మాఘ 4 | ఫాల్గు 5 | చైత్ర 6 | వైశా 7 | జ్యేష్ఠ 8 | ఆషా 9 | శ్రావ 10 | భాద్ర 11 | సం ఆ 12 | ని. ఆ 12 | దుందుభి కార్తిక |
| దుర్మతి మార్గశిర | మార్గ 1 | పౌష 2 | మాఘ 3 | ఫాల్గు 4 | చైత్ర 5 | వైశా 6 | జ్యే 7 | ఆషా 8 | శ్రావ 9 | భాద్ర 10 | స ఆ 11 | ని ఆ 11 | కార్తి 12 | దుందుభి మార్గశిర |
| దుర్మతి పౌష | పౌష 1 | మాఘ 2 | ఫాల్గు 3 | చైత్ర 4 | వైశా 5 | జ్యే 6 | ఆషా 7 | శ్రావ 8 | భాద్ర 9 | సం.ఆ 10 | ని ఆ 10 | కార్తి 11 | మార్గ 12 | దుందుభి క్షయ |
| దుర్మతి మాఘ | మాఘ 1 | ఫాల్గు 2 | చైత్ర 3 | వైశా 4 | జ్యే 5 | ఆషా 6 | శ్రావ 7 | భాద్ర 8 | సం.ఆ 9 | ని.ఆ 10 | కార్తి 11 | మార్గ 12 | | దుందుభి క్షయ |
| దుర్మతి ఫాల్గున | ఫాల్గు 1 | చైత్ర 2 | వైశా 3 | జ్యేష్ఠ 4 | ఆషా 5 | శ్రావ 6 | భాద్ర 7 | సం ఆ 8 | ని ఆ 9 | కార్తి 10 | మార్గ 11 | క్షయ 12 | | దుందుభి అ. ఫా |
| దుందుభి చైత్ర | చైత్ర 1 | వైశా 2 | జ్యేష్ఠ 3 | ఆషా 4 | శ్రావ 5 | భాద్ర 6 | సం.ఆ 7 | ని ఆ 8 | కార్తి 9 | మార్గ 10 | క్షయ 11 | అ.ఫా 12 | ని ఫా 12 | రుధిరోద్గారి చైత్ర |
| దుందుభి వైశాఖ | వైశా 1 | జ్యేష్ఠ 2 | ఆషా 3 | శ్రావ 4 | భాద్ర 5 | సం ఆ 6 | ని ఆ 7 | కార్తి 8 | మార్గ 9 | క్షయ 10 | అ ఫా 11 | ని.ఫా 11 | చైత్ర 12 | రుధి వైశాఖ |
| దుందుభి జ్యేష్ఠ | జ్యేష్ఠ 1 | ఆషా 2 | శ్రావ 3 | భాద్ర 4 | సం ఆ 5 | ని. ఆ 6 | కార్తి 7 | మార్గ 8 | క్షయ 9 | అ. ఫా 10 | ని ఫా 10 | చైత్ర 11 | వైశా 12 | రుధి జ్యేష్ఠ |
| దుందుభి ఆషాఢ | ఆషా 1 | శ్రావ 2 | భాద్ర 3 | సం ఆ 4 | ని ఆ 5 | కార్తి 6 | మార్గ 7 | క్షయ 8 | అ. ఫా 9 | ని ఫా 9 | చైత్ర 10 | వైశా 11 | జ్యే 12 | రుధి ఆషాఢ |
| దుందుభి శ్రావణ | శ్రావ 1 | భాద్ర 2 | సం ఆ 3 | ని ఆ 4 | కార్తి 5 | మార్గ 6 | క్షయ 7 | అ. ఫా 8 | ని ఫా 8 | చైత్ర 9 | వైశా 10 | జ్యే 11 | ఆషా 12 | రుధి శ్రావణ |
| దుందుభి భాద్రపద | భాద్ర 1 | సం ఆ 2 | ని ఆ. 3 | కార్తి 4 | మార్గ 5 | క్షయ 6 | అ. ఫా 7 | ని ఫా 7 | చైత్ర 8 | వైశా 9 | జ్యే 10 | ఆషా 11 | శ్రావ 12 | రుధి భాద్రపద |
| దుందుభి సం. ఆశ్వయుజ | సం ఆ 1 | ని ఆ 2 | కార్తి 3 | మార్గ 4 | క్షయ 5 | అ ఫా 6 | ని ఫా 6 | చైత్ర 7 | వైశా 8 | జ్యే 9 | ఆషా 10 | శ్రావ 11 | భాద్ర 12 | రుధి ఆశ్వయుజ |
| దుందుభి ని ఆశ్వయుజ | ని ఆ 1 | కార్తి 2 | మార్గ 3 | క్షయ 4 | అ ఫా 5 | ని ఫా 6 | చైత్ర 7 | వైశా 8 | జ్యే 9 | ఆషా 10 | శ్రావ 11 | భాద్ర 12 | | రుధి ఆశ్వయుజ |
| దుందుభి కార్తిక | కార్తి 1 | మార్గ 2 | క్షయ 3 | అ.ఫా 4 | ని ఫా 5 | చైత్ర 6 | వైశా 7 | జ్యే 8 | ఆషా 9 | శ్రావ 10 | భాద్ర 11 | ఆశ్వి 12 | | రుధి కార్తిక |
| దుందుభి మార్గశిర | మార్గ 1 | క్షయ 2 | అ.ఫా 3 | ని ఫా 4 | చైత్ర 5 | వైశా 6 | జ్యే 7 | ఆషా 8 | శ్రావ 9 | భాద్ర 10 | ఆశ్వి 11 | కార్తి 12 | | రుధి మార్గశిర |
| దుందుభి క్షయ పూ పౌష | క్షయ 1 | అ.ఫా 2 | ని ఫా 3 | చైత్ర 4 | వైశా 5 | జ్యే 6 | ఆషా 7 | శ్రావ 8 | భాద్ర 9 | ఆశ్వి 10 | కార్తి 11 | మార్గ 12 | | రుధి పౌష |
| దుందుభి క్షయ ఉ మాఘ | క్షయ 1 | అ.ఫా 2 | ని ఫా 2 | చైత్ర 3 | వైశా 4 | జ్యే 5 | ఆషా 6 | శ్రావ 7 | భాద్ర 8 | ఆశ్వి 9 | కార్తి 10 | మార్గ 11 | పౌష 12 | రుధి మాఘ |

**N B.** రెండు మూడు మాసికముల మధ్య త్రైపక్షికమును, ఆరు-ఏడు మాసికముల మధ్యకాలములో ఊనషాణ్మాసికమును, ద్వాదశ [12] మాసిక ప్రథమాబ్దికముల మధ్యకాలములో ఊనాబ్దిక సంవత్సర విమోకములను యథావిధిగ నిర్వర్తించవలెను. ఏ మాసమునందు పోయినవారికి ఏ మాసికమును 2 పర్యాయములు చూపినామో వారికి ఆ మాసికమును రెండుమాసముల యందు ఆవృత్తి చేయవలెను. ఎట్లనగా దుర్మతి కార్తికములో మరణించిన వారికి మలమాస ప్రయుక్త ద్వాదశమాసిక, నిజమాస ప్రయుక్త ద్వాదశమాసిక మనియు, అట్లే దుందుభి సం॥ క్షయమాస మాఘాంశ యందు పోయిన వారికి మలమాస ప్రయుక్త ద్వితీయమాసిక, నిజమాస ప్రయుక్త ద్వితీయమాసిక మనియును ద్విరావృత్తి చేయవలయును. ఇట్లే ఈ పట్టికను చూచి 11వ రోజున ఊహచేసి నిర్వర్తించవలెను. ఈ విషయమున సందేహము కలవారు మాతో సంప్రదించవచ్చును

## జాతా శౌచాది విషయములు

స్త్రీలు బహిష్టు అయినప్పుడు, పురుడు వచ్చినపుడు, మరణము కలిగినను రాత్రి ప్రమాణము 3చే భాగింపగా మొదటి 1—2 భాగములలోగా నగుచో పూర్వదినమనియు 3వ భాగములోనయిన పరదినమనియు లెక్కించవలెను. గర్భము 6 మాసములు దాటినది లగాయతు అనగా 7వ మాసము వచ్చినది లగాయతు జ్ఞాతులకు అందరకును ప్రసవాశౌచము 10 రోజులు పట్టవలయును

మరణాశౌచము :— శిశువు గర్భమువందే మరణించినచో తల్లిదండ్రులకు, జ్ఞాతులకు 10 రోజులు పురుడు. శిశువు జన్మించి నాభిచ్ఛేదము కాకుండగానే మరణించినచో తల్లికి 10 దినములు పురుడు. తండ్రికి జ్ఞాతులకు 3 రోజులు జాతాశౌచము. మృతాశౌచము స్నానమాత్రముచే శుద్ధి. శిశువు నాభిచ్ఛేదానంతరము 10 దినములలోపుగా మరణించినచో జ్ఞాతులందరకు జాతాశౌచము కలదు. మృతాశౌచము స్నానమాత్రముచే శుద్ధి.

పురుడు శుద్ధి అయినప్పటి నుండియు దంతోత్పత్తి కాలమగు 6 మాసములలోపుగా శిశువు మరణించినచో తలిదండ్రులకు 3రోజులా శౌచము. జ్ఞాతులకు స్నానము మాత్రము.

6 మాసములు దాటినది లగాయతు 3 సంవత్సరములు నిండులోపుగా మరణించిన తల్లిదండ్రులకు 3 దినములు, మగశిశువగుచో జ్ఞాతులకు ఒకరోజు ఆశౌచము.* ఆడపిల్లయగుచో స్నానమాత్రమే జ్ఞాతులకు చేయదగియున్నది.

3 సంవత్సరములు దాటినది మొదలు ఉపనయన పర్యంతము మగవాడు మరణించిన జ్ఞాతులకు తల్లిదండ్రులకు 3 రోజులా శౌచము. వివాహోపనయనముల కాలముదాటిన స్త్రీ పురుషులు మరణించిన జ్ఞాతులు తలిదండ్రులు 10 రోజులు పూర్ణాశౌచము పట్టవలెను. రజస్వల అయిన స్త్రీ వివాహము కాకపోయినను మరణించినచో 10 రోజులు పూర్ణాశౌచము తల్లిదండ్రులు జ్ఞాతులుపట్టవలెను.

## మృతివిషయమై చెడునక్షత్రములు మొదలగునవి

౧,౨,౬,౭,౧౦,౧౨,౧౩, ౧౪ ఈ తిథులు ఆది, మంగళ, శుక్ర, శనివారములు, కృత్తిక, రోహిణి, మృగశిర్ష, పునర్వసు, మఘ, ఉత్తర, చిత్ర, విశాఖ, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతతార, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి ఈ నక్షత్రములు దోషములు. వీటియందు మృతిసంభవించినచో గృహమునకు దోషము. నక్షత్రము చెడుదైనచో అధిక దోషము. నక్షత్రము మంచిదై మిగిలినవి చెడువైనచో స్వల్పదోషము




ఈ చక్రము సూర్యుడు కృత్తికనక్షత్రములో నుండగా చూపబడినది. సూర్యుడున్న నక్షత్రము మొదలు మృత నక్షత్రము వరకు నభిజిత్తుతో కూడా లెక్కించవలెను. సూర్యుడున్న నక్షత్రము ఈశాన్య దిక్కున వ్రాసి అచటనుండి లోపల నాలుగు నక్షత్రములు దిక్కులయందు వ్రాసి లోపలనుండి వెలుపలకు మూడు నక్షత్రములు దిక్కులయందు వ్రాయవలెను అంతరంగము నందయితే మూడు పక్షములు మధ్యయందయితే రెండు పక్షములు దాని తరువాతదయిన నొకపక్షమును గృహమును విడువవలయును బాహ్యమందు శుభము. ఇంక పక్షిణీ విషయము.

సన్నిహితమున నున్న త్రిరాత్రమనియు, అసన్నిహితమయిన 90 ఘటికలనియు కొందరిమతము మరికొందరు సన్నిహితమున నున్నను అసన్నిహితమునున్నను మృతాహము నుండి 3 దినములు ఆశౌచము పట్టి నాల్గవ దినమున ఉదయమున శుద్ధియగును వివాహితులయిన కుమార్తెలకు దౌహిత్ర దౌహిత్రులకు వివాహితయైన పౌత్రికకు దశాహములోగా నెప్పుడు తెలిసినను త్రిరాత్రమృతా శౌచము పట్టవలెను. 9 లేక 10 రోజులలో మృత విషయమును విన్నను 11వ రోజుదయముననే శుద్ధియగును. మృతాహమునుండి 3వ దినముదాటినది లగాయతు దశాహములోగా విన్నచో కొందరు 90 ఘటికలనియు, మూడు దినములు పక్షిణియనియు, మరికొందరు స్నానమాత్రములోనే శుద్ధియనియు, మరికొందరు ఒకపగలు ఒకరాత్రి పట్టదగినదనియు నభిప్రాయము కలదు ఇందు త్రిరాత్రానంతరము దశాహము లోపుగా తెలిసిన ఒక పగలు ఒకరాత్రి అను అభిప్రాయమే యుక్తమని దోచుచున్నది దీనికి వారివారి సాంప్రదాయము ప్రధానము దశాహానంతరము తెలిసిన స్నానమాత్రముచేతనే శుద్ధియగును.

ఏకజాతీయములగు అనేకాశౌచములు కలియుటలో నేది మొదట యుత్పన్నమయినదో దానితోనే అంతమగును. తరువాత ఉత్పన్నమయినది మొదట విన్నను మొదట ఉత్పన్న మయినది తరువాత విన్నను మొదట ఉత్పన్నమయిన దానితోనే శుద్ధియగును. మొదట ఉత్పన్నమయిన దశరాత్రమృతా శౌచములో పిమ్మట ఉత్పన్నమయిన త్రిరాత్రమృతాసౌచము శుద్ధియగున గాని త్రిరాత్రమృతా శౌచములో దశరాత్రమృతా శౌచము శుద్ధికాదు మొదట ఉత్పన్నమయిన దశరాత్రమృతా శౌచము పట్టుచుండ పిమ్మట ఉత్పన్నమయిన జాతాశౌచము విన్నను దశరాత్రమృతా సౌచముతోనే శుద్ధియగును. ప్రథమముగా నుత్పన్నమయిన జాతాశౌచమున పిమ్మట ఉత్పన్నమయిన త్రిరాత్రమృతా శౌచమును శుద్ధిచేసికొని శేషజాతాశౌచమును పట్టవలెను ప్రథమమున నుత్పన్నమయిన త్రిరాత్రమృతా శౌచకాలమున తరువాత ఉత్పన్నమయిన జాతాశౌచము సంభవించిన మృతాశౌచమును శుద్ధిచేసికొని శేషజాతాశౌచమును పట్టవలెను.

పక్షిణీ పట్టదగినవారు : పినతల్లులు, పెదతల్లులు, మేనమామభార్యలు, వీరి స్త్రీ పురుష సంతానము, మాతాపితామహులు, పెదతండ్రి, పినతండ్రి, వీరి స్త్రీపురుషసంతానము, అన్నదమ్ములు, వారి స్త్రీ పురుషసంతానము, వివాహమయిన కుమార్తెలు, అల్లుండ్రు, కూతురు స్త్రీపురుషసంతానము, సవతితల్లిసోదరులకు, సాపత్ని సోదరసోదరీలకును (కొందరిమతము), పురుషులకు అక్కాచెల్లెండ్ర భర్తలు, భార్యసోదరులు, అత్తమామలు.

పక్షిణీ పట్టదగినివారలు :— వివాహమయిన స్త్రీలకు పెదతండ్రి, పినతండ్రిభార్యలు, భర్త సోదరుని కుమార్తెలు, అక్కాచెల్లెండ్రభర్తలు.

బ్రాహ్మణులకు 10దినములు, క్షత్రియులకు 12 దినములు, వైశ్యులకు 15 దినములు, శూద్రులకు 30 దినములని అన్ని ధర్మశాస్త్రములయందు ఆశౌచమని చెప్పబడియున్నది.

# నామ నక్షత్ర పరిజ్ఞానము

| అక్షరములు | | నక్షత్రము | అక్షరములు | | నక్షత్రము |
|---|---|---|---|---|---|
| చూ, చే, చో, లా | – | అశ్విని | రూ, రె, రో, తా | – | స్వాతి |
| లీ, లూ, లే, లో | – | భరణి | తీ, తూ, తే, తో | – | విశాఖ |
| అ, ఈ, ఉ, ఏ | – | కృత్తిక | నా, నీ, నూ, నే | – | అనూరాధ |
| ఓ, వా, వీ, వు | – | రోహిణి | నో, యా, యీ, యు | – | జ్యేష్ఠ |
| వే, వో, కా, కి | – | మృగశిర | యే, యో, బా, బి | – | మూల |
| కూ, ఖం, ఙ్, ఛ | – | ఆర్ద్ర | బూ, ధ, భ, ఢా | – | పూ.షాఢ |
| కే, కో, హా, హి | – | పునర్వసు | బే, బో, జా, జీ | – | ఉ.షాఢ |
| హూ, హే, హో, డ | – | పుష్యమి | జూ, జె, జో, ఖ | – | అభిజిత్ |
| డీ, డూ, డే, డో | – | ఆశ్లేష | ఖి ఖూ, ఖె, ఖో | – | శ్రవణ |
| మా, మీ, మూ, మే | – | మఘ | గా, గీ, గూ, గే | – | ధనిష్ఠ |
| మో, టా, టీ, టు | – | పుబ్బ | గో, సా, సీ, సు | – | శతభిషం |
| టే, టో, పా, పి | – | ఉత్తర | సే, సో దా, ది | – | పూ.భాద్ర |
| పూ, ష, ణ, ఢ | – | హస్త | దూ, శం, ఝ, థ | – | ఉ.భాద్ర |
| పే, పో, రా, రీ | – | చిత్త | దే, దో, చా, చీ | – | రేవతి |

వారివారి పేర్ల ననుసరించి పేరుయొక్క మొదటి అక్షరము చెప్పబడిన 27 నక్షత్రములలో ఏ నక్షత్రమున, ఏ పాదమునకు చెందినదగుచున్నదో దానినిబట్టి యూహింపవలయును. ప్రతి నక్షత్రమునకున్ను చెప్పబడిన 4 అక్షరములను 4 పాదములుగా తెలియవలెను. అక్షరసంధి గల పేర్లకు, (కృష్ణ హ్రస్వ శ్రీధర ఇత్యాదులకు) నిర్ణీత నక్షత్రములున్నవి. జన్మనక్షత్రమును గుర్తెరుంగనివారలకున్ను నామ నక్షత్ర ప్రధానము కొన్ని కొన్ని విషయములకున్ను నామనక్షత్రమును బట్టియే ఫలితముల నాలోచించి చెప్పవలెను

## గ్రహములకు మిత్రత్వ శత్రుత్వ సమత్వములు

సూర్యునకు — శుక్ర, శనులు శత్రువులు బుధుడు సముడు. ఇతరులు మిత్రులు చంద్రునకు — సూర్య, బుధులు మిత్రులు ఇతరులు సములు శత్రువు లేడు కుజునకు— రవి, చంద్ర, గురులు మిత్రులు. బుధుడు శత్రువు. శుక్ర, శనులు సములు. బుధునకు— రవి, శుక్రులు మిత్రులు చంద్రుడు శత్రువు. ఇతరులు సములు గురునకు — బుధ, శుక్రులు శత్రువులు శని సముడు ఇతరులు మిత్రుల. శుక్రునకు — బుధ, శనులు మిత్రులు కుజ, గురులు సములు ఇతరులు శత్రువులు. శనికి— బుధ, శుక్రులు మిత్రులు. గురుడు సముడు. ఇతరులు శత్రువులు (మూల త్రికోణరాశి నుండి, "స్వస్వాంత్య ధీధర్మ స్వోచ్చాయున్సుఖపాః" అను సూత్రముచే చెప్పబడినది వివరింపబడెను.)

## తాత్కాలిక మిత్రత శత్రుత్వ సమత్వములు

అన్యోన్యస్య ధనవ్యయాయ సహజ వ్యాపార బంధుస్థితా స్తత్కాలే సుహృదస్స్వతుంగభవనే ప్యేకే రయ స్త్వన్యథా॥ ద్వ్యేకానుక్త భవాన్సుహృత్సమ రిపూన్సంచింత్య నైసర్గికాం స త్కాలేతః పునస్తు తానధి సుహృన్మిత్రాదిభిః కల్పయేత్.

తా॥ ఒకరికొకరు 2, 12, 11, 3, 10, 4 స్థానములందున్న తాత్కాలిక (జననాది సమయము నందు) మిత్రులగుదురు తమ ఉచ్చరాశియందున్న గ్రహము తనకు మిత్రమని కొందరి మతము చెప్పబడిన వాటికంటే నితర స్థానములందున్న గ్రహములు తాత్కాలిక శత్రువులు తన మూల త్రికోణరాశి నుండి 2, 12, 5, 9, 4, 8 ఉచ్చ రాశ్యధిపతులు మిత్రులు ఇతరులు శత్రువులు. రెండు లక్షణములున్న గ్రహములు సములు అను విషయము "స్వస్వాంత్యధీ ధర్మస్వో చ్చాయున్సుఖపాః" సూత్రమున గలదు. దీనిచే నగు శత్రు మిత్రాది విచారము పై శ్లోకములలో వివరింప బడినది దానిచే నగు శత్రు ... నైసర్గిక తాత్కాలిక శత్రుత్వాదులను గమనించి అధిమిత్ర, అధి శత్రుత్వ

దికము నిర్ణయింపవలెను. ఎట్లనగా— చెప్పబడిన మిత్రస్థానములందు మిత్ర గ్రహమున్న అధిమిత్రము, సముడున్న మిత్రము, శత్రువున్న సముడును అగును. ఇతరములగు శత్రుస్థానములందు మిత్రుడున్న సముడు, సముడున్న శత్రువు, శత్రువున్న అధిశత్రువునగును

## లగ్నాది ద్వాదశభావములకు ఆధిపత్యములు

జన్మలగ్నము మొదలుకొని క్రమముగా ద్వాదశ భావములకు తను, ధన, భ్రాతృ, మాతృ, పుత్ర, శత్రు, కళత్ర, ఆయు, ర్భాగ్య, రాజ్య, లాభ వ్యయములనెడు సంజ్ఞలగును

మేష లగ్నమునకు:— లగ్నాష్టమాధిపతి కుజుడు, తృతీయ షష్ఠాధిపతిబుధుడు, ధనసప్తమాధిపతి శుక్రుడు, వాహనాధిపతి చంద్రుడు, పంచమాధిపతి సూర్యుడు, భాగ్య వ్యయాధిపతి బృహస్పతి ,రాజ్య లాభాధిపతి శని

వృషభలగ్నమునకు:— లగ్న షష్టాధిపతి శుక్రుడు ధన పంచమాధిపతి బుధుడు., తృతీయాధిపతి చంద్రుడు, వాహనాధిపతి సూర్యుడు, సప్తమ వ్యయాధిపతి కుజుడు, అష్టమ లాభాధిపతి బృహస్పతి, భాగ్య రాజ్యాధిపతి శని.

మిధున లగ్న మునకు:— లగ్న వాహనాధిపతి బుధుడు, ధనాధిపతి చంద్రుడు. తృతీయాధిపతి సూర్యుడు , పంచమవ్యయాధిపతి శుక్రుడు, షష్ఠ లాభాధిపతి కుజుడు, సప్తమ రాజ్యాధిపతి బృహస్పతి, అష్టమ భాగ్యాధిపతి శని

కర్కాటక లగ్నమునకు — లగ్నాధిపతి చంద్రుడు, ధనాధిపతి సూర్యుడు, తృతీయ వ్యయాధిపతి బుధుడు, వాహన లాభాధిపతి శుక్రుడు, పంచమ రాజ్యాధిపతి కుజుడు, షష్ఠ భాగ్యాధిపతి బృహస్పతి, సప్తమాష్టమాధిపతి శని

సింహలగ్నమునకు — లగ్నాధిపతి సూర్యుడు ధన లాభాధిపతి బుధుడు తృతీయ రాజ్యాధిపతి శుక్రుడు, వాహన భాగ్యాధిపతి కుజుడు, పంచమాష్టమాధిపతిబృహస్పతి, షష్ఠ సప్తమాధిపతి శని. వ్యయాధిపతి చంద్రుడు

కన్యాలగ్నమునకు:— లగ్న రాజ్యాధిపతి బుధుడు, ధన భాగ్యాధిపతి శుక్రుడు, తృతీయాష్టమాధిపతి కుజుడు, వాహన సప్తమాధిపతి బృహస్పతి, పంచమ షష్టాధిపతి శని, లాభాధిపతి చంద్రుడు, వ్యయాధిపతి సూర్యుడు

తులా లగ్నమునకు — లగ్నాష్టమాధిపతి శుక్రుడు, ధన సప్తమాధిపతి కుజుడు తృతీయ షష్టాధిపతి బృహస్పతి, వాహన పంచమాధిపతి శని, భాగ్యవ్యయాధిపతి బుధుడు, రాజ్యాధిపతి చంద్రుడు, లాభాధిపతి సూర్యుడు.

వృశ్చిక లగ్నమునకు:— లగ్న షష్టాధిపతి కుజుడు, ధన పంచమాధిపతి బృహస్పతి, తృతీయ వాహనాధిపతి శని, సప్తమ వ్యయాధిపతి శుక్రుడు, అష్టమ లాభాధిపతి బుధుడు, భాగ్యాధిపతి చంద్రుడు రాజ్యాధిపతి సూర్యుడు.

ధనుర్లగ్నమునకు — లగ్న వాహనాధిపతి బృహస్పతి, ద్వితీయ తృతీయాధిపతి శని, పంచమ వ్యయాధిపతి అంగారకుడు, షష్ఠ లాభాధిపతి శుక్రుడు,సప్తమరాజ్యాధిపతిబుధుడు, అష్టమాధిపతి చంద్రుడు భాగ్యాధిపతి సూర్యుడు

మకర లగ్నమునకు — లగ్న ద్వితీయాధిపతి శని, తృతీయ వ్యయాధిపతి బృహస్పతి, వాహనలాభాధిపతి కుజుడు, పంచమ రాజ్యాధిపతి శుక్రుడు, షష్ఠ భాగ్యాధిపతిబుధుడు, సప్తమాధిపతి చంద్రుడు, అష్టమాధిపతి సూర్యుడు

కుంభ లగ్నమునకు — లగ్న వ్యయాధిపతి శని, ధన లాభాధిపతి బృహస్పతి, తృతీయ రాజ్యాధిపతి కుజుడు, వాహనభాగ్యాధిపతి శుక్రుడు, పంచమాష్టమాధిపతి బుధుడు,షష్ఠాధిపతి చంద్రుడు, సప్త మాధిపతి సూర్యుడు

మీన లగ్నమునకు — లగ్న రాజ్యాధిపతి బృహస్పతి, ధన భాగ్యాధిపతి కుజుడు, తృతీయాష్టమాధిపతి శుక్రుడు, వాహన సప్తమాధిపతి బుధుడు పంచమాధిపతి చంద్రుడు, షష్ఠాధిపతి సూర్యుడు లాభ వ్యయాధిపతి శని.

